# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వుండాలి...



# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని సిద్ధం చేస్తుంది— రుచికరమైన విధంగా.

మీ పాపకి నాలుగు నెలలు నిండి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, సిరిలాక్ గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి. మీ పాపకి సిరిలాక్ ఆహారంగా యిచ్చిన ప్రతి పర్యాయము సంపూర్ణ పోషకాహారం యిచ్చామనే నమ్మకం మీకు మరొకసారి కలుగుతుంది.

అనగా సిరిలాక్ యిచ్చిన ప్రతి పర్యాయము ఒక ఘన ఆహార పదార్థం నుంచి అవసరమైన అన్ని పోషకాలు. మాంసకృత్తులు, కాలరీలు, పాపకి లభిస్తున్నట్లే. అది యిస్తూ పోషక పదార్థాల లోపం తొలగించడానికి మరొకటి ఇవ్వవలసిన అవసరం లేదు.

గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు, పంచదార రుచికరంగా కలిపి వుండడం చేత సిరిలాక్‌కి ఈ సంపూర్ణ పోషకత్వం, రుచి లభించాయి. శరీర నిర్మాణానికి మాంసకృత్తులు, శక్తికి పిండి పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు, అన్ని విధాల పెరుగుదలకి అత్యంత అవసరమైన విటమిన్లు, ఖనిజాలు సిరిలాక్ అందచేస్తుంది.

మీ పాపకి సిరిలాక్ యివ్వండి—పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి.




# సిరిలాక్®

పాలు వుండనే వున్నాయి




SAA/FSL/C/2670 TEL

NESTLÉ.

దేశ విఖ్యాతిగాంచిన విమల్ చీరల్లో సరిక్రొత్త శ్రేణికై
విచ్చేయండి నేడే మంగళ్ దీప్ కి.




మంగళ్‌దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం

® is the registered trademark of Reliance Textile Industries Ltd. Mudra/RTI/1066 TEL

## ముఖచిత్రం

27–5–83ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నా అభిమాన నటి అందాలతార 'దీప' ముఖచిత్రం నన్ను ముగ్ధున్ని చేసింది. ఆల్‌బమ్‌లో చోటు చేసాను.

ఎస్. సాయిపోతన (కశింకోట)

## కథలు

27–5–83 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం చాలా బావుంది. ''ఎడారిలో–ఎర్ర కలువ'' కథ చాలా బావుంది.

ఎ. శశిధర్ (రామగుండము)

*　　*　　*

ఈ వారం (20–5–1983) 'ముగింపు మారని కథ' బాగుంది. నిజమే. ఈ సమాజంలో ఒకసారి పెళ్ళయిన ఆడదాన్ని మళ్ళీ పెళ్ళాడటానికి సాధారణంగా ఏ మగాడు ముందుకు రాడు. వచ్చినా అందుకు అతని స్వార్థమో లేక కథలో వారిజకులా ఆమె వెనుకనున్న డబ్బో కారణమై తీరాలి. ఇది జీవిత సత్యం.

శ్రీమతి పరాగిత్ (రాయచోటి)

*　　*　　*

20–5–83 సంచికలోని 'పుట్టినరోజు' కథ బాగుంది. 'స్వయంకృతం' నీతి పాతదైనా, చెప్పేవిధం వేరుగా, క్రొత్తగా ఉంది. 'ముగింపు మారని కథ' మనస్సులను వికలం చేసింది.

ఇస్మాయిల్ ఖాన్ (నందిగామ)

*　　*　　*

27–5–83 వారపత్రికలో 'రాయబారం' కథ బాగున్నా, పరిష్కారం రచయిత సూచించకుండా మధ్యలో ముగించటం బాగాలేదు. అన్నెం పున్నెం ఎరుగని రమాదేవిని అపనింద పాల్జేసి కథ ముగించటం సబబుగా లేదు.

కె. సుబ్రహ్మణ్యం (బెంగుళూరు)

*　　*　　*

27–5–83 నాటి ''ఆంధ్ర సచిత్ర వారపత్రిక'' ముఖచిత్రం చూడగానే ఆకట్టుకునేలావుంది. శాస్త్రుర్లుగారి ''రాయబారం'' కథ వాస్తవానికి దగ్గరగా వుంది.

కొమ్మినేని ప్రసాద్ (గుంటూరు)



## సీరియల్స్

27–5–83 నాటి ''ఆంధ్ర సచిత్ర వారపత్రిక'' ముఖచిత్రం నటి ''దీప'' చాలా బాగుంది. ''అతడు అడవిని జయించాడు'' సీరియల్ చాలా బాగుంది.

రమణమూర్తి, ప్రసాదరావు. (టెక్కలి)

*　　*　　*

నటి 'దీప' ముఖచిత్రంతో వెలువడిన (తే 27–5–83 దీ) పత్రిక అత్యంత ఆకర్షణీయముగా వుంది. ఇది 'మేఘసందేశమూ' సీరియల్ ప్రారంభంలోనే నన్నెంతగానో ఆకట్టుకుంది.

ఎమ్.వి.ఎస్. మూర్తి (వేణమ్మపేట)

*　　*　　*

నా అభిమాన నటి 'జయప్రద' ముఖచిత్రం చాలా ఆకర్షణీయముగా ఉంది. ''అతడు అడవిని జయించాడు'' మొదటలోనే మమ్ములను ఆకట్టుకుంది.

పి. రవికుమార్ (గూడూరు)

*　　*　　*

27–5–83న వెలువడిన నటి దీప ముఖచిత్రము ఆకర్ష యణ గా వున్నది. సీరియల్ 'తిరుచరణాలు' మొదటిలోనే మమ్మి ఆకట్టుకుంది.

బంక లీలానాగకుమారి (విజయవాడ)

*　　*　　*

''ఇది మేఘసందేశమూ'' సీరియల్ నన్ను మొదట్లోనే ఆకట్టుకొంది. ''తిరుచరణాలు'' చాలా ఆకర్షణీయంగా ఉంది. ''జీవిత సమరం'' ముగింపు చాలా బాగుంది.

గిడుతూరి సుశీల (పెదనింద్రకొలను) ●




**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

*శివలెంక శంభుప్రసాద్*

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 24–6–'83

రుధిరోద్గారి నామ సం. జ్యేష్ఠ శు. చతుర్దశి

**సంపుటము 75　సంచిక 43**

సంపాదకుడు :

*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల　రు. 1-50

ఆరు మాసాల చందా　రు. 42-90

పోస్టులో ఏడాది చందా　రు. 85-80

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం.　విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నర్తకి సబిత

(ఫొటో : బి.పి. రెడ్డి)

# ట్రిలో

## ఉపయోగించడానికి మీకొక మంచి కారణం:




## ఇతర ప్రముఖ డిటర్జెంట్ బిళ్లలకన్న దీని ధర 30% తక్కువ.

### ఇదిగో, ఇంకా మూడు కారణాలు:

### మరింత నురుగు



దీని సమృద్ధమైన నురుగు మరే డిటర్జెంట్ బిళ్లకన్న ఎక్కువ బట్టలను శుభ్రం చేస్తుంది.

### మరింత ఉతికే శక్తి

అతిగా మాసిన బట్టల్ని కూడ చక్కగా శుభ్రం చేయగలది ట్రిలో. అందులోనే ఉన్న బ్లూ తెల్లటి బట్టలకు వాటి అసలు తెల్లదనపు మెరుపు తెస్తుంది.



### మరింత మన్నిక



ట్రిలో సులువుగా మెత్తబడిపోదు. అందుకే అందులో వృథాపోయేది ఎంత మాత్రం ఉండదు. పూర్తిగా అరిగిపోయేదాకా ట్రిలోను వాడవచ్చు.

**ట్రిలో** — మరింత ఉపయోగకరమైన నీలి డిటర్జెంట్ బిళ్ల.

Godrej ఉత్పాదన

CHAITRA-GS-188 TEL

# మనది రెండవ తరగతి సమాజంగా ఎందుకు ఉన్నది!

భారతీయులు చాలా తెలివైన వారు : వారు తమ అపజయాలను ఏవో కుంటిసాకులతో సమర్థించుకోవటంలో ఘనులు. ఎప్పుడో జరుగవలసిన పని ఇంత ఆలస్యం అయిందేమని ఏ ప్రభుత్వ అధికారినిగాని, ఏ రాజకీయవేత్తనుగాని ప్రశ్నిస్తే వందలకొద్దీ కారణాలు చెపుతారు. శ్రీమతి గాంధీ కూడా ఇలాంటి జవాబులు ఇవ్వటంలో చాలా దిట్ట. ప్రభుత్వం పల్లెలకు నీటి సదుపాయం ఎందుకని చేయలేకపోతోందన్న దానికి ఆమె చాలా కారణాలు చెప్పారు. శ్రీమతి గాంధీ ఇచ్చిన వివరాల్ని బట్టి ఏవో కొన్ని గ్రామాలకి మాత్రమే నీటి సదుపాయం లేదు అనే ఊహ కలుగుతుంది. కాని, వాస్తవానికి జరుగుతున్నది దీనికి వ్యతిరేకం. ఆమె కారణాలు వరుసగా ఏకరువు పెట్టకపోయినప్పటికి అసలైన కారణం ఒకటే అది ప్రభుత్వ నిర్లక్ష్యం !

జాతి శక్తి అంతా కారణాలు చెప్పడంలో నష్టపోతే నిర్మాణాత్మకమైన పనికి ఏ కొద్ది శక్తో మిగిలి వుంటుంది. సమాజం తనలో ఉద్భవించే కొత్త భావాలు లేదా ఆలోచనలని, పాతవైనా కొత్త పంథాలో సాగే నిర్మాణాత్మకమైనవాటిని,బట్టి గుర్తింపబడుతుంది. ఇప్పటికీ 50 సం॥ పూర్వానికి చాలా తేడా వుంది. అప్పుడు మనం ఉపయోగించిన వస్తువులకు ఇప్పుడు మనం ఉపయోగించే వస్తువులకు కూడ చాలా వ్యత్యాసం ఉంది. నిజంగా ఇప్పుడు మనం వాడే ఉత్పత్తులన్నీ మన కర్మాగారాలలో తయారైనవే కానీ వాటిని కనిపెట్టిన వారు మాత్రం విదేశీయులే. ఈ విధమైన అనుకరణ వలన మన సమాజం రెండవ తరగతి సమాజంగా తయారయింది. స్వచ్ఛమైన వజ్రాలతో వ్యాపారం చేసేవాడికి కృత్రిమమైన రాళ్ళతో వ్యాపారం చేసేవాడికి ఎంతో పెద్దతేడా ఉన్నది. మనకూ అమెరికన్లకు, బ్రిటిషువారికి, జపానువారికి మధ్యఉన్న వ్యత్యాసం ఇదే.

ఈ శతాబ్దం ఆరంభంనుంచి దాదాపురెండు డజన్ల కొత్తవస్తువులను కనిపెట్టారు; బాల్ పెన్ నుంచి పాలిస్టర్ వస్త్రాలవరకు కానీ ఇవేవీకూడ మన స్వంతంకాదు. శాస్త్రీయ, సాంకేతికపరంగా తీసుకుంటె భారతీయసహకారం సున్న అనే చెప్పాలి. మనం బాల్ పెన్నులు, పాలిస్టర్‌వస్త్రాలు తయారుచేస్తున్నాం కాని అవి తయారుచేసే నిపుణత మనదికాదు, చాలా వరకు వాటిని తయారుచేసే యంత్రాలుకూడా మనవి కావు. అరువుతెచ్చుకున్న ఆలోచనలతో నడిచే ఏ సమాజమైన సరే రెండవతరగతి సమాజం అవుతుందేకాని స్వయంశక్తితో ప్రకాశించే ఆత్మవిశ్వాసంగల సమాజంతో ఎప్పటికీ సరితూగలేదు.

మొదట అరువుబేరం చేస్తూ క్రమేణా గొప్పవారి, తెలివైనవారి దయాధర్మ భిక్షకు ఎదురుచూసేటంతటి హీనస్థితికి మనం దిగజారాం. ఈ విధంగా మన జాతే ముష్టిఎత్తుకునేజాతి అయ్యింది. డబ్బుకి, ఆహారానికి, నిపుణాలకు మనం ముష్టి ఎత్తుతున్నాం. ద్రవ్యం విషయమే తీసుకోండి, మనం అప్పు తీసుకోనిసంస్థ ఏదైనా ఉందా ? ఈ రోజుకి మన ఆర్థికమంత్రి విదేశయానం చేస్తే చేతిలో అక్షయపాత్ర లేకుండా వెళ్ళరు. శ్రీమతి గాంధీ తరపున శ్రీ ప్రణబ్‌ముఖర్జీ బిచ్చమెత్తుకునే పాత్రను పోషిస్తున్నారు. ఇటీవల ఈయన మనీలాలోని ఏషియన్ డెవెలప్‌మెంట్ బ్యాంక్ సమావేశానికి వెళ్ళి దిగీ దిగడంతో నే తన రాకలోని ముఖ్యోద్దేశ్యం ఒక పది కోట్ల రూపాయలు అప్పు కోసం అని చెప్పారు. ఇంతకు ముందు లక్షల్లో ఉన్న అంకె ఇప్పుడు కోట్లలోకి మారింది. ఏదో ఒక విషయంలో బిచ్చమెత్తని మంత్రి గాని, అధికారి గాని మచ్చుకులేరు. ఐ జి. పటేల్, మన్‌మోహన్‌సింగ్ లాంటివారు ఈ విద్యలో ఆరితేరినవారు.

దీనికి పర్యవసానంగా మన శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు ఇతరులమీద ఆధారపడి పని చేస్తున్నారు, ఆహారం, వంటచెరకు, వస్త్రాలు, మన భారతదేశానికున్న ముఖ్య సమస్యలు. ఎక్కువ వేడి ఉండే మన దేశంలో శక్తికి మూలాధారం సూర్యుడు, మనకి ఈ సౌరశక్తి మీద పని చేయడానికి వాస్తవంగా వేలాది ఇంజనీర్లు, శాస్త్రవేత్తలు ఉండాలి. కాని మనకు వందమంది కూడ లేరు. ఉదాహరణకు ఇళ్ళని వేసవిలో చల్లగా ఉంచడానికి సౌరశక్తి ఎంతో ఉపయోగిస్తుంది. కాని ఎవరూ ఈ సమస్యపై కృషి చెయ్యడం లేదు. సామాన్య మానవుడికి అందుబాటులో లేని అత్యంత ఖరీదైన ఏర్ కండిషనర్లను తయారు చేయడంలోనే మన ఇంజనీర్లు నిమగ్నులై ఉన్నారు. అణుశక్తి మీద ఖర్చుపెట్టే దానిలో నెయ్యోవంతు సౌరశక్తిపై ఖర్చుపెడితే ఎక్కువ మందికి మేలు చేసిన వాళ్ళమవడమే కాకుండా స్వచ్ఛత, కొత్తదనంతో పైకి వచ్చిన వారమవుతాం.




ఈ ముష్టివాళ్ల నాటకానికి ఫలితమేమిటి అంటే దీనిలో పాల్గొనేవారు మన రాజకీయవేత్తలు, అధికారుల లాగా సిగ్గు, లజ్జ వదిలేస్తారు. మన గురించి విదేశీయులు ఏమన్నా మనం అంగీకరిస్తాం. ఎందుకంటే వారు విదేశీయులు కనుక.

మన దేశంలో ఎంతోమంది గొప్పనటులూ దర్శకులూ ఉన్నారు. వారు గాంధీ చిత్రాన్ని తీయగలరు. అయినా మనకి రిచర్డ్ అటెన్‌బరోనే కావాలి. తన చిత్రం బాగా సొమ్ము చేసుకోడానికి ఆయన ఆ మహాత్ముని జీవితాన్ని, తత్వాన్ని ఎలా మార్పు చేసినా ఫర్వాలేదు !

విదేశీయుల మెప్పు కోసం పెద్ద పెద్ద ప్రాజెక్టుల ప్రారంభిస్తున్నాం ఎందుకంటే ప్రపంచ బ్యాంక్, లేదా ఫోర్డు ఫౌండేషన్ అలా చెయ్యమన్నారు కనుక చేస్తున్నాం. వారు ఇక్కడికి వచ్చి ఈ ప్రాజెక్టును చూసి ఒక చక్కని యోగ్యతా పత్రాన్ని ఇస్తారని ఆశ ! మనది చప్రాసీ బుద్ధి. ఇంగ్లీషు వారు ఇండియా వదిలేస్తూ వారి వంట వాళ్లకు, జమేదార్లకు ఇలాంటి పత్రాల్నే ఇచ్చేవారు. శ్రీమతి ఇందిరా గాంధీ కూడా ఇలాంటి పత్రాల్ని విదేశీయుల నుంచి సేకరిస్తున్నారు. కామన్‌వెల్త్ సభలలో పాల్గొనేందుకు వచ్చే కొద్ది మంది ప్రధాన మంత్రులు,రాష్ట్రపతులు,మంత్రుల సౌకర్యార్థం గోవాలో 10 కోట్లు వెచ్చించి ఒక కొత్త ఎస్టేటుని శ్రీమతి ఇందిరాగాంధీ కట్టిస్తున్నారు. వారు అక్కడ గడిపేది ఒకటి రెండు రోజులు! శ్రీమతి గాంధీ, భారతదేశం అన్నా భారతీయులన్నా సిగ్గుపడుతూ ఉండి ఉండాలి, లేదా వెదజల్లను విశేషమైన ధనం ఉందని భావించి ఉండాలి. ఆమె మనల్ని చూసి సిగ్గుపడుతున్నదని ఉద్దేశ్యం. ★



# బాబీ కేసులో బీహారు రాష్ట్ర కాంగ్రెస్ (ఐ) ప్రముఖులు?

పాట్నాలో ఇటీవల పెద్ద సంచలనాన్ని సృష్టించిన బాబీ హత్య కేసులో దర్యాప్తుని రాష్ట్ర ప్రభుత్వం సి. బి. ఐ.కి బదలాయించడంతో ఈ కేసులో సంబంధం ఉన్న అధికార పక్షంలోని కొన్ని పెద్ద తలలు బయట పడతాయని అంతా ఆసక్తితో ఎదురు చూస్తున్నారు.

కుమారి స్వేతనిషా త్రివేది ఉరఫ్ బాబీ బీహార్ శాసన మండలి సభ్యురాలు, మండలి మాజీ ఉపాధ్యక్షురాలైన కుమారి రాజేశ్వరీ సరోజ్‌దాస్ దత్తపుత్రిక. సభాపతి కుమారునికి కూడా ఈ హత్యతో సంబంధం ఉన్నట్లు కుమారి సరోజ్‌దాస్ మెజిస్ట్రేట్‌కీ, పోలీసులకీ యిచ్చిన వాఙ్మూలంలో పేర్కొన్నారు. మరికొన్ని పేర్లు కూడా బయటకి వస్తున్నాయి.

జిల్లా పోలీసు తమ వలని విస్తృతం చేసి నేరస్తులుగా అనుమానితులైనవారిని నిర్బంధంలోకి తీసుకోబోతున్న తరుణంలో బీహారు ముఖ్యమంత్రి డా. జగన్నాథ్ మిశ్రా ఈ కేసుని సి. బి. ఐ.కి బదలాయించాలనే హఠాత్ నిర్ణయం తీసుకుని, ఆ మేరకి ఉత్తర్వులపై సంతకం పెట్టి వెంటనే విమానంలో కాశ్మీర్ వెళ్లిపోయారు. వివాదాస్పదమైన ఈ చిక్కునించి తప్పుకోడానికే ఆయన అలా చేశారని అంటున్నారు.

"జిల్లా పోలీసులు తమ కర్తవ్యాన్ని సమర్థవంతంగా, చురుకుగా నిర్వహిస్తున్నప్పుడు ఈ సి. బి. ఐ. విచారణ అనవసరం" అన్నారు ప్రతిపక్ష నాయకుడు శ్రీ కర్పూరీ ఠాకూర్. సి. బి. ఐ. చేత విచారణ జరిపించాలని అంతకి పూర్వం పట్టుపట్టింది కూడా ఆయనే!

శ్రీ కర్పూరీ ఠాకూర్ రంగు మార్చడం ఎంత ఆశ్చర్యంగా ఉందో రాష్ట్ర ప్రభుత్వం ఈ కేసుని సి. బి. ఐ.కి బదలాయించడం కూడ అంతే విచిత్రంగా ఉంది. సి.బి.ఐ. దర్యాప్తు పోకడ ఎలా ఉన్నా, ఈ కేంద్ర సంస్థ పకడ్బందీగా ఛార్జ్ షీట్ తయారుచేసి నేరస్తులనే వారిని నిర్బంధంలోకి తీసుకోడానికి కొంత కాలం పడుతుంది. బీహారులో అధికారంలో ఉన్న రాజకీయ నాయకుల అరెస్టులు జరిగితే జమ్మూ – కాశ్మీరు ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ)పై దాని ప్రభావం పడి, పార్టీ విజయావకాశాలు దెబ్బ తింటాయి.

జిల్లా పోలీసులకి స్వేచ్ఛ యివ్వడం వల్ల డా. జగన్నాథ్ మిశ్రాకి వ్యక్తిగతంగా మంచి పేరు వస్తుంది కానీ పార్టీ ప్రతిష్ఠ దెబ్బ తింటుంది. డా. మిశ్రాని తీవ్రంగా విమర్శించేవారు కూడా స్త్రీ లోలత్వం, మద్యపానం వంటి బలహీనతలు ఆయనకి లేవనే అంటారు. కానీ పార్టీలోనే ఆయనని వ్యతిరేకించేవారి విషయంలో మాత్రం అవి లేవని చెప్పడానికి వీలులేదు. అందువల్ల డా. మిశ్రా ఈ సంఘటనని తన బలాన్ని పెంచుకోడానికీ, ఇతరుల బలహీనతలని బయటపెట్టడానికీ బాగా వాడుకున్నారని అసమ్మతి వర్గం నాయకులొకరు అన్నారు.

పోలీసులు చెప్పినదాన్నిబట్టి బాబీ మే 8న కొన్ని విచిత్రమైన పరిస్థితులలో మరణించింది. పత్రికలలో వార్తల ఆధారంగా రెండురోజుల తర్వాత ఆమె శవాన్ని బయటికి తీసి శవపరీక్షకి పంపారు. విషప్రయోగం ద్వారా ఆమె మరణించిందని రసాయనిక పరీక్షలలో తేలింది. తర్వాత జరిగిన దర్యాప్తులో కొందరు అగ్రశ్రేణి కాంగ్రెస్ (ఐ) రాజకీయ నాయకులు ఈ స్త్రీ సంబంధమైన వ్యవహారం, హత్య కేసులో ఇరుక్కున్నట్లు ఆరోపించబడింది. మెజిస్ట్రేట్ ముందు ఇద్దరు సాక్షులు కొందరు వ్యక్తుల పేర్లు కూడా బయటపెట్టారు. ఆ మర్నాడే ఈ కేసుని సి.బి.ఐ.కి బదలాయించారు!

( — ఓ. వి. )




"సినిమా కెళ్దామా సీతా?" ప్రేమగా అడిగాడు సీతాపతి ఆమె కాపురానికి వొచ్చిన రెండో రోజున. కొత్త పెళ్లాన్ని సంతోష పెట్టాలని సీతాపతి తపన. స్త్రీ అంటే సినిమాకీ, చీరకీ మురిసిపోయే అల్ప సంతోషని అతని అంచనా.

అతని ప్రతిపాదన వింటూనే సీత త్రుళ్లి పడింది. ఒక్కసారామె కళ్లల్లోకి కన్నీళ్లూ, గుండెల్లోకి భయమూ, హృదయంలోకి గతమూ వొచ్చేసి — ఆమె నిలువునా వొణికింది. సీతాపతి కామె వైఖరేమీ అర్థంకాలేదు. సీత — అతని ముఖం చూడలేనట్లు కళ్లు మూసుకుంది. ఆమెలో గతం మెదలసాగింది.

* * *

వీధిలోంచి వొస్తూనే జానకిరామయ్య హడావిడిగా "సీతా!..." అంటూ కేక వేశారా సాయంత్రం.

"ఏం నాన్నా?" చదువుతున్న పుస్తకం మూసి వొచ్చింది.

"మీ అమ్మని పిలుచుకురా. అర్జంటుగా ఓ మాట చెప్పాలి."

సీత కంగారుగా తల్లిని పిలుచుకు వొచ్చింది.

"మనం అర్జంటుగా సినిమాకెళ్లాలి." అన్నారాయన అక్కడికా సినిమా చూడకపోతే కొంపలు మునిగిపోతాయన్నట్లు. జనకుడికున్నట్లే ఈయనకీ వేపకాయంత వెర్రుంది. (జనకుడికి వెర్రికాకపోతే — పిల్ల నచ్చినవాడల్లుడనక విల్లు విరిచినవాడే అల్లుడనడమేమిటి?) వృద్ధుల బుద్ధులు సంచలించవే అన్నది నిజం చేయడానికి కాకపోతే గోడమీద రాతలు చదివి యీ జానకి రామయ్యగారు పెళ్లాన్నీ, పిల్లనీ ఉన్నపళాన సినిమాకి బయలుదేరమని కచ్చలో కందులు వేపడమేమిటి?

"చదువుకోవాలి నాన్నా. రేపు పరీక్ష ఉంది." బతిమాలింది సీత కన్నీళ్లతో. సీత — కాలేజిలో ఇంటర్ చదువుతూంది. అది — చాలా మంది అమ్మాయిల చదువులా పెళ్లి చదువూ వానాకాలం చదువూకాదు. ఫ్యాషన్ చదువూ కాదు. మెడిసిన్ చదువు. సీత శ్రద్ధగా పట్టుదలగా చదువుతుంది. ఆమె క్లాసులో మరెవరూ ఫస్ట్ మార్కుల మీద ఆశ పెట్టుకోవడం మానేశారు. ఫస్ట్ రాంక్ సీత గుత్తకి తీసేసుకుంది.

సీత కెప్పుడూ ఒకే కల వొస్తూంటుంది. కలలో ఆమె డాక్టర్ సీతాదేవై పోతుంది. ప్రజా సేవ చేసేస్తూ ఉంటుంది. శ్రీవారూ డాక్టరే. వారిది అన్యోన్యదాంపత్యమూ. ఆదర్శ జంటా. ఆ కలని నిజం చేసుకుందుకు సీత నిరంతరమూ శాయశక్తులా కష్టపడి చదువుతూంటుంది. ఆ కల ఆమె ప్రాణం... జీవితం... సర్వస్వం... సీతంటే ఒక్కముక్కలో ఆమె కల. అందుకే — "చదువుకోవాలి నాన్నా!" అని వేడుకుంది.

"చదువు రేపుంటుంది. సినిమా ఉండదు." అని సత్యం చెప్పారు జానకిరామయ్య, యింక మాట్లాడకన్నట్లు.

"వంట — సగంలో ఉందండీ! ......" ప్రార్థించిందన్నపూర్ణ.

"మిగిలిన సగమూ సినిమా నుంచొచ్చాక చేద్దువుగానిలే." అని యిల్లాలినీ నోరు మూయించేసి సినిమాకి బయలుదేర దీశారు. వాళ్లాయన మొండితనం తెలిసిన వారవడంచేత ఆట్టే ప్రతిఘటించకుండానే లొంగిపోయారు.

వాళ్లు థియేటర్ చేరుకునేసరికి షో యింకా మొదలు కాలేదు.

సీత బాగుంటుంది. ఈ పద్దెనిమిదీ నిండితే యింకా బాగుంటుంది. వాలు జడలో పూలు తురుముకుని...కళ్లకి కాటుక పెట్టుకున్న సీత— సినిమా కొచ్చిన బాపూ బొమ్మలాగే ఉంది.

ఈ రోజుల్లో బెల్లానికి చీమలు పట్టడం మరచిపోవచ్చునేమో కాని అమ్మాయిలకి... అందమైన సీత లాంటి అమ్మాయికి యీవ్ టీజర్స్

పట్టడం మరచిపోరు కదా ? ఆ రోమియో — సరిగ్గా సీత వెనక సీటులోనే తగలడ్డాడు. దానితో— తెరమీద సినిమా కంటే సీత కష్టాలే ముందుగా మొదలయ్యాయి.

సీతకి లోకజ్ఞానం ఉంది. రోజూ కాలేజికి నడిచివెళ్లి నడచి వొస్తుంది కనుక ఈవ్‌టీజర్స్ సంగతి కొత్తకాదు. నలుగురిలోనూ అల్లరి ఎడడంవల్ల ఎవరి కెక్కువ నష్టమో తెలిసింది కావడంవల్ల — రోమియో అల్లరి కొంత భరించాక— "పేరెంట్స్‌తో వొచ్చాను...ప్లీజ్..." అని వెనక్కి తిరిగి వేడుకుంది పరిస్థితి అర్థం చేసుకుని తనని వదిలి పెట్టమన్నట్లు.

ఆ రోమియో సీత అసహాయ పరిస్థితి నర్థం చేసుకుని— మరీ విజృంభించేడు. అదృష్టం పండిందనుకుంటూ — సీత జడని తన వొడిలోకి లాగేసుకున్నాడు. దొరికిన చోటల్లా సీత శరీరాన్ని వేళ్లతో పొడిచాడు. ఆమె జడలో పూలన్నీ వొలిచేసి తన జేబులో వేసుకున్నాడు. సీత— ఉండుండీ — "ప్లీజ్..." అంటూనే ఉంది.

తిక్కమనిషయిన తండ్రి గురించి భయ పడుతూ — ఆమె — ఆ రోమియో హింసనీ! అమానుషత్వాన్ని ఎలాగో ఇంటర్‌వెల్‌వరకూ ఓపిగ్గా భరించింది. ఇంటర్వెల్‌లో తల్లితండ్రు లతో తనూ బయటకి వెళ్లివొస్తూ — సీటు మారాలని ప్రయత్నించింది. కాని — అప్పటికే సీత సీటుమీద సిగరెట్‌పెట్టె... దానిమీద ప్రేమ మార్కు ఆటీనూ, అందులో బాణంబొమ్మా... కింద — ఐ లవ్ యు... సిగరెట్‌పెట్టె చుట్టూ పూలతో అలంకారం. అది — ఎవరికంట పడ కూడదని సీత వెయ్యి దేముళ్లకి మొక్కుకుందో వారికంటనే పడింది !

"చాలు... చూసింది చాలు... సినిమా లేదు, గినిమాలేదు, ఇంటికి పదండి." తీర్మా నించేశారు జానకిరామయ్య. వొట్టి తిక్కమనిషని విసుక్కుంటూ భర్త ననుసరించిందన్నపూర్ణ. భయపడుతూ... గుండెలుగ్గబట్టుకుని తండ్రి వెనుక అడుగులు వేయసాగింది సీత.

ఇల్లు చేరగానే— గుమ్మంలోనే నిలదీశారు జానకిరామయ్య.

"ఎవడు వాడు ?"

"నాకు తెలియదు." తల వొంచుకుంది సీత.

"నీకూ వాడికీ ఏమిటి సంబంధం ?" గద్దించారు.

గజగజ వొణికిపోయింది సీత. ఆ క్షణంలో ఆయన ఆమెకు కన్నతండ్రిలాకాక కఠినాత్ముడిలా కనిపించాడు. తండ్రయితే అలాగ మాట్లా డతాడా ?

"ఎన్నాళ్లనుంచి సాగుతోందీ భాగోతం ?" అరిచారాయన.

బాధగా... భయంగా...ఏదో చెప్పబోయింది సీత. కాని ఆమె గొంతు పెగలలేదు.

"నంగనాచిలా నోరు తెరవ్వేం ? నేను చూడలేదనుకున్నావా నువ్వు చీటికీ మాటికి వెనక్కి తిరిగి ఆ దౌర్భాగ్యుడితో గుసగుస లాడడం ?" నిలదీశారు.

"నిజంగా నాకేమీ తెలియదు. ఆడపిల్ల బయటకు వొస్తే యిలాగే వేధిస్తారు. దానికి— తెలిసి ఉండనక్కర్లేదు" అంది ఎలాగో.

"మరి నా కక్కడే ఎందుకు చెప్పలేదు ?"

"అనవసరంగా నలుగురిలోనూ గొడవౌ తుందని ..."

"కాదు. మీ ఇద్దరి మధ్యా ఇదివరకే..."

"నాన్నా ! నేనలాటిదాన్ని కాను నాన్నా" భోరుమని ఏడ్చింది.

సీత మాట లాయన నమ్మలేదు. మన బంగారం మంచిది కాదనీ, కంసాలిని తప్పు పట్టడం అనవసరమనీ తీర్పిచ్చేసిన తండ్రికి — అమ్మ కూడా వంతపాడడం సీతకి మతిపోగొట్టే సింది. నిస్సహాయంగా ఏడ్వడం కంటే ఏమీ చేయలేని పరిస్థితిలో మిగిలిపోయింది సీత.

"రేపట్నుంచి గుమ్మం కదిలావంటే కాళ్లిరగ్గొట్తాను ..."

"నా చదువు ..."

"చదువూ లేదు, చట్టుబండలూ లేదు. చేసిన నిర్వాకం చాలు ..."

సీత — దుఃఖం ఆపుకోలేక — బిగ్గరగా ఏడ్చింది.

ఇష్టంలేనివి తొందరగా జరిగిపోతాయేమో! సీత ఏడుస్తున్నా వినకుండా ఆమెను చదువు మానిపించేశారు. ఏడుస్తున్నా వినకుండా — ఆలస్యమైతే పెళ్లే కాదేమో జీవితంలో అన్నట్లు —తొందరలో ఓ తలమాసిన సంబంధం చూసి సీతకి పెళ్లి చేసేశారు. అత్తారింటికి పంపేశారు అర్జంటుగా.

సీత చెయ్యని తప్పుకి — ఆమె చదువాగి పోయింది. సీత చేయని నేరానికి — ఆమె కలలు సమూలంగా కూలిపోయాయి. సీత చెయ్యని అపరాధానికి — ఆమె ఆశలు నాశనమయ్యాయి.

సీత దృష్టిలో—ఆమె జీవితం యింకలేదు. డాక్టరూ, డాక్టరు భార్య కావలసినది — వొట్టి యిల్లాలూ, బడిపంతులి భార్యా కావడంతోనే — సీత కింకేమీ మిగలలేదనిపించింది. తన జీవితం యిలా చిన్నాభిన్నం కావడానికి, తన అదృష్టం యిలా వక్రించడానికి, తన కలలు కరిగిపోడానికి... తన ఆశలు నాశనమవడానికి కారణం — ఓ రోమియో...ఈవ్ టీజర్ ... మూర్ఖుడు ... వాళ్లు విశృంఖలంగా విహరించగల్గుతున్న యీ దౌర్భాగ్య వ్యవస్థ !

*   *   *

"ఏం సీతా, సినిమా కెళ్దామా ?" మళ్లీ అడిగాడు సీతాపతి. ఏదో లోకంలోంచి మాట్లాడు తున్నట్లు బలహీనంగా ...

ఆ సినిమాలో ఈవ్‌టీజరు తన భవిష్యత్తుని కూలద్రోసినట్లు యీ సినిమాలో మరో రోమియో తన కాపురాన్నే కూలద్రోస్తా డేమో అని భయపడుతున్నట్లు — మెల్లగా ... "సినిమాకా ! ... అరవైదాటి ... ఆడతనం పూర్తిగా మరుగున పడ్డాక...అప్పుడు ... అంత వరకూ...క్షమించండి... నేను సినిమాకి రాలేను. రాను." అంది.

సీతాపతి అయోమయంగా చూశాడామె మాటలర్థంకానట్లు..

గడపదాటిన స్త్రీ — మానభంగానికో, అభిమాన భంగానికో గురికావడమనేది సాధారణమైపోయిన యీ రోమియో వ్యవస్థ అర్థమైనవారికి తప్ప, సీత మాటలూ వాటిలోని ఆవేదనా ఎవరికి అర్థమౌతుంది? ★






# వ్యక్తిగతం



బొంబాయి జవుళి మిల్లుల కార్మికుల సమ్మె ఇంకా కొనసాగుతోందని కార్మిక నాయకుడు డాక్టరు దత్తా సామంత్ అంటున్నారు. [సమ్మె ఇంచుమించు చల్లబడినట్లేనని మహారాష్ట్ర ముఖ్యమంత్రి వాదం ... ]



సైన్స్ ఫిక్షన్ రచనలు సంచలనం సృష్టించిన '2001: ఎ స్పేస్ ఒడెస్సీ' రచయిత ఆర్థర్ సి. క్లార్క్ ఈ మధ్యనే '2010 : ఒడెస్సీ టూ' అనే నవలని ప్రచురించారు. ఇతర గ్రహాలలోని జీవులు భూమిమీదకి వస్తే దాని ప్రభావం మన మతం, ఆధ్యాత్మిక తత్వాలమీద తప్పనిసరిగా ఉంటుందని ఆయన అంటున్నారు ...



కాంగ్రెస్ (ఎస్) పార్టీ అధ్యక్షుడు శ్రీ శరద్ పవార్ ప్రస్తుతం దేశంలో జాతీయ స్థాయిలో గుర్తింపు పొందిన రాజకీయ పక్షాల అధ్యక్షులందరిలోకీ చిన్నవాడు. ఈయన వయస్సు 42 సంవత్సరాలు ...

# వారఫలం

**24-6-1983 శుక్రవారం మొదలు 30-6-1983 గురువారం వరకు**

♈ మేషం: ఆదాయం గల వారమే గాని అంతకు తగిన ఖర్చు కూడా ఉండవే ఉంటుంది. చాలా విధాల రావలసిన డబ్బు సమయానికి అందే మార్గం ఉంటుంది. పత్రికా ప్రకటన అయినా లేక భారీ వ్యాపారమయినా మేలు చేకూరుతుంది. స్త్రీలకు: నానా విధాల ఉపయుక్తమయిన వారం.

♉ వృషభం: దూర బంధువులు యింటికి రానున్నారు. ప్రతిభ రాణించే మార్గాలున్నాయి. శ్రద్ధాసక్తులతో కార్య సాధన గావించుకో గలుగుతారు. భూములు కొనుగోలు చేసే అవకాశం ఉంటుంది. స్త్రీలకు: బంధు సమావేశం, విలువగల వస్తు సేకరణకు అవకాశముంటుంది. ప్రయాణం కూడా చెప్ప దగిన అంశమే.

♊ మిథునం: వివిధ వ్యాపారాలలో చాకచక్యం గల వారికి సర్వానుకూలత చేకూర గలదు. దూర ప్రాంతాలకు హటాత్తుగా ప్రయాణించే అవకాశాలు కొందరకు ఏర్పడే అవకాశమున్నది. 'నిజమాడితే నిష్ఠురం' అన్న నానుడి మీ వ్యవహారాలలో రూఢి అవుతుంది. స్త్రీలకు: శుభ కార్య వ్యవహారాలు ఫలించే మార్గమున్నది.

♋ కర్కాటకం: శుభ కార్యానుకూలతకు, దైవ దర్శనాపేక్ష ఫలవంతం కావటానికి, అవకాశమున్నది. కొందరకు వ్యాపారాలోచనలందు సుగమం కనిపిస్తుంది. మీ ఓర్పు ఒకానొక విధంగా మీకే మేలు చేకూరుతుంది. స్త్రీలకు: నూతన నోద్యోగాలు ఫలవంతం కావటం, దైవ కార్యాచరణకు అవకాశం ఏర్పడటం చెప్ప దగిన అంశం.

♌ సింహం: మీ ధైర్య స్థైర్యాలు మీకు తోడుగా ఉండి సర్వానుకూలత ముఖ్యంగా ఉద్యోగ వ్యాపార సామాజిక రంగాలలో కనిపిస్తుంది. స్త్రీలకు: సుఖ శాంతులకు గాని, నూతన నోద్యోగ ప్రాప్తి యందు గాని, ప్రయాణానుకూలతకు గాని ఎలాటి లోపం సంభవించదు. హటాత్తుగా ధనాదాయం చెప్పదగిన విషయం.

♍ కన్య: వృత్తి ఉద్యోగాలందు, భూ సంపదను అభివృద్ధి చేసి కొనుటకు గాని, సంతానాభివృద్ధిని గూర్చి చేసే ప్రయత్నాలు ఫలవంతం కావటానికి గాని, గృహాభివృద్ధి కార్యక్రమం చేపట్టటానికి గాని ఎలాటి అభ్యంతరం కనిపించదు. స్త్రీలకు: గృహాలంకరణ వస్తువులు సేకరించుటకు, శుభ కార్య ప్రస్తావనలకు, సమ వయస్కుల వలన మేలు పొందుటకు అవకాశం గల వారం.

♎ తుల: దూర ప్రాంతాల నుండి ఉత్తరాలు రానున్నవి. అందు నిమిత్తమై ప్రయాణించే అవకాశమున్నది. వస్తు వాహనాలు కొనుగోలు చేయ గలరు. రాజకీయ రంగంలో మీ ప్రతిభ రాణిస్తుంది. కళా సాహిత్య రంగాలలో ప్రసిద్ధి ఏర్పడుతుంది. స్త్రీలకు: అధికారాభివృద్ధి గలవారం

♏ వృశ్చికం: ఆదరించే మిత్రులు దాపునకు రానున్నారు. భూమిగాని, యిల్లు గాని కొనుగోలు చేయటమో, ధాన్యం అమ్మటం మూలాన ధన సంపాదనకు అవకాశం కనిపించటం గ్రహించ గలరు. స్త్రీలకు: బంధు విరోధం, ఉద్యోగంలో మార్పులు చెప్ప నైన వారం.

♐ ధనుస్సు: 'వారం వారం యింతేనా?' అని నిరుత్సాహ పడకండి. అవకాశ వాదులను దాపునకు చేర్చకండి. అలాంటి తొందర ఏర్పడే అవకాశమున్నది. వస్తు సేకరణకు సదవకాశాలు లభిస్తాయి. స్త్రీలకు: విద్యా వైజ్ఞానిక రంగాలల్లో అభివృద్ధి, శక్తిని మించిన కార్యాచరణ ఏర్పడే అవకాశమున్నది.

♑ మకరం: మీ తాలూకు వస్తువులు ఎంతో జాగరూకత తో కాపాడు కోవాలి. ఒకవేళ దొంగ భయం కూడా ఏర్పడ వచ్చు. ప్రయాణాల్లో ఎంతో జాగరూకత అవసరం. నూతన మిత్రులను కలిసి కోవటానికి అవకాశం గలవారం. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు వృద్ధి కనిపిస్తుంది.

♒ కుంభం: ఇతరుల తోనో, విరోధి వర్గం తోనో, పరిచితుల తోనో, ఘర్షణ రావచ్చు. సభా కార్యక్రమం లో కొందరకు జోక్యం, కొందరకు సన్మానాదులు చెప్పికో దగిన అంశాలు. స్త్రీలకు: యత్న కార్య సిద్ధి, అధికారుల ఆదరణ, కళా రంగంలో అవకాశాలు సంక్రమిస్తాయి.

♓ మీనం: ఆదాయంలో అభివృద్ధి, అనుకోకుండా మిత్ర వర్గాన్ని కలిసికోవటం, నూతన వ్యవహారాలు గాని, పాతవి గాని మీకు అనుకూలనాయకంగా పరిష్కరింప బడుతాయి. కొందరకు కోరుకొన్న విధంగా 'ట్రాన్స్‌ఫర్లు' సంభవం. స్త్రీలకు: నూతన నాంశాలు తెలిసికోవటం, యిది వరకు సగం సాగించి వదలిన వ్యవహారాలు సానుకూలం కావటం చెప్ప దగిన అంశం. ధన లోపం చెప్ప దగిన వారమని గ్రహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# మీ డ్రాయింగ్ రూమ్‌లో
# స్వాగత చిహ్నాలు

బోంబే టైల్స్

గ్లేజ్‌డ్ టైల్స్‌లో అనూహ్యం

మీ డ్రాయింగ్ రూమ్‌లో వెచ్చని ఆతిద్యాన్ని
తీసుకొనిరాటానికై బోంబే టైల్స్‌కు మరలండి.




తయారుచేయువారు :
**బోంబే పోటరీస్ & టైల్స్ లిమిటెడ్.**
బొంబాయి
శాఖ : 49, సవరిముత్తు స్ట్రీట్, మన్నాది, మద్రాను-600001

Market Movers/BPT/118 Tel




(గత సంచిక తరువాయి)

తోటలో ఒక మారుమూలనఉన్న రసాలవృక్షం అది. దాని కొమ్మలు బాగా వంగిఉన్నాయి. పశ్చిమ పార్శ్వానఉన్న ఒక పెద్ద కొమ్మ నేలకు తాకేలా వొంగిపోయి మళ్ళీ ఊర్ధ్వముఖంగా సాగింది. అంటే దాని నడుము దాదాపు నేలను తాకుతోంది. ఆకులు చిన్న కొమ్మలు పైకి లేచాయి.

పల్లకీబొంగులా నడుము వొంగిన ఆ కొమ్మమీద కూర్చుని కాలి బొటనవ్రేలితో నేలను తాటిస్తూ ఆలోచిస్తోంది ఏకవీర.

"స్వామీ! పలుకవేమి? ఎక్కడకుపోయినావయ్యా! అలివేలు మంగమ్మకు అలుకతీర్చేందుకా? నీ పేరు మనసులో నిలిపి ధ్యానించే ఆర్తుల మ్రొక్కుబడులు తీర్చేందుకా? యీ ఏకవీరను మరచేనా? స్వామీ" పిలుస్తోంది ఏకవీర. కన్నులు అరమోడ్చింది. స్వామి కనిపించలేదు. ఆమెకు దుఃఖం ఉద్విగ్నంగా పెల్లుబికింది. మనసు ఉడికింది.

"దొరా! నన్ను మరచేవా? నేను ఏదయినా తప్పిదం చేశానా. స్వామీ! మందబుద్ధిని నన్ను మన్నించలేవా? నీ దివ్య మంగళమైన రూపాన్ని ఒకసారి కనుపించనీయవా? యీ నిరుపేద జీవితాన్ని నీకు సమర్పించేనుకదయ్యా! నాకు కనులున్నందుకు నీవు కనుపించినదే చాలని పొంగిపోయేనుకదయ్యా! ఒక మాట నాతో మాట్లాడితే నీ నోటిముత్యాలు రాలిపోయేనా? రావా స్వామీ! నన్ను కరుణించి నీ సాన్నిధ్యాన్ని ప్రసాదించలేవా! రా! దొరా! వెంకన్నా!" అంటూ పలవరిస్తోంది ఆమె. ఆమె మాటలు తనలో తాను అనుకుంటున్నదో పైకే అనివేస్తున్నదో ఆమెకు తెలియదు.

పద్మా, లక్ష్మి తమ స్నేహితురాలు యిలా తన్మయంలో మునిగిఉండటం అనేక మార్లు చూచాయి. వాటికి యీ పలకరింపులు క్రొత్త కావు. యీ పలవరింతలు స్వామికి పలకరింపులు అవుతాయో కావోకూడ ఆ మూగ జీవులకు తెలియదు.

"దయను వర్షించే దైవానివని నమ్మి లోకం నిన్ను పూజిస్తున్నదే. నాతో పలుకలేవా దొరా! ఏదయినా మ్రొక్కుబడులిచ్చి నిన్ను పిలుచుకుందామంటే యీ నిరుపేదరాలి సన్నిధిలో యింకా మిగిలింది ఏమున్నది. సర్వమూ నీకే సమర్పించానుకదయ్యా! ఆడ మనసు అతి చొరవతో పిలుస్తోందని బెట్టుచేస్తున్నావా దొరా! భలే దొరవయ్యానువ్వు. అంతఃకరణాన్ని ఆత్మార్పణంచేశాక యింకా ఆడామగా ఏమిటయ్యా నీకు నివేదించుకోవలసింది చాల ఉంది. నా మాట వినవూ! రావూ?" ఏకవీర దీనాతిదీనంగా పిలుస్తోంది.

ఆమె తపస్సు ఫలించినట్లు అయింది. వేయి వెలుగులు వెదజల్లే చిరు దరహాసంతో స్వామి భూమి మీదకు విచ్చేసేడు.

ఏకవీర తన్మయురాలైంది. ఆమె మనోనేత్రం ముందు సాక్షాత్కరించిన స్వామిని తనివితీరా చూచింది.

"వొచ్చేవా మచ్చికదొరా! రా కూర్చో. నా హృదయాన్ని నీకు రత్న సింహాసనంగా అమర్చేను. రావయ్య. దయచేయి. కూర్చో. అలుపు వచ్చిందా? ఎంత దూరం నడిచి వచ్చేవో నా కోసం. నా కోసమే కదయ్యా నీవు వచ్చేవు. చాలు స్వామి చాలు. మనసు నిండింది. బ్రతుకే పండింది దొరా! వొచ్చేవా? నా హృదయ రత్న సింహాసనం మీద ఆసీనుడవయ్యేవా? ఎంత చక్కనివాడవు స్వామీ? నీ రూపు, నీ తేజస్సు, నీ ఓజస్సు, నీ మనస్సు ఏ రాజులకు వొస్తుంది? ఏ మునిరాజులకు మాత్రం వొస్తుంది. నీ ఈవి, నీ ఠీవి, ఏ చక్రవర్తులకు దొరుకుతుందయ్యా? ఏ ఋషి చక్రవర్తులకు దొరికేను. భూదేవి నీ స్పర్శతో పులకించి పకాలున నవ్వినట్లు నీ రత్న కిరీటం వెలుగులు క్రుమ్మరించేను దొరా! నీ లలాటం అగ్నిదేవుని కిరీటమేగా స్వామీ! నిదుపైన ఆ తిరునామం నిఖిల లోకాలకు దర్శనీయం కదయ్యా! నీలికల్హారంలో రక్తవర్ణ కర్ణికారం లాంటి నీ మోవి... ఆహా... ఎంత అద్భుతమైన దృశ్యం చూస్తున్నాను స్వామీ! ఏదీ ఒకసారి నీ మోవి మధురామృతం నాకు ప్రసాదించవు. ఎన్ని కోట్ల జన్మల తపఃఫలితమో కదయ్యా నేను దర్శించే నీ రూపం. స్వామీ నిగనిగలాడే నీ చెంపలు ఒకసారి ముద్దాడనీయవా? నీవు దేవుడవు కదా! మైలపడిపోతావా? మరి నన్ను యీ మానవ లోకంలో ఎందుకు పారవేసేవు? స్వామీ! నీవు కూడ మానవుడవే అనుకుంటాను. మహోన్నత మానవుడవు అనుకుంటాను. కదలకు స్వామీ!

**జరిగిన కథ — 8 :** ఏకవీర కృష్ణస్వామి ఆశ్రమంలో పెరిగి పెద్దదవుతుంది. ఆమె స్వామిని ఆరాధిస్తుంటుంది. ఆమె శ్రీదేవుడిని ఒక చిన్న స్వామి రూపును చెక్కివ్వమని కోరుతుంది. మొగలిచర్లలో జైనాచార్యుని సభలు జరుగుతాయని తెలిసి కృష్ణస్వామి వ్యాకుల పడుతాడు. కృష్ణస్వామి తనకు లొంగి వచ్చేలా ఉండాలంటే ఏకవీరను తను కోడలుగా స్వీకరించేందుకు యిష్టం ఉన్నట్లుగా నటించాలనుకుంటాడు వెంకన్నదొర. ఏకవీర వెంకన్నదొర ఇంటికి వచ్చి ఆశ్రమానికి తిరిగి వెళుతూ ఏకవీరదేవి ఆలయంలో తను కృష్ణస్వామికి దొరికిన వృత్తాంతం అర్చకస్వామి ద్వారా తెలుసుకుంటుంది. ఆశ్రమానికి పద్మగంధి వస్తుంది, ఆమె విచారవదనం చూసి మంచి మాటలతో ఓదారుస్తుంది ఏకవీర. జైనాచార్యుడు గొప్ప పండితుడు, తాత్వికుడు. తను గతంలో పద్మగంధితో గడిపిన మధురక్షణాలు, ఆమెకు తనవల్ల ఒకవేళ శిశువు జన్మిస్తే ఆ శిశువును ఆమె పెంచకూడదు అని మాట తీసుకున్న వైనం జ్ఞప్తికి తెచ్చుకొని కలత చెందుతాడు. పద్మగంధి ఒక భిక్షుకత్తె వేషంతో ఓరుగల్లులోని ఒక పాంథశాలకి చేరుతుంది. తను, పరదేశి కలసి గోపాల దేవునికి బుద్ధి చెప్పాలనుకుంటుంది. త్రిపురాంతకుడు గోపాలదేవునికి బాగ బుద్ధి చెపుతాడు. ఆహవమల్లు జైనస్వామి ఆదేశానుసారం జైన సభలు ప్రారంభించను ఏర్పాట్లు చేయడానికి మొగలిచెర్లలో విడిది చేస్తాడు. మొగలిచెర్లలో ఏ హరిజనుడు ఏకవీరదేవి ఆలయానికి వెళ్ళరాదని ఆజ్ఞ జారిచేస్తాడు వెంకన్నదొర. గోపాలదేవునికి స్పృహ పోగొట్టి పద్మగంధితో పాలంపాట చెర్వుకి బయలుదేరాడు త్రిపురాంతకుడు. వారిద్దరు రామప్ప ఆలయంలో జైనస్వామిని కలుస్తారు. జైనస్వామి పద్మగంధిని గుర్తిస్తాడు. ఏకవీర ఏడుకొండలవాడే తన సర్వస్వం అని భావించడం చూచి శ్రీశైవుని మనసు వికలమైంది.



కదలకు. నన్ను మాట్లాడనివ్వు. అలా పదే పదే చిరు దరహాసపు పన్నీరు చిలకరించి నన్ను పిచ్చి దానిని చేయకు. ఈ పులకింతలు ఎన్ని జన్మలకు నిలచేనో దొరా !'' అంటూ చెప్పుకుపోతోంది ఏకవీర. ఆమె మనో మయ ప్రపంచంలో కొండ దొర వెంకన్న తప్ప వేరేమీ లేదు.

ఎన్నియుగాలు సాగినదో విరాళి? ఈనాటితో రసానుభూతి ప్రాప్తించినట్లు అయింది ఆమెకు. దొరకు పాదప్రక్షాళన చెయ్యనూ, పైటకొంగుతో స్వేదాన్ని ఒత్తనూ...ఆమె ఊహాలోకంలో ఏవేవో సపర్యలు చేస్తోంది.

స్వామి దర్శనం వల్ల సంప్రాప్తమయిన సంభ్రమం కొంత తగ్గాక ఆయన మాటకోసం పలవించటం ప్రారంభించింది.

''యిద్దరు భార్యల ముద్దుల దొరా ! చిరు నవ్వులే కాని చిన్న పలుకైనా లేదేమయ్యా! నాతో పలుకరాదని అలుక పూనావా ? దొరా! మదించిన మత్తేభాల ఘీంకారంలో అంతర్గతుగా వినిపించే ఓంకారం లాంటి నీ మాట మూగపోయింది ఎందుకని ? నాతో మాట్లాడు !'' బ్రతిమిలాడింది ఏకవీర.

ఆమె ఊహా లోకంలోని స్వామి ఒకసారి నవ్వేడు.

''ఏకవీరా ! ఎంత నెరజాణవు నీవు ? లోకాలను శాసించే ఈ స్వరాన్ని ఎంత మధురంగా వర్ణించేవు. ఈ జాణతనం ఎలా నేర్చావు? ఆశ్చర్యమయింది సుమా !''

ఏకవీర స్వామి మాటలకు పులకించింది.

''దొరా! ఆకాశంలో ఏ మెరుపు కనిపించినా అది మేఘం నుండే కదా ప్రాదుర్భవిస్తుంది. నాలో ఏ మెరుపు కనిపించినా అది నీ వర ప్రసాదమే కదయ్యా ! అన్ని లోకాలనూ, అందరి అంతర్యాలనూ శాసించే దొరవు. నా విషయం నీకు ఆశ్చర్యమయిందా ? నేను నీ ఊహాలో జాణనయ్యేనా ? అమాయకురాలినని ఆటలు పట్టిస్తున్నావా ? కొంటెతనం చూపి హృదయతంత్రుల మీద కోటి వీణలు పలికిస్తున్నావా ?''

ఏకవీర ఊహా లోకంలో వారిద్దరి మధ్య సంభాషణ సాగుతోంది.

''కొంటెతనం నాకు క్రొత్తదేమీ కాదులే ఏకవీరా !''

## తిరుచరణాలు

"అవును కదయ్యా! కృష్ణుడివై కుబ్జను సైతం చేరతీసిన చెన్నుకారివి. నీకు కొంటెతనం క్రొత్త ఎలా అవుతుంది. యిది నా బ్రతుకులో ఒక మెరుపు. యీ మెరుపు జీవితమంతా వెంట వచ్చే మైమరుపు. నీవు సామాన్యమయిన స్వామి కావుగా! తుంటరి పనులకు ముందు నిన్నే చెప్పాలి. గోపకాంతల్ని ఎలా ఏడిపించావు? ఆడదాని రూపంలో వెళ్ళి ఆకాశరాజు కూతుర్ని ఆకర్షించేవుగా అప్పుడు? అప్పటి నుండీ యీ లోకం ఎంతో మారింది. కాని నీవు మారలేదు. నీ కరుణ మారలేదు. నీ అంతఃకరణ మారలేదు. లోకానికి, ఆర్తులకూ నీ విచ్చే శరణు మారలేదు."

"అవునులే మాటలతోనే పూటగడిపేవు. పిలుపు యిచ్చిన దానివి వచ్చిన వాడికి యిచ్చేది ఏదయినా ఉన్నదా! ఉత్త మాటలతోనే ఊరించి పంపుతావా?"

"చెప్పేనుగా స్వామీ! నాకు నేనేమి మిగుల్చుకున్నాను నీకు యిచ్చేందుకు. ఎంత వెర్రిదానిని. స్వామి అడగక ముందే అంతా యిచ్చుకున్నాను. నోరు తెరచి అడిగితే ఏమీ యివ్వలేనని మనవి చేసుకుంటున్నాను" అంటూ కన్నీరు పెట్టుకుంది ఏకవీర.

"ఏడవకు ఏకవీరా! అభినయం చేసేవు. అబద్ధాలు చెప్పేవు. ఇంకా ఇచ్చేందుకు ఏమీలేదని యీ కల్లబొల్లి ఏడుపులెందుకు?" అంటూ నిష్ఠూరమాడేడు స్వామి.

ఏకవీర నిశ్చేష్టురాలయింది. ఆమె మనసు దిమ్మెరపోయింది. తాను అభినయం చేసిందా? స్వామితో అబద్ధాలు ఆడిందా? స్వామేనా యీ మాటలు మాట్లాడుతున్నది? స్వామికి తన ఆంతర్యం తెలియదా? ఆడించేందుకు అలా అంటున్నారా? "స్వామీ! నేను అభినయం చేశానా? అబద్ధాలు చెప్పానా? ఆట పట్టించేందుకు అలా అని వుంటావు" అన్నది కన్నీటి జాలులో చెరిగిపోతున్న స్వామి రూపాన్ని చూచుకుంటూ. "అవును" అన్నారు స్వామి.

"అవునా? ఏమిటి అవును? నేనేదయినా దాచుకుని లేదంటున్నానా? యీ తను మనః ప్రాణాలలో నీవికానిది ఏమున్నది? నేనింకా నీకు ఏమి యిచ్చుకోను" విలవిలలాడిపోతున్న మనసును కూడదీసుకోవాలని వ్యర్థప్రయత్నం చేస్తూనే అన్నది ఏకవీర.

"ఏకవీరా! అన్నీ వొదులుకున్నావు. కాని అహంకారాన్ని దాచుకున్నావు. అది కూడ యిచ్చుకో."

"అహంకారమా? నాకా? అంటే ఏమిటి?"

"నేను అనుకోవటం."

"యీ మధురమైన క్షణాల్ని వృధావేదాంత చర్చలతో వ్యయం చేయదలచేవా స్వామీ!"

### అందం!

ఆకు కదిలితే అందం
ఆకాశం వురిమితే అందం
పువ్వు నవ్వితే అందం
పంట పండితే అందం
ప్రకృతిలో ప్రతిదీ అందమే;
కాని—.

నిన్న — నేడు — రేపుల మధ్య
నిరాశా— ఆశల మధ్య
సమస్యలతో సతమతమవుతూ
కాలంతో కుస్తీ పడుతున్న
సామాన్యుడికి
ఆ రోజు గడిస్తే అందం!

శ్రీమతి న్యాయపతి కమలారాంజీ

"లేదు. మాధుర్యానికి మునుగడ ఎక్కడో వివరిస్తున్నాను."

"అయితే నా మనసును మెత్తెక్కించే యీ మాధుర్యం... ఏమిటది. ఇది శాశ్వతంకాదా?"

"కాదు ఏకవీరా! నేను అనుభవిస్తున్నాను అని తెలిపే ప్రతి ఆనందమూ అశాశ్వతమైనదే!"

"అయితే యింతకన్న మధురమైన మాధుర్యం మరొకటి ఉన్నదా?"

"ఓ తప్పకుండా ఉన్నది."

"అయినా అది నాకొద్దుస్వామి. నీదర్శన స్పర్శనలువల్ల దొరికే యీ జీవిత మాధుర్యం నాకు చాలు. నాకింకేమీ ఒద్దు."

"ఒట్టి అమాయకురాలివి. నీ దారి నీవు చూచుకుంటే నేను ఏమయిపోవాలి?"

"అప్పటికి మీకేదో కొదువ అయినట్లు. హు. ఎంత నాటకం ఆడుతున్నావుస్వామీ! అవునులే. గోపాలకృష్ణుడివి కాదూ!"

"ఏకవీరా! నన్ను నమ్మలేవూ!"

"నమ్మేను కనుకనే ఆట పట్టించుతున్నావు."

"అదుగో చూచావా? అప్పుడే వొచ్చింది పౌరుషం. దాన్ని అహంకారమంటారు. అది మటుకు నిన్ను విడిచిపెట్టకుండా నీ దగ్గరే ఉంది" అన్నారు స్వామి చిరునవ్వుతో.

"స్వామీ నాకు ఇలాంటివి ఏమీ తెలియవు. అదేనా నీకూ నాకూ అడ్డు నిలిచింది."

"అవును ఏకవీరా! అహంకారానికే మరో పేరు మాయ."

"అయితే అదికూడా నీకేయిచ్చేస్తున్నాను"

"అలా కాదు సర్వాత్మనా సమర్పించుకోవాలి."

"అదెలాగో నాకు తెలియటల్లేదు స్వామీ."

"అయితే సమయం వొచ్చినప్పుడు నేనే తీసుకుంటాను. ఇప్పటికి యిలాగే పోనివ్వు."

స్వామి మాటలు ఏకవీరకు నచ్చేయి. సంతోషంతో తలూపుతూ,

"అయితే స్వామీ! యీవేళ నీ రాకకు యింత ఆలస్యమయింది ఎందుకని ? నీవు రావేమోనని అనుమానమొచ్చి ఊపిరాడలేదు" అన్నది ఏకవీర బేలగా.

"నేను రాకపోతే ఏమవుతుంది?" అన్నారు స్వామి.

"నేను లేకుండా పోతాను."

"అంటే...?"

"ఏమో ! నాకు తెలియదు. అలా చెప్పాలని అనిపించింది."

"ఓహో అలాగన్నమాట."

"అయితే స్వామీ అహంకారాన్ని – అదే – నీకూ నాకూ అడ్డుగా ఉన్నదానిని ఎలా తీసివేసుకోవాలి ?"

"ఓ... అదా... నీ సందేహం. ఇప్పుడు నేనున్నాను. నాకు ఎదురుగా నీవున్నావు, నేను నిన్ను ఒక ముద్దు యిమ్మని అడిగాననుకో. యివ్వగలవా?" అన్నారు స్వామి కొంటెగా నవ్వుతూ.

"ఓ" అంటూ వెంటనే స్వామి ముఖాన్ని ముద్దుల వర్షంలో ముంచెత్తి ముద్ద చేసింది ఏకవీర.

స్వామ ఉక్కిరి బిక్కిరి అయ్యేడు. ఆమెలో అహంకారపు ఛాయలు ఆయనకు కనిపించలేదు.

కాకపోతే కాసంత అజ్ఞానం. మాయలో అది తప్పదు.

"ధన్యురాలివి ఏకవీరా !" అంటూ ఉపక్రమించేరు స్వామి.

"అంటే మీరు వెళ్లదలిచేరా !" అన్నది ఏకవీర బాధగా. స్వామి ఎప్పుడు కనిపించినా వెళ్ళబోయేముందు చెప్పే మాట అది.

స్వామి చిరునవ్వు నవ్వేడు.

"అవునులే. ముల్లోకాలు ఏలే దొరకు యీ ముగ్ధతో ఎలా కాలు నిలుస్తుంది."అంటూ నిష్ఠూరాలు ప్రారంభించింది ఏకవీర.

స్వామి దోసెడు మల్లెలను ఆమెమీద విరజిమ్మినట్లు నవ్వుతూ... అంతర్ధానమయ్యేడు.

ఆ మైమరపు ఏకవీరను ఇంకా వొదిలి పోలేదు.

"స్వామీ వెళ్ళకండి... స్వామీ ! స్వామీ !" అంటూ పలవరిస్తోంది.

"ఏమిటది ఏకవీరా !" అంటూ ప్రశ్నించేడు అప్పుడే వొచ్చిన శ్రీదేవుడు ఆత్రుతతో. ఆమెకోసమే వెతుకుతూ వొచ్చేడు అతను.

"స్వామి వెళ్ళిపోయేరు" అంటూ కన్నీరు పెట్టుకుంది ఏకవీర.

"ఏ స్వామి ?" ప్రశ్నించేడు శ్రీదేవుడు.

"నా స్వామి ?"

"శ్రీగిరిమీది శ్రీనివాసుడా !"

"అవును." అన్నది గునుస్తున్నట్లుగా.

"ఏకవీరా ! నేనొకటి చెవుతాను వింటావు కదూ !" ఎంతో ఆత్మీయత ధ్వనిస్తున్న స్వరంతో ప్రశ్నించేడు శ్రీదేవుడు.

"ఓ తప్పక వింటాను;"

"ఆ స్వామి అందరిస్వామి. నీ స్వామిని నీవు వెతుక్కోవాలి."

"అబద్దాలు చెప్పకు. ఆ స్వామే నా స్వామి."

"నీ ఆత్మను నడిపించేస్వామి అతడే కావచ్చు. కాని నీ మనసునూ నీ భవుతిక శరీరాన్ని నడిపించేందుకు..."

ఆయనను పిలిస్తే అహంకారమూ, అంతర్యమూ అంటాడు; నీవు వస్తే నీవు మనసూ, భవుతికశరీరమూ అంటావు. ఇదంతా అయోమయం. నాకేమీ అర్థంకాదు. నాకు తెలిసిందీ, నాకున్నదీ స్వామికి సర్వస్వాన్ని అర్పించుకోవటం. అంతే." అన్నది ఏకవీర విసురుగా.

"అయితే నీ శరీరానికి ఆయన స్పర్శ అనుభూతమయిందా ?" శ్రీదేవుని ప్రశ్న.

"ఎందుకు అవదు? మహ చక్కగా అవుతుంది. అనుకోవటం చాతనయితే అన్నీ అనుభూతులూ దొరుకుతాయి."

"పిచ్చి బాగా ముదిరిందన్నమాట ?" అన్నాడు శ్రీదేవుడు విసుగూ కోపమూ మిళితమయిన స్వరంతో.

"ముదిరితే ఎవరికి ఏమి నష్టం వొచ్చిపడింది. నా దారికి నన్ను వొదిలెయ్యకూడదూ!" అన్నది ఏకవీర.

"అలా వీలులేదు. నీ కోసం జీవితమంతా ఎదురుచూచే వ్యక్తులు ఇక్కడ ఉన్నారని నువ్వు గుర్తించాలి" కోపంతో అన్నాడు శ్రీదేవుడు.

"నా జీవితమంతా నేను ఆ స్వామి కోసమే ఎదురుచూడదలచాను."

"అలా వీలులేదు."

"నన్ను నా దైవం తప్ప మరి ఎవరూ ఆజ్ఞాపించలేరు."

"ఆజ్ఞాపించాలని కాదు. అర్థం చేసుకోమంటున్నాను."

"స్వామి స్మృతులు తప్ప మరి ఏ అర్థాలయినా నాకు అనర్థాలే."

"అయితే నీకోసం బ్రతుకును బలిపెట్టుకున్న నేను ఏమయిపోవాలి."

"ఏమో ! నాకు తెలియదు."

"స్వామి ! స్వామి ! అంటూ పలవరించటం తెలుసు."

"అది నా ఆంతర్యం నాకు చూపిన దారి"

"నీ ఆంతర్యం కోసం ఎందరి ఆంతర్యాలు మాడి మసైపోవాలి ?"

"నాకు నిమిత్తంలేని విషయాలు నాతో మాట్లాడుతున్నావు."

"నీకు నిమిత్తంలేదా ! లేత తమలపాకుకన్నా సుకుమారమైన నీ సౌందర్యం వెనుక ఎంత క్రౌర్యం దాగి ఉంది... ?"

"........... ......"

"ఇదంతా స్వామి నేర్పిన పాఠమేనా ?"






## తిరుచరణాలు

ఏకవీర శ్రీదేవుడు స్వామిమీద చేసిన ఆరోపణ వింటూనే చివాలున తలెత్తి రోషంగా చూచింది. ఆమె ఊర్పులు దీర్ఘాలయ్యాయి.

"నీ స్వామి అంత కఠినుడన్నమాట అంటూ మరో నింద ఆరోపించేడు శ్రీదేవుడు. అది వింటూనే ఆవేశంతో ఊగిపోతున్న ఏకవీర ఏమి చేసిందో ఆమెకు తెలియదు.

శ్రీదేవుని నుదురంతా రక్తమయమయింది. ఏకవీర విసరిన కఠినమైన వస్తువు ఏదో వెళ్ళి శ్రీదేవుని నుదుటికి గాయంచేసి దూరంగా వెళ్ళి పడింది.

"అబ్బా" అంటూ శ్రీదేవుడు నుదురు పట్టుకుని కూర్చుండిపోయేడు. రాక్తధారలు చూడగానే ఏకవీరకు ఒళ్ళు తెలిసింది.

"అయ్యో... అయ్యో..." అంటూ ఆమె వెళ్ళి శ్రీదేవుని చేతులు నుదుటిమీదనుండి దూరంగా తొలగించి చూచింది. గాయం చూస్తే కళ్ళు తిరిగేయి.

అమితవేగంతో వెళ్ళి ప్రక్కనే ఉన్న నీటితొట్టె (పద్మలక్ష్మల సౌకర్యానికి ఉంచినది)లో నీళ్ళు పుడిసిట పట్టి పైటకొంగు స్వరున చించి తడిపి వెనుదిరిగి వచ్చింది. పుడికిట పట్టిన నీటిని చేతిలో వొంపుకుని శ్రీదేవుని నుదురు కడిగి శుభ్రం చేసింది. తడిపిన పైటకొంగు ముక్కను ఆ గాయంమీద గట్టిగా కట్టు కట్టి రక్తాన్ని ఆపివేసింది. అతనికి చేయి అందించి ఆశ్రమంలోకి నడిపించసాగింది ఏకవీర.

ఆశ్రమం వెలుపలే ఉన్నారు కృష్ణస్వామి. శ్రీదేవుడిని ఏకవీర నడిపించుకు రావటం, అతడి నుదురు మీద ఏకవీర పైటకొంగు కట్టుగా కట్టి వుండటం ఆయన సూక్ష్మ పరిశీలనకు కనిపించింది.

ఆయన కొంత బాధా, కొంత సంతోషమూ కలిసిన విచిత్ర ముద్రలో వారి రాక కోసం చూస్తూ నిలిచిపోయేరు.

"ఏమయింది తల్లీ" అన్నారు దగ్గరకు వొచ్చిన తర్వాత.

"పొరపాటు అయింది తాతగారూ. ఫలితంగా గాయమయింది."

కృష్ణస్వామి ముందు గాయాన్ని పరిశీలించేరు. వెంటనే ఆశ్రమం లోపలకు వెళ్లి ఏవో రెండు భస్మాలు తీసుకువచ్చేరు. ఒక పచ్చిఆకులో ఒక భస్మంవేసి గాయం మీద మళ్ళా కట్టు కట్టేరు. మరొక భస్మం మూడు చిటికలు తీసి శ్రీదేవుని చేత తినిపించేరు.

అప్పుడు అన్నారు.

"పొరపాటు అయిందా! ఎవరివల్ల తల్లీ"'

ఏకవీర తల వొంచుకుని రాయిలా అయింది. ఇంతసేపూ ఆమె శ్రీదేవుని రెక్క విడవనేలేదు. ఆ దృశ్యం కృష్ణస్వామికి నేత్రపర్వంగా ఉంది.

వారిద్దరూ అలా జీవిత మంతా కలిసి నిలవాలనీ, కలిసి నడవాలనీ మనసులో ఊహిస్తున్నారాయన.

"పోనీలే — ఎవరివల్ల అయినా పొరపాటు కనుక ఇంక చేసేది ఏమీలేదు. ఒక ఝాము గడిచేక శ్రీదేవునికి శరీరం వెచ్చబడి జ్వరం కూడ రావచ్చు. జాగ్రత్తగా చూసుకో అమ్మా" అన్నారు కృష్ణస్వామి. ఏకవీర వొంచిన తల ఎత్తకుండా ఔనని తలూపి ముందుకు సాగింది. శ్రీదేవుడు నడవసాగేడు.

"శ్రీదేవా! నాయనా!" పిలచేరు కృష్ణస్వామి. శ్రీదేవుడుని పిలిచి ఆయన ముఖం లోకి చూడసాగేడు.

"నాయనా! వైశాఖ పూర్ణిమ నాటికి యజ్ఞం పరిసమాప్తి కావాలనే విషయం గుర్తుందిగా. పదిహేను రోజులు ముందుగా అంటే పాడ్యమి నాటికే నీ శిల్ప నిర్మాణం పూర్తికావాలి. ఇవ్వాళో, రేపటికో అవసరమైన వస్తువులతో ఓరుగల్లు నుండి శిల్పులు రావచ్చు. యీలోపుగా నీవు పూర్తి విశ్రాంతి తీసుకుని సిద్ధంగా ఉండాలి. తెలిసిందా! నీకు సహాయంగా ఏకవీర ఉంటుంది. నీకు పూర్తిగా తగ్గే వరకూ శిల్పమందిరం చాయలకు వెళ్లకు, ఆశ్రమంలోనే ఉండు" అంటూ ముందుకు సాగేరు.

"స్వామీ!" పిలిచేడు శ్రీదేవుడు.

"ఏమిటి నాయనా! ఏ సందేహ మూ లేకుండా చెప్పు."

"నేను యీ శిల్ప నిర్మాణంలో పాల్గొన లేను" అంటూ తల వొంచేడు శ్రీదేవుడు.

కృష్ణస్వామి పిడుగుపాటు చూచినట్లు అయ్యేరు.

కాని చలించలేదు.

"ఎందువల్ల నాయనా! కారణం చెప్పు."

"..................."

"అంత చెప్పకూడని విషయమా?"

వనపర్తి సాహిత్య వేదిక అధ్యక్షుడు శ్రీ ఉమ్మెత్తల నరసింహమూర్తి, ఉమ్మెత్తల అవార్డు విజేత శ్రీ ఎ. సూర్య ప్రకాశ్‌ని సన్మానిస్తున్న దృశ్యం. సభాధ్యక్షత వహించిన శ్రీమతి పోల్కంపల్లి శాంతాదేవి, న్యాయ నిర్ణేతలు శ్రీ పల్లా నారాయణశర్మ, శ్రీ పర్వతరాజులని చిత్రంలో చూడవచ్చు.



# తిరుచరణాలు

"కాదు; కాని; ......"

"మరి ... ?"

"మీరు నా గురుదేవులు. మీ మనసు నొప్పించటం నాకు అయ్యే పనికాదు."

"నా గురించి నీవు ఆలోచించకు. చెప్పు."

శ్రీదేవుడు ప్రక్కనే ఉన్న ఏకవీరను చూసి తల వొంచేడు. ఆతడి సంశయం కృష్ణస్వామికి అర్థమయింది.

"అమ్మా ఏకవీరా! పుష్పసచయం కానివ్వు తల్లీ" అంటూ హెచ్చరించేరు కృష్ణస్వామి. ఏకవీర వెళ్ళిపోయింది.

"చెప్పు నాయనా! సందేహించకు" సూటిగా శిష్యుని కన్నుల్లోకి చూస్తూ అడిగేడు కృష్ణస్వామి.

"స్వామీ! నా మనసు ఏకాగ్రతను కోల్పోయింది. నేను తీర్చిదిద్దే శిల్పాలకు ముఖాకృతులు నేను ఊహించినట్లుగా రావటం లేదు. ఇది ..." అంటూ నీళ్ళు నమలటం ప్రారంభించేడు శ్రీదేవుడు.

"అన్ని ఆకృతులూ ఏకవీరను పోలివుంటున్నాయి కదూ!" అంటూ ప్రశ్నించేరు కృష్ణస్వామి. అంగీకార సూచనంగా వొంగి ఆయన పాదాలను తాకి లేచేడు శ్రీదేవుడు.

"తప్పులేదు నాయనా! ఆలయంలో ఏకవీరకు కూడా బుగ్గనసొట్ట ఉన్నది నీవు గమనించలేదూ! ఆ పోలిక ఆ దేవిది అవుతుంది కాని మన ఏకవీర పోలిక కాదు. నీవు త్వరపడి ఏ నిర్ణయానికి రాకు. ఇది చాల క్లిష్ట సమయం. ప్రతిష్టలను తేల్చి వేసుకునే ప్రయోగమే శాంతి యజ్ఞం. యీ మహాయజ్ఞంలో ఎవరి వొంతు పాత్రను వారు నిర్వహించాలి" అంటూ ఆతనికి ఉద్బోధించేరు కృష్ణస్వామి.

శ్రీదేవుని సంశయం నివృత్తి అయింది. కాని కృష్ణస్వామి మనసులో మరికొన్ని సంశయాలు తల ఎత్తాయి.

ఆయన గంభీరులు కావటంవల్ల ఆ సందేహాలను ముఖంలో కనిపించనీయ లేదు.

శ్రీదేవుడు వెళ్ళిపోయేడు ఆశ్రమంలోకి.

"ఏకవీరా! తల్లీ! ఏకవీరా!!" ఎలుగెత్తి పిలచేరు కృష్ణస్వామి.

ఆమె పరుగు పరుగున వచ్చి ఆయన ముందు నిలిచింది.

"తల్లీ నేను యిప్పుడు నారాయణతో మాట్లాడేందుకు వెళ్తున్నాను. శ్రీదేవుడు జాగ్రత్త" అని హెచ్చరిస్తూ ఆశ్రమ ప్రధాన ద్వారం దాటి వెలుపలకు వచ్చేరు కృష్ణస్వామి.

## 13

"ఇతడిని నేను పరదేశి అని పిలుస్తాను. నన్ను ఒక దుర్మార్గుడి బారినుండి రక్షించేడు. యిక్కడకు వొచ్చేందుకు సాయం చేసేడు" అన్నది పద్మగంధి. త్రిపురాంతకుడు తేలికగా ఊపిరి పీల్చి వొదిలేడు.

"ఏకవీర విషయంలో నీవు ఏమి చెయ్యాలని ఆశించేవు?" ప్రశ్నించేడు జైనస్వామి.

"ఆమె జీవితం ఉన్నత మార్గాన పయనించాలి."

"ఇప్పుడు ఆమె స్థితికి వొచ్చిన లోటు ఏమిటి?"

"నా ఆస్థి యావత్తు ఆమెకు చెందేలా చూడాలి."

"అందుకు నేను చేయవలసింది ఏమిటి?"

"మొగిలిచర్లలో జైనసభలు జరుగుతాయని విన్నాను."

"అక్కడకు నేను వొచ్చేది రానిదీ నీకు తెలియాలి అంటేనా?"

"అవును."

"అది అసాధ్యం. ఇది రాజకీయాలకు సంబంధించిన ప్రశ్న. నేను సమాధానం ఇవ్వలేను."

"మతానికి రాజకీయాలకు సంబంధం ఏమిటి?"

"అది చరిత్ర తెచ్చిన పరిణామం. దానిని మనం అవుననా్నా కాదన్నా అలా జరుగుతున్నది. కారణం నేను కాను."

"ఎవరు కారణం?"

"గణపతిదేవుడు జైనులమీద కత్తి దూసేడు. పాశుపత శైవులు జైనుల్ని హింసించేరు. మేము ప్రతీకారం తీర్చుకోవాలి."

"ప్రపంచంలోని ఏ మతమయినా కత్తితో ప్రతీకారం తీర్చుకోమని చెప్పదనుకుంటున్నాను."

"పద్మగంధీ! నీవు అనవసరమయిన విషయాలలో జోక్యం చేసుకుంటున్నావు."

"మీ అభిప్రాయాలు పరికావని నాకనిపించింది. గణపతిదేవుడు జైనులమీద అకారణంగానే కత్తి కట్టేడా?"

"ఆ చర్చ యిప్పుడు తేలేదికాదు. నీ విషయం మాట్లాడు."

"మీరు తండ్రి అయినప్పుడే మీకు కొన్ని బాధ్యతలు ఏర్పడ్డాయి. యిప్పుడు వాటినుండి పారిపోకండి" అన్నది పద్మగంధి.

తండ్రి అనే మాట ఆయన జీవితంలో తనకు తాను ఆపాదించుకుని వినటం ఇదే ప్రథమం. జైనస్వామి శరీరం జలదరించింది.

ఏవో చిన్నారి చేతులు తనను కావులించికుని బంధించేయి. ఆ అనుభూతి నుండి తప్పించుకోవాలని ఆయనకు అనిపించలేదు.

"అలాగే నీకు వాగ్దానం చేస్తున్నాను" అన్నాడు గంభీరంగా.

"మొగిలిచర్లను మీరు అందరూ కలిసి హిందూ జైనమతాల ప్రతిష్టలను తేల్చివేసుకునే సమరాంగణంగా మార్చాలనుకుంటున్నారు. మీ

"మమ్మీ, ఈ దురద,
మంటను ఎలాగైనా ఆపవూ."




2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

**నైసిల్ తెచ్చుకోండి**
**చెమటకాయల**
**బాధ మరిచిపోండి.**

ప్రత్యేకమైన ఔషధ యుక్త
నైసిల్ చెమటకాయలను ప్రతి
స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

CASGLN-4-203 TEL

చూపులన్నీ కృష్ణస్వామి మీదనే ఉంటాయని మాకు తెలుసు. మీ కఠినమైన రాజకీయ చదరంగంలో కన్నకూతురు బలి అయ్యే అవకాశాలు కూడ ఉన్నాయి.''

''నీవు ఏవేవో ఊహించుకుని అనవసరమయిన భయానికి లోను అవుతున్నావు. నేను ఏకవీరను కన్నతండ్రిగా నా బాధ్యతను నెరవేర్చుకుంటాను. కాని నాది కూడ ఒక కోరిక ...'' అంటూ సంశయంతో ఆగిపోయేడు జైనస్వామి.

''బహుశా అది కోరిక అయి వుండదు. షరతు అయి వుంటుంది. అది ఏదయినా నేను ఒప్పుకుందుకు సిద్ధంగా ఉన్నాను. చెప్పండి అది ఏమిటో ...''

''నీవు నా భ్రాంతులన్నీ తీసివేసుకుని జైనం స్వీకరించాలి. అక్కల వాడలో అందరినీ ఇందుకు ఒప్పించాలి.''

''నాలో ప్రవహించేది హిందూ రక్తం. నా తల్లిదండ్రులు హిందువులు.''

''ఆ జాడ్యమే వొదిలించుకోమంటున్నాను.''

''మనం కావాలనుకుంటే మనసు మార్చుకోగలం. రక్తాన్ని ఎలా మార్చుకోగలం.''

''పిచ్చిదానా! మత మనేది రక్తాన్ని అంటిపెట్టుకుని ఉంటుందా?''

''రక్త మనేది శరీరంలోకి ఎలా వొస్తుంది?'' అడిగింది పద్మగంధి.

''ఆహారంలోంచి. అంటే పంచభూతాల్లోంచి.'' చెప్పేడు జైనస్వామి.

''ఈ హిందూ దేశపు గాలి పీల్చి, పవిత్రమైన మన నదుల్లో నీళ్ల త్రాగినప్పుడు ఇది ఏ రక్త మవుతుంది.''

''అందుకే హిందువులు ఛాందసులంటాను. రక్తానికి కూడ రంగులు ఏర్పరుచుకోగల తర్కం మీకుంది.''

''నేను ఎన్ని శాస్త్రాలు చదివాను?'' అన్నది నవ్వుతూ పద్మగంధి.

''ఏమీ చదువుకోలేదు. అయినా యిలా మాట్లాడతావు. అదే విచిత్రంగా ఉంటుంది'' అన్నాడు జైనస్వామి.

''అది విచిత్రం కాదు. నా రక్తంలో ఉన్నది. కనుక అలా మాట్లాడకలిగాను'' అన్నది పద్మగంధి విజయగర్వంతో.

జైనస్వామి ఇక సంభాషణ పొడిగించ దలుచుకోలేదు.

''మీరు వెళ్లి విశ్రాంతి తీసుకోవచ్చు. తిరుగు ప్రయాణం ఎప్పుడు'' అంటూ ప్రశ్నించేడు.

''తక్షణమే వెళ్లిపోవాలి'' అన్నదామె. జైనస్వామి అనుమతించేడు.

**(ఇంకా వుంది)**

# కొత్త గొంతులు

— టి.యల్. కాంతారావు

పగలల్లా విచ్చల విడిగా సంచరించే
వెచ్చటి గాలుల పాములు
కన్నీటిని సైతం గడగడా
తాగేస్తాయి.
కాటువేసి కరుణను సైతం
రక్తంలా పీల్చేస్తాయి
ఒకప్పుడది సుమంగళిలా వచ్చుగా
మెరిసిన నేల
అమృతం కురిసి ఆనందం
కాలువలై పారిన నేల
ఇప్పుడది కాలి మసై పోయిన
వల్లకాడు
గ్రామదేవత గజ్జెకట్టి ఆడుతున్న
బీడు.

— శీలా వీర్రాజు

కృష్ణా పత్రికలో కొంతకాలం పనిచేసి, రాష్ట్ర ప్రభుత్వ సమాచార, పౌర సంబంధాల శాఖలో అనువాదకులుగా స్థిరపడ్డారు. చిత్రాలను గీయటంలో అందెవేసిన చెయ్యి వీర్రాజుగారిది. 1969 లో రాష్ట్ర ప్రభుత్వ సాహిత్య అకాడెమీ నుంచి 'మైనా' నవలకు బహుమతిని పొందారు. కరుణించని దేవత, కాంతిపూలు, వెలుగురేఖలు అనే నవలలు రాశారు. పగామైనస్ ద్వేషం, మనసులోని కుంచె, వాళ్ళమధ్య వంతెన, రంగుటద్దాలు, వీర్రాజు కథలు. హ్లాదిని, మబ్బు తెరలు, సమాధి, చాపకింద నీరు కథాసంకలనాలు వెలువడ్డాయి. ఈ దేశంలో ఆకలిచేసే నృత్యాన్ని కవిత్వ శిల్పంగా మలచిన సుభద్రాదేవిగారు వీరి అర్ధాంగి.

కుందుర్తి వచన కవిత్వంలో కథాకావ్యాల ఆవశ్యకతను గూర్చి పెద్దగా తపన పడినవాడు. వచన కవిత్వం ఒక ప్రక్రియగా నిలబడటానికి కథాకావ్యాలు దోహదం చేస్తాయని కుందుర్తి పూర్తిగా నమ్మాడు. దానికి వ్యతిరేకమైన విశ్వాసం కలిగినవాడు తిలక్. శీలా వీర్రాజుగారు కుందుర్తి నమ్మకానికి బలం చేకూర్చటానికేమో అన్నట్టుగా హృదయం దొరికింది, కొడిగట్టిన సూర్యుడు అనే రెండు కథా సంపుటాలు వచన కవితలో రాశారు. మళ్ళీ వెలుగు వచన కవితలో కథాకావ్యం. కిటికీ కన్ను వచన కవితా ఖండికల సంకలనం. కవిత్వ రచనలో కథా భాగం ఎప్పుడూ కూడా కవితా శిల్పానికి ప్రాణసంకటమైన సమస్య. కథ ప్రవేశించినప్పుడల్లా కవిత్వం పల్చబడి పద్యమే మిగిలిన సందర్భాలు ప్రాచీన కవిత్వంలో కోకొల్లలు. పద్యమే కవిత్వమనుకునే భ్రమలో బతుకుతున్నవాళ్ళు చాలామంది ఉన్నారు. కవిత్వం పల్చబడినా పద్యానికి ఒక చట్రం ఉంది కనుక నెట్టుకువస్తున్నది. వచన కవిత్వంలో అట్లా నెట్టుకురావటం సాధ్యపడదు. ఎక్కడ కించిత్ వచనత్వం చోటు చేసుకున్నా కవిత్వం యొక్క ఆభాసరూపమే తయారవుతుంది. వచన కవితా ఖండిక రాయటమే కష్టం. అందులోనూ కథా ఖండికలో, సమగ్ర కథా కావ్యాలో రాయటమంటే కవికి కత్తి అంచుమీద నడవటంలాంటిది. ఈ అసిధారా వ్రతాన్ని వీర్రాజుగారు సమర్థవంతంగా సాగించారు. ఆయనకూడా ఈ ప్రయత్నంలో కవిత్వపు అంచుల్నించి జారిపోయిన ప్రమాదాలు అక్కడక్కడా సంభవించినా ప్రయోగంలో విజయాన్నే సాధించారు.

తన వచన కవితా కథలకు, కావ్యానికి కేంద్రంగా నగర జీవితాన్ని తీసుకున్నారు. ఆధునిక కవిత్వంలో నగర వర్ణన ఆదిలో పఠాభి మహావ్యంగ్యంగా ప్రారంభించినవాడు. ఆరుద్ర గారు సరేసరి. వీర్రాజుగారి మళ్ళీ వెలుగు సంపూర్ణంగా నగర నాగరికతా సంక్షోభమే. కథేతివృత్తం సమకాలీన సంఘం; దాని మనస్తత్వం. కొడిగట్టిన సూర్యుడు, ముళ్ళరెమ్మ, విశ్వాసం నీడకింద ఈ మూడు కథలూ స్త్రీ, పురుషుల మధ్య ఆకర్షణకు సంబంధించినవే అయినా వాటివెనుక ఈనాటి జీవిత వాస్తవికత నేపథ్యంలా తొంగిచూస్తూనే ఉంటుంది. అద్దాల గుహ కథలో నగరంలో అర్ధరాత్రి ఏమీ తెలియని అమాయకురాలి అస్తమయం గూర్చి దానికి కారణమైన పరిస్థితుల విషవలయాలను గూర్చి వర్ణించటం జరిగింది. కాంక్రీటు నాగరిక మహారణ్యంలో రోడ్లమీద విచ్చలవిడిగా తిరిగే తోడేళ్ళు, అద్దాల గుహల్లో మాటేసే పులులూ, విరుతలూ, జిత్తులమారి నక్కలూ అమాయక



ప్రాణాల్నీ, మానాన్నీ దోచే పద్ధతి ఈ కథలో కవితాకృతిలో కనబడిన విధానంగొప్పది. హృదయం దొరికింది, అద్దెగది మామూలు కథలే అయినా చెప్పిన విధానం, కవిత్వాంశ చదివింపచేస్తాయి. ఈ కావ్యం ఉషస్సు, ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, సంధ్య, రాత్రి, అర్ధరాత్రి, కవి పలుకు అనే ప్రకరణాలుగా విభజింపబడింది. ఇది వరుసగా ఆశకు, చైతన్యానికి, అధికారానికి, ఆకర్షణకు, పతనానికి, పాపానికి, జడత్వానికి సంకేతాలని కావ్యారంభంలోనూ, ప్రతి ప్రకరణాంతంలోనూ కవే స్వయంగా చెప్పుకున్నారు. తుదిలో కవిపలుకులో ఈనాటి సమాజంలో ఉన్న ఈ గందరగోళం, ఈ వ్యవస్థను ఆక్రమించిన చీకటి, మనిషిలో పేరుకున్న దుర్మార్గం, అసహాయులు పడుతున్న అగచాట్లు ఇలాగే ఉండవని మంచి రోజులు మళ్ళీ వస్తాయని, జన జీవితంలో వెలుగు ప్రసరిస్తుందనే ఆశావాదం ప్రతిధ్వనిస్తుంది. 'అనుభూతి ప్రధానమైనది కవిత. అయితే ఆ అనుభూతి వైయక్తికమే అయినా దాని ప్రయోజనం మాత్రం సామాజికం కావాలనే సిద్ధాంతంతో ఎవరికీ విభేదం ఉండడానికి వీల్లేదు ఈనాడు' అని కవిత్వ ప్రయోజనంమీద తనకుగల అభిప్రాయాన్ని వేకువ తొలి వెలుగులో చెప్పారు వీర్రాజుగారు.

కిటికీకన్ను కవితా సంకలనం దగ్గరకు వచ్చేసరికి సమాజానికీ, కవిత్వానికీ సంబంధించినంతవరకూ వీర్రాజుగారి అభిప్రాయాలు ఇంకా తీవ్ర తరమయ్యాయి. ఈనాడు వస్తున్న అర్థపర్థంలేని కవిత్వాన్ని సామాన్యుల గుండెల్లోకి అనే ఖండికలో తూర్పార బట్టటం జరిగింది. ఆధునికత పేరుతో అబ్‌స్ట్రాక్ట్ పోయెమ్స్, కళా సంస్కృతులు పక్కదార్లు పట్టిపోగా వెర్రి తలల ఆలోచనల్లో పుట్టిన పిచ్చిగీతల్ని అద్భుతమైన కళాఖండాలుగా చెలామణీ చెయ్యడాన్ని ఆయన అంగీకరించలేదు. మాటల గారడీలు లేని, మార్మిక భావాల ముసుగులు తొడగని నిరాడంబర కవితని ఈ తరం ఆశిస్తున్నదని వీర్రాజుగారు చెబుతున్నారు. ఏ కవిత్వానికైనా అది నిజంగా కవిత్వం అయితే పరమార్థం ఒక్కటే అయి ఉంటుంది. ఇప్పటి అస్పష్ట కవిత్వానికి ఎవడికి తోచిన అర్థం వాడు చెప్పుకుంటాడు. ఇది కవిత్వానికి అనర్థమే. పెన్నుల్ని పంచుతూ గన్నుల్ని పట్టుకొమ్మనే చిత్తశుద్ధి లేని దగాకోరు కవులు, అర్థంకాని పదాల సర్కస్ ఫీట్ల అత్యాధునిక అబ్‌స్ట్రాక్ట్ కవులు, మోడ్రన్ మిస్టిక్ కవులు ఈ సమాజానికి అవసరం లేదని నిర్ద్వంద్వంగా చెప్పారు. సామాన్యుడి కథను కవిత్వంగా మలచిన కవి శీలా వీర్రాజు. ★




మూడురోజుల్నించీ ఒకటే వార్షాలు ! నేల పూర్తిగా నానిపోయి, లసపిసగా తయారయింది. తామర తంపరగా పుట్టుకొచ్చిన ఈగలు, రివ్వు రివ్వు మనెగుర్తూ, వీర విహారంచేస్తున్నాయ్. శాబర్‌జెట్ విమానాల్లాగా విన్యాసాలు చేస్తూ ఇంతంతలావు దోమలు, చిటుక్కు చిటుక్కుమని, అందినవాళ్ళని అందినట్టు, పొడుస్తున్నాయ్ ! వర్షం వచ్చిందని, స్కూలుకి సెలవు లివ్వటంవలన పిల్లలు, మునసబుగారి దొడ్లోనూ, చెరువు గట్టుమీద మర్రి చెట్టుకిందా, కచేరీ సావిడిదగ్గరా బురద దొక్కుకుంటూ, ఆటలలోపడ్డారు. బయటికి అడుగు వేస్తేచాలు, కస్సున సీలమండలదాకా దిగబడుతూ వుంది ! అట్టలుగట్టి చెప్పుల్లాగా తయారయిన, బురదను బరువుగా ఈడ్చుకుంటూ, మాగాణి పొలాలవయిపు పొయేవాళ్ళూ, పశువుల్ని మేతకి తోలుకుపోయేవాళ్ళూ సాగిపోతున్నారు. తట్టలు పట్టుకుని పశువులువేసే పేడకోసం, తగవులాడుకుంటూ, పేద పెంటమ్మలు, బురద తొక్కుకుంటూ, వాటి వెంట సాగిపోతున్నారు. తెరలు తెల్లగాడించిన ముసురు, వూరినీ, వూరి చుట్టూవున్న తాటి వరుసల్నీ, మామిడితోపుల్నీ కప్పివేసింది.

ఆ బురదని తొక్కుకుంటూ గొడుగేసుకుని వచ్చిన, సాయిబ్బు కార్డు ముక్కనెచ్చాడు ! 'ఈరయ్యా, ఈరయ్యా, నీ కుత్తరం వచ్చిందయ్యా.'అని— మంచంమీద కూర్చుని, చుట్ట గాల్చుకుంటున్న వీరయ్యకి ఇచ్చాడు. అదేదో, సాయిబ్బుతోనే చదివిచ్చుకున్న వీరయ్య మొహం పెట్రోమాక్సు లయిటులాగా వెలిగింది. ఆ వుత్తరం బస్తీనుంచి కిష్టయ్యరాసాడు.

'అన్నయ్యా ! అమ్మ ఆరోగ్యం బాగా దిగజారిపోయింది. నిన్ను జూడాలని ఒకటే గోల బెడతావుంది. అందువలన రేపు శుక్రవారం వుదయం బస్సుకి అమ్మని నీ దగ్గరకి పంపిస్తున్నాను. బస్సుదగ్గరకివచ్చి అమ్మను దీసికెళ్ళవలసింది.' అంటూ రాశాడు కిష్టయ్య. కార్డు చదివి, చేతిలోపలబెట్టి, తనదార్ని తనుపోయాడు సాయిబు !

అమ్మ ! రక్తం పంచి ఇచ్చి కనిపెంచిన కరుణామయి. ప్రేమను గోరుముద్దలుగా తినిపించిన తల్లి ! వీరయ్య, అమ్మనిజూసి చాలా రోజులయింది. ఈ మధ్యన ఒకటి రెండుసార్లు కలలోకి వచ్చింది. బాగా సుగలపండి ముగ్గిన శరీరం. తెల్లగా పల్చగా నెత్తిమీదవెంట్రుకలు. లోతుకుపోయిన గాజుకళ్ళల్లో, అభిమానం, ఆప్యాయతా. శిధిలమై, బలహీనంగా వ్రేలాడుతున్న అవయవాలు. కలలో అమ్మనిజూసి, నిద్రనుంచి లేచి వులిక్కిపడి కూర్చున్నాడు, వీరయ్య. అతని కళ్ళవెంట నీళ్ళుపొంగి వచ్చాయి. ఆమె పరిస్థితికి దుఃఖంతో అతనిగుండె కొట్టుకులాడింది.

ప్రెసిడెంటుగారి గేదలపాకలో, వెచ్చగా వరిగడ్డిమీద పడుకుని, పద్యాలెత్తుకున్నాడు కుంటి కనకయ్య. అపస్వరాలతో అతని గొంతు తారాస్థాయిని అందుకుంది. అది సహించలేని ఒక దోమలగుంపు, అతని మీద దాడిచేసి, లటలటా, కాళ్ళమీదా చేతులమీదా కుట్టి వదిలి పెట్టాయి. కసినీదీర్చుకుని ఎగుర్తూ గంతులు వేసి విన్యాసాలు చేసాయి.

'వీటెమ్మని...' అంటూ తపతపా, చేతుల్తో వాట్నే బాది, సామూహిక హత్యలుచేసాడు కనకయ్య. అదిచూస్తూ, నెమరేస్తున్న గమిడిగేద కళ్ళు టప టపా ఆర్పింది. ఆ ప్రక్కనే నీర్సంగా పడుకునివున్న ముసలిగేద, అదేం పట్టనట్టు, వంటిమీద వాలిన ఈగల్ని తోకతో తోలటానికి ప్రయత్నించింది. మెళ్ళో గంటల్ని గణ గణ మోగిస్తూ తలలూపాయి ఎద్దు; చెంగు చెంగున గంతులువేస్తున్న కోడెల్నిచూసి వుషారుగా.

ఆ దోమలబాధ పడలేక, వాట్నే బూతులు దిట్టుకుంటూ, లేచి నిలబడి వీరయ్యవయిపు దృష్టి పారించాడు కనకయ్య. బురదలోఆడుతున్న పిల్లల్ని తప తపాబాది, కసిదీరక, పెద్దగొంతుకతో అరుస్తూ, ఇంట్లోకి ప్రవేశిస్తూవుంది, వీరయ్యభార్య సూరమ్మ.

'ఎక్కడ్నించే బావా ?— వుత్తరమ్ముక్క వచ్చినట్టుందీ ?' అని అడిగాడు, కనకయ్య. 'మమ్మరాసింది' అన్నాడు తన్మయంగా చేతిలోని కార్డుముక్కను చూసుకుంటూ, వీరయ్య.

'ఏం రాసిందీ ? అంతా బాగా వుండారా ?'

'ఆం— అంతా బాగానే వుండారులె.'

'మీ తమ్ముడూ కిష్టయ్య, అతని పిల్లలూ బాగానే వుండారా ?'

'ఆఁ. అంతా బాగానే వుండారు.'

'ఇంకేం రాసిందీ, మీయమ్మ ...?'

'నన్ను చూడాలనిపిచ్చిందట; వత్తున్నానని రాసింది, మాయమ్మ.'

'ఎందుకు రాదూ ? వత్తాన్నానని రాసి, వత్తుంది! ప్రేమని పంచిపెట్టటానిక్కి వత్తుంది. అబ్బో! ఎంత ప్రేమో ! పెద్ద కొడుకంటే ఆవిడకి ఎంత ప్రేమో నాకు దెలీదా ?' అంటూ

# న్యూట్రముల్ శక్తి.

## ఛాంపియన్లు ఎందుకునేది యిది.

న్యూట్రముల్. సమృద్ధి అయిన అమూల్ పాలు, ఎంచిన మాల్ట్, ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు, పుష్టినిచ్చే ప్రోటీన్లు, అత్యవసరమైన ఖనిజాలు, ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మరో విషయం గుర్తుంచుకోండి, కేవలం న్యూట్రముల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.

Nutramul
AMUL'S NOURISHING DRINK

**మరింత పొడుగ్గా, బలంగా, పుష్టిగా అవడం ఎలా?**

కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక!

To: Nutramul, P.O. Box 10148, Bombay 400 001 nn

ప్రియమైన న్యూట్రముల్,

దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజీ స్టాంపులూ. న్యూట్రముల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తూన్నాను. సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు ________________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు ________________________

IS-1806
ISI

మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్
మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001.



daCunha/GCM/76/TL/82




తగులుకుంది పెద్దగా, సూరమ్మ. మూతి ముప్పయ్యార్రు వంకర్లు దిప్పింది. వీరయ్య కెదురుగా చతికిలబడి కూర్చుంది తీరిగ్గా.

'అసలూ ఏంటే నువ్వనేది?' అని తీవ్రంగా చూసాడు వీరయ్య, సూరమ్మని.

'మెళ్ళో వున్న ఆ గొలుసేమో చిన్న కొడుక్కి, గుండెల్లో ప్రేమలన్నీ పెద్ద కొడుక్కినూ. జాణతనం నాకు దెలీదూ ? అంత మాత్రానికే–, 'అమ్మ వత్తందీ అమ్మవత్తందీ' అని ఎగిరి గంతులెయ్యాలా ?!'

'సర్లె. నోర్మూయ్.'

'న్యాయం వుండాలి. ధర్మం వుండాలి. ఎవరికన్నా చెబితే, ఏ పెద్ద మనిషన్నా సరే. సెబాషని మెచ్చుకోవాలి. అదేం లేదు. ఆ ముసల్దానికి చిన్న కొడుకంటేనే పక్షపాతం. చిన్న కోడలంటేనే అభిమానం. ఏం ? బస్తీలో దర్జాగా సంపాదిస్తున్నాడు. ఆ కిష్టయ్యకి ఏం తక్కువా ? అని ! వున్నవాడా వున్నవాడికే పెట్టాడు; లేనివాడా వున్నవాడికే పెట్టాడనీ, మీయమ్మ చేసే పన్లు ఎవ్వరికి దెల్వవనీ ? నేన్జేసిన తప్పేమిటే ? నా పిల్లలు తనకేం ద్రోహం చేసారనీ, మీయమ్మ వున్నదంతా ఆ చిన్న కొడుక్కి దోచి పెట్టిందీ? ఆ సంగతి జెప్పు, ముందు.'

'చాల్లే నోర్మూయ్యన్నానా ?!'

'ఎందుకు మూయ్యాలీ! ఆ గొలుసుని ఆవిడ, చిన్న కోడలికి ఎందుకియ్యాలీ ?'

'ఇచ్చిందని ఎట్లా చెపుతున్నావ్ ?'

'నాకియ్యలేదు. ఇంకా ఎవరికిచ్చిందని అనుకోమంటావ్ ? మరీ ?'

'తన గొలుసుని మాయమ్మ, తన ఇష్టం వచ్చిన వాళ్ళకి ఇచ్చుకుంటుంది. దాని గురించి ఎవరూ రాద్ధాంతం చేసేందుకు ఏమీలేదు. కనుక ఇకనయినా నోరు మూసుకుని నీ పని చూసుకో.'

'మూసుకుంటా. మూసుకుంటా. చాతకాని మొగుడ్ని పెట్టుకుని, అంతకంటే ఏం చేసేదీ?'

వీరయ్య గుడ్లు ఎర్రజేసి చూసాడు. పొంగి వచ్చిన కోపాన్ని అణచటానికి ప్రయత్నించాడు.

# ఏటి జోరు

గొణుక్కుంటూ, శాపనార్థాలు పెడ్తూ లేచి లోపలికి పోయింది, సూరమ్మ.

'ఈ ఆడాళ్ళతో యాగటం చాలా కష్టం, బావయ్యా !' అన్నాడు కనకయ్య ఓదార్పుగా.

వీరయ్య మౌనంగా వుండిపోయాడు; గుండెల్ని గట్టిగా నొక్కినట్లన్పించింది.

'మూర్ఖపు మనుషులు.' అని గొణిగాడు వీరయ్య కోపంగా.

'చూసావు గదా ! మీయమ్మ ఇక్కడికి వస్తావుందీ, అని చెప్పగానే, సూరమ్మ ఎంత ఇదిగా చిందులు ఏసిందో ?! కాటికి కాళ్ళు చాచుకున్న ముసల్దానిమీద అంత పగా ?! ఈ ఆడాళ్ళకు ఒకళ్ళతో ఒకళ్ళకి పడకుండా తంపులు పెట్టటం, ఆ బ్రహ్మయ్య చేసిన చిత్రాలలోకల్లా గొప్ప చిత్రం అనుకుంటా, నేను.' కనకయ్య అన్నాడు, సాలోచనగా.

'సరే గానీ, బస్తీ నుంచి బస్సు ఎన్నింటికీ వచ్చేదీ ?'– అని అడిగాడు వీరయ్య.

'మామూలుగా అయితే పగలు పన్నెండు గంటలకి రావాలి. ఒకటే ట్రిప్పు గదా. వచ్చి వెళ్ళాలి. కాని ఇవ్వాళ ఆ బస్సు వచ్చి పోతుందా అనీ ?'

'ఏం ? ఎందుకు రాదూ ?'

'ఆ రోడ్డంతా గుంటలుపడి చాలా ఇదిగా తయారయ్యింది. దానికి తోడు, ఓగేరుకి నీళ్ళు వచ్చాయంట ! నీకు తెలీదా ?'

'అట్లాగా. నాకు దెలీదే !'

'మహా గొప్పగా వచ్చిందిలే ! వూళ్ళో, కాల్నిలవని వాయాళ్ళందరూ, పొద్దుట్నించీ ఇదిగా ఆడకుబోయి, ఆ వరద నీటిని ఒకటే ఇధాన చూసి వచ్చి, వూళ్ళో డప్పులు గొట్టి చెపుతున్నారు గందా !'

'అట్టాగా ! వుప్పుడు టయిమెంతయ్యిందీ? ఆజ్జెప్పు.'

'ఇందాక, ప్రెసిడెంటుగారి కుర్రాడు, ముద్దాపుకుంటూ, తిరుగుతా కనపడ్డాడు. అబ్బాయా ! టయిమెంతా అని, అడిగితే పదయిందన్నాడు. అది జరిగి గంటవలా ?!' చుట్టని అవతలకి విసిరేసి, లేచి లోపలికి వెళ్ళాడు వీరయ్య. బీరువా తెరిచి డబ్బులు దీసుకుని చొక్కాజేబులో బెట్టుకున్నాడు.

'ఇదుగో ! ఏం జేస్తున్నా ? విన్నే ' అని పిలిచాడు.

'ఆఁ. ఏం ? ' అని విసుగ్గా పలికింది సూరమ్మ లోపల్నుంచి.

'నేనట్లా వెళ్ళి, బస్సులో వచ్చే అమ్మని, దీసుకొస్తా.'

'అట్టాగే. బుజాల మీద ఎక్కించుకు దీసుకురండి !' వెటకారంగా అంది.

'బుజాలమీద గాకపోతే, నెత్తిమీద పెట్టుకుని దీసుకొస్తా. నోరు మూసుకుని, చెప్పింది వినవే, పాడు మొహందానా !'

'ఇంతకాలం కాపురం చేసి, ఆ సంగతి గ్రహించావన్నమాట ! బలే తెలివిగందా !'

'నిశ్చయంగా అవును. సరేగానీ, పొద్దున్నగా బయలుదేరిన మా అమ్మ ఏంతిన్నదో, ఏమో ! ఏమయినా తింటానికి వుంటే ఇవ్వు. కర్జూరప్పండు కాస్త పొట్లంగట్టియ్యి.'

## డాక్టర్ల కంప్యూటర్ !

జపానులోని కొనిషిరొకు ఫొటో కంపెనీవారు వైద్య సమాచారాన్ని తెలిపే కంప్యూటరును తయారు చేశారు. వైద్య సమాచారాన్ని ఇందులో పొందుపరచి అవసరమైనప్పుడు మరల పొందేందుకు వీలుగా ఉంటుంది. దీనిలో ఎక్స్‌రేలను ఉపయోగిస్తారు. పెద్ద ఆసుపత్రులలోనూ, డాక్టర్లకూ ఇది ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది. అమెరికాలోని డిజిటల్ ఎక్విప్‌మెంట్ కార్పొరేషను అనే సంస్థ దీని తయారీలో సహకారాన్ని అందచేసింది.

'అది ఎప్పుడో అయిపోయింది, ఇంకా వుందనుకుంటున్నావా ?'

'నువ్వు తినేశావా? మొన్ననేగదా తెచ్చాను!'

'నేనూ; పిల్లలూ తినేశాం. తప్పా ?'

''తప్పు గాదులే. నే నట్లా పోయివస్తాను. అమ్మకి మెత్తగా అన్నం వండు ! తినలేదు'

'మెత్తగా అన్నం వండటానికి, ఆ కట్టెలు మండటంలేదు. ఈ ముసుర్లో మనిషి కొక రకంగా వంట చెయ్యటానికి చెప్పేనంత తేలికా గాదు.'

'అయితే, నువ్వనేదేంటే ?!'

'నీకు అంత ఇదిగా వుంటే, మీ అమ్మనీ్దసుకు నొచ్చినాక, నువ్వే మెత్తగా అన్నం వండి పెట్ట వచ్చు. ఆ కన్నతల్లి ఋణ దీర్చుకునే ఆదర్శ పుత్రుడువు గదా !'

వీరయ్యకి కోపం పొంగివచ్చింది. ఆపుకున్నాడు.

'నీకు ఇప్పుడు దెలవదులే. రేపు కోడళ్ళు వస్తే అప్పుడు తెలుస్తుంది.' — అని, కండువా కసిగా దులిపి, బుజాన వేసుకుని బయటపడ్డాడు.

పాకలో కనకయ్య మళ్ళీ పద్యాలు అందుకున్నాడు. దోమలు మళ్ళీ చెలరేగాయి. ఎగిరివచ్చి కుట్టే, తప తప మన్న దెబ్బలకి, పేలిపోయిన విమానాల్లాగా పచ్చడిపచ్చడి అవుతున్నాయి.

చినుకు తర్వాత చినుకు పడ్తావుంది. చికాకు కలిగించే ఈ చినుకులకు ఒక అంతూ పొంతూ వున్నట్లు లేదు. కంకరరోడ్డు ఎక్కి కాలవలో కాళ్ళు కడుక్కున్నాడు వీరయ్య. పొన్నుసామి టీ కొట్టు దగ్గర, సందడిగా వుంది. వూళ్ళో కుర్రకారు అందరూ అక్కడ చేరారు. సాంబయ్య కిరాణా దుకాణమే ఖాళీగా వుంది ! సాంబయ్యనడిగి ఒక రూపాయికి కర్బూరపు పండు పొట్లం గట్టించి, జేబులో పెట్టుకున్నాడు.

గడ్డిమోపుని నెత్తిన బెట్టుకుని, వూగుకుంటూ వచ్చాడు, శేషమ్మగారి సత్యనారాయణ !

'ఒరేయ్ ! సత్తిగా'

'ఏంటి ఈరయ్య మావా ?'

'బస్తీ నుంచి బస్సు వచ్చిందంట్రా ?'

'ఇంకెక్కడి బస్సు మావా ? ఓగేరు వచ్చిందిగా ! అన్నట్టు, మర్చిపోయానయ్యోయ్. బస్సు వచ్చి ఆగింది గదా అవతలి వడ్డునా ! అందులోంచి మీయమ్మా, తమ్ముడూ దిగినారు. ఆ వడ్డు నుంచి కిష్టయ్య కేకేసి నాతో చెప్పాడు ...ఆ బస్సుకేవో రిపేర్లు చేస్తున్నారులే.'

'ఏం జెప్పాడూ ?'

'ఇట్టా, మమ్మా నేనూ వచ్చామని, మన్నయ్యతో జెప్పు — సన్నయ్యవస్తే ఒకసారి జూసి, మేం తిరిగి ఈ బస్సులోనే పోతామూ ... ఈ ఏరు దాటలేమూ అని...'

'ఓర్నీమతిమరుపుని దొంగల్దోలా ! ఎంత సేపయిందిరా, చెప్పే ?'

'ఉప్పుడేలేవే ! త్వరగాబో. మళ్ళా బస్సు బోతే, అళ్ళుండరు !'

# ఏటి జోరు

గబగబా అడుగులువేసి, వానలోతడుస్తూనే, సాగిపోయాడు వీరయ్య. సొలివచ్చింది. ఆయాసంతో రొప్పాడు. అయినా దేన్నీ లెక్క చేయకుండా, పరుగులాంటి నడకతో, మొహాన్న పట్టిన చమటని తుడుచుకుంటూ సాగిపోయాడు.

వికృతంగా ఓగేరు వురవళ్ళు పరవళ్ళు తొక్కుతూవుంది. వేగంతో నీళ్ళు సుళ్ళు తిరుగుతూ భయం గొలుపుతూ ఉంది.

అవతలి వడ్డున ఎర్రగా బస్సు విలబడి వుంది. ఇంకా రిపేర్లు అయినట్లు లేదు. ''అబ్బాయ్ ! కిష్టయ్యా ! కిష్టయ్యా !'' అని గొంతెత్తి పిలిచాడు వీరయ్య. ఆ గొంతు విని కిష్టయ్య బస్సుదిగి వచ్చాడు. 'అన్నయ్యా' అని అరిచాడు వీరయ్యని గుర్తించి ఆప్యాయంగా.

'అమ్మేదిరా ?'

'లోపల బస్సులో వుంది' చలికి గజగజ వణుకుతూ వుంది.'

వీరయ్య చొక్కాతీసి. తలకిచుట్టుకున్నాడు. పంచని పిర్రలచుట్టూ ఎగేసి, బిగగట్టాడు, చెంగున నాలుగుబారలలో అవతలివడ్డుకి చేరాడు. తమ్ముడి చేయి అందుకుని ఆత్రంగా గబగబా తల్లి దగ్గరకి నడిచాడు, గుండెలు గుబగుబలాడగా.

పూర్తిగా పండిపోయి, రాలిపోవటానికి సిద్ధంగా వున్న, తల్లి దగ్గర కూర్చుని భక్తితో ఆమె పాదాలకు నమస్కరించాడు. ఆమె గాజు కళ్ళల్లో నీళ్ళు నిండాయి. నిండు మనస్సుతో చిరంజీవిగా వర్ధిల్లమని కొడుకుని ఆశీర్వదించింది. కొడుకుల్ని ఇద్దరినీ ప్రక్కప్రక్కనే కూర్చో పెట్టుకుని, కన్నులారా చూసుకుని ఆనందించింది. ఆ ఇద్దరూ పుట్టాక, భర్త పోవటం, నానా కష్టాలు పడి తను వాళ్ళని పెంచుకుని పెద్ద చేయటం, ప్రయోజకుల్నిగా తీర్చి దిద్దటం, మొదలయిన విషయాలన్నీ జ్ఞాపకం చేసుకుంది. ఆ తర్వాత, తల్లీ కొడుకుల మధ్యన ఎన్నో ముచ్చట్లు నడిచాయి. తను తెచ్చిన కర్బూరపు పండు ఆమెచేత తినిపించాడు వీరయ్య. దాన్ని ఆమె తృప్తిగా చప్పరిస్తూ వుంటే, చూసి ఆనందిచాడు. చివరికి—

'నాన్నా ! పెద్దాడా ! ఇక నా పని అయిపోయిందిరా. ఎప్పుడు రాలిపోతానో తెలియదు. ఆ భయంతోనే, ఇప్పుడు ఈ ప్రయాణం పెట్టుకున్నాను. మనవల్నీ, కోడల్నీ చూద్దామనుకుంటున్నాను. గాని నాకు ఆ ప్రాప్తం లేదు. నిన్నయినా చూసుకోగల్గాను. అదే పదివేలు ! తమ్ముడ్ని జాగ్రత్తగా చూసుకో. ఇద్దరూ కలకాలం రామలక్ష్మణుల్లాగావుండండి. కష్టంలో సుఖంలోనూ, ఇద్దరూ ఒకరికొకరు తోడుగా వుండండి. అదే నా కోరిక' అంది వృద్ధురాలు.

'అలాగే, అమ్మా' అన్నాడు వీరయ్య. ఆ తర్వాత ఆమె సంచిలోనుంచి ఒక పొట్లాన్ని తీసింది. పైనున్న కాగితం విప్పగానే మిలమిల మెరుస్తూ కన్పడింది బంగారం గొలుసు !

'బాబూ ! నా దగ్గర మిగిలింది, నేను మీకు చివరిసారిగా ఇవ్వగలిగిందీ, ఇదే ! తమ్ముడ్నడిగాను. ఇది నీకు ఇవ్వటమే న్యాయమని వాడన్నాడు. వాడిపని బాగానే వుంది. మీ ఇద్దరిలోనూ, నీ పరిస్థితే కాస్త తరుగుగా వున్నందువలన, ఇది తీసుకెళ్ళి కోడలుకియ్యి'— అందామె. వీరయ్య వద్దన్నాడు. అది, కిష్టయ్యకే ఇవ్వమన్నాడు. చాలాసేపు తర్జన భర్జనలయాక వాళ్ళిద్దరూ కలిసి వీరయ్యనే వప్పించి, బలవంతాన, ఆ గొలుసుని అతని చేతిలో పెట్టారు !

పం, పాం అంటూ బస్సుహారన్ మ్రోగింది. రిపేరు పూర్తయిన బస్సు కొన్ని క్షణాలలోనే తిరుగు ప్రయాణం సాగించింది. ఆ బస్సులో సాగిపోతూవున్న తల్లికీ, తమ్ముడికి, చెయ్యి వూపుతూ కన్నీళ్ళతో వీడ్కోలు చెప్పాడు వీరయ్య. బస్సు రోడ్డు ప్రక్కనున్న చింతచెంట్ల వరసలలో అదృశ్యమయింది.

ఆ వడ్డునీ, ఈ వడ్డుని విడదీస్తూ, విర్రవీగుతూవున్న వరదనీటితో, నిండివుంది ఏరు. ఆ నీటిలో దూకి నాలుగు బారల్లో ఇవతలివడ్డు చేరాడు వీరయ్య. బట్టలు పిండుకున్నాడు.

గర్వంతో, అహంతో ఎగిరి పడుతూ వుంది ఏరు. చాలాసేపు అక్కడే నిలబడి, ఏటిలోని నీటివంకా, నీటిలో చెలరేగే సుడిగుండాలవంకా చూసాడు: కుడిచేతి గుప్పెట విప్పాడు! మిలమిలా మెరుస్తూ కనపడింది ఆ గొలుసు ! సూరమ్మ, ఆమె మాటలూ, ఆమె శాపనార్థాలూ, గుండెలకి తూట్లుపొడిచే ఆ వాగ్బాణాలూ, తలపుకివచ్చేయి. అసహ్యంతో నిండిపోయింది మనస్సు. గిజగిజలాడింది చాలాసేపు !

చేతిలోవున్న ఆ గొలుసుని, విసిరి వురవళ్ళు త్రొక్కే ఏటి నీటిలోకి పారవేసి, వెనుదిరిగి వూరివయిపు సాగాడు వీరయ్య. చినుకులు పెద్దవయ్యాయి. వర్షపుజోరు ఎక్కువయింది. ★

## 'గుర్తించాలి'

కాలం విలువ
మానవాళి కన్న
తరులతాదులకే
బాగా గ్రహింపు
అందుకే అవి
సకాలంలో పూసి
ఫల పుష్పాదులతో
తరిస్తాయి

— మాధవరపు కృష్ణ

# "కాంప్లాన్® మాత్రమే మా కుటుంబానికి సరియైనది–సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం."



"మా శ్రీవారు పనిలో మునిగి వుంటా
రెప్పుడూ—తరచు భోజనం ఎగ్గొడుతూ
ఉంటారు. ఆయనకు అందని ఆ పోషణని
యిస్తుంది కాంప్లాన్."



"మా అబ్బాయి అన్నం సరిగ్గా తినడు,
మారాం చేస్తాడు. వాడి పెరుగుదలకు కావలసిన
ప్రొటీన్లూ, యితర ఆహార పదార్థాలూ
కాంప్లాన్‌తో తప్పకుండా అందుతాయి"



"మా అమ్మ యిప్పుడే జబ్బుపడి లేచింది.
ఆకలి లేదు. కోలుకునే యీ సమయంలో,
కాంప్లాన్ ఆదర్శమైన తీరులో
పుష్టినిస్తుందనిపిస్తోంది."

## కేవలం కాంప్లాన్® లోనే అందరికీ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.



"ఇంట్లో పని చేసిచేసి
అలసిపోతాన్నేను.
మరింత పోషణ
అవసరమనిపిస్తుంది
ఒక్కొక్కప్పుడు.
మరి కాంప్లాన్, నేను మా
కుటుంబానికి
యివ్వగలిగినంత
యిచ్చేలా
చేస్తుందనిపిస్తుంది."

కేవలం కాంప్లాన్‌లోనే శాస్త్రీయంగా రూపొందించిన పాళ్ళలో, మన శరీరానికి ప్రతిరోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి...ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన పానీయం.

రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ–కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనల్లో దొరుకుతుంది— ప్లెయిన్ (సాదాగా) కూడా.




# కాంప్లాన్®

## —సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం.

GLC-10-2316 TL (R)




### యు. జె. ఆర్. — ఎమ్మిగనూరు

ఉద్యోగం పురుష లక్షణం అన్నారు. మరి స్త్రీ విషయంలో ఏమనాలి ?

★ అసలు నానుడి మార్చాలి — ఉద్యోగం మనిషి లక్షణం అనుకుంటే సరి.

### కె. ఎ. ఆర్. — అక్కుపల్లి

ప్రేమికులు కొంతవరకు వరకట్న నిషేధం చేస్తున్నారు. కనుక వారు నిరభ్యంతరంగా పెళ్లి చేసుకోవచ్చని ప్రభుత్వమైనా యీ పద్ధతిని ప్రవేశపెడితే బాగుండును..

★ ఇది మరీ బాగుంది. ఈ లెక్కనపోతే — ఆలికి చీర కొనడం వూరికి ఉపకారం చేసినట్టని గర్వపడిపోతారు ! సాంఘిక సంస్కరణలలో ప్రభుత్వ జోక్యం ఎంత తక్కువ వుంటే అంత మంచిది.

### బి. ఎమ్. పి. — మోరి

లైఫ్ యీజ్ నాట్ ఎ బెడ్ ఆఫ్ రోజెస్ ?

★ అవును; అలా అని ముళ్లకంపా కాదు !

సృష్టిలో తీయినిది స్నేహమా? ప్రేమా?

★ రెండును ! పది కాలాలు నిలబడితే.

### ఎ. ఎన్. టి. ఆర్. — ఖర్గపూరు

పని చేయకపోయినా ఫరవాలేదు పిల్లనిస్తాం అంటున్నారు.

★ ఎవరండీ బాబూ వాళ్లు? ఆడపిల్ల అంత భారమైందా ?"

### కె. ఆర్. ఆర్. — రూర్కేలా

నేనొక అమ్మాయిని ప్రేమించాను. మా పెళ్ళికి మా అన్నయ్య ఒప్పుకోడంలేదు'

★ మీరు మేజరేనా? మీరు భార్యకు అన్నం పెట్టకలనన్న ధైర్యం (రాబడి) వుందా? పిల్ల మైనరు కాదుకదా?... మరింక గట్టి పట్టు పట్టడానికి ఆటంకాలేమిటి?— మీ పిరికితనం తప్ప !

### ఎన్. టి. ఆర్. — ఎమ్మిగనూరు

మీ జవాబులు చూస్తుంటే గర్వం ముందు పుట్టి తర్వాత మీరు పుట్టారేమో ననిపిస్తుంది. మీ జవాబులకు ప్రశ్నలు పంపినవారు ఎంత బాధ పడతారో తెలుసుకోకుండా తలతిక్క సమాధానాలివ్వడం అతితెలివి అని తెలుసుకుంటే మంచిది.

★ అదేమిటీ ! మరీ ఉత్తరం ప్రచురించ వద్దు అంటూ గీత గీశారెందుకండీ తిమ్మారెడ్డి గారూ?! తెలివికీ అతితెలివికీ తేడా తెలియని అమాయకుల ప్రశ్నలు వేరేగా వుంటాయి! అది మీరు గ్రహించడం కూడా అవసరం.

### వి. వి. — అవనిగడ్డ శివారు

డాక్టరు సలహా కొరకు ఒక పత్రికలో ఓ 'మహిళామణి'...

★ క్షమించండి. వ్యక్తిగత వైద్యసమస్యలకిలా పత్రికాముఖాన జవాబులు, ట్రీట్‌మెంట్లు యివ్వడంలో ప్రమాదాలు చాలా వున్నాయని నా నమ్మకం. ఇక వీటిని సెక్సుకే పరిమితం చేసి రాస్తున్న సందర్భాలు ఎక్కువ కానరావడం— ఆయా పత్రికాధిపతులకు తెలియని విషయం అంటారా ?! అంత బరితెగించి అడిగిన విషయం నిజంగా ఓ స్త్రీ రాసినదంటారా ?!

### ఎమ్. డి. ఆర్. — డిబ్రుఘర్

రామలక్ష్మిగారూ ! పుణ్యం చేసిన వారు స్వర్గానికి, పాపం చేసిన వారు నరకానికి పోతారని అంటారు. మరి ప్రేమ చేసిన వారు ?

★ వారికి యింతే — స్వర్గమో ! నరకమో !!

### కె. ఎన్. వి. — యానాం

నాకు 17 సంవత్సరాల వయస్సులో రచనలు చేయాలనే తపన ఎక్కువగా వుండేది. ఆ ఉత్సాహంతో ఒక కథ రాసి దాన్ని, నాకు దగ్గిర బంధువుకి చూపిస్తే అపహాస్యం చేయటంతో విరమించుకున్నాను. ఇప్పుడు నా వయసు 22.

★ చాలా పొరపడి రచనా వ్యాసంగం త్యజించేశావు సోదరీ; బంధువు మాటలెక్క పెట్టడం పొరపాటు. రాస్తూ వుండి వుంటే యీ సరికి — పేరు దానంతట అదే వచ్చేది; ఏం రాసినా ధైర్యంగా ప్రచురణకు పంపించే యీనాటి అనేకానేక కొత్త రచయితలను చూసి ధైర్యం తెచ్చుకోవాలి. ఇప్పుడైనా మించిపోయినది లేదు. తిరిగి ప్రారంభించు. 22 పెద్ద వయస్సేం కాదే !

### సిహెచ్. ఎన్. ఆర్. — చీమకుర్తి

స్త్రీలకు ఆస్తి హక్కు వరకట్న సమస్యకి పరిష్కారమా ?

★ కాదు. ఆస్తి లేనివాళ్ల సంగతి కూడా ఆలోచించాలి. ఉన్నవాళ్లు ఆస్తి ఆడపిల్లలకు సహితం పంచే సంస్కారులు కావాలి. ఆస్తి లేనివారికి వరకట్నం శాపంగా మిగిలిపోకూడదు.

### జి. ఆర్. — కాజీపేట

ఈ సమాజంలో అన్నయ్య చెల్లెలు వెదుతుంటే లేనిపోని కూతలు కూస్తారు ఎందుకు ? వారికి వుండరా ?

★ ఉంటారు. కాని మీ సంగతి వాళ్లకి తెలియదు కదా! కూతలు కూడా పట్టించకుంటే ఎలా ?!

# శ్రీరంగపట్నం



## శ్రీరంగనాథస్వామి

మైసూరుకు వెళ్ళే దారిలో కావేరీనది రెండు పాయలుగా విడుతుంది. ఆ రెండు పాయలు నాలుగు కిలోమీటర్ల దూరం ప్రవహించాక మళ్ళీ ఏకం అయిపోతాయి.

మధ్యన ఉన్న ఈ నాల్గు కిలోమీటర్ల ద్వీపాన్ని శ్రీరంగపట్నం అంటారు. అది ఒక చక్కని చిన్నగ్రామం. ఈ శ్రీరంగాన్ని 'ఆది రంగం' అనీ, శివ సముద్రం అనబడే స్థలాన్ని "మధ్యరంగం" అనీ, తమిళనాడులో కావేరీనదికి కొళ్ళడం నదిక్ (అంటే ఈ కొళ్ళడం కూడా కావేరీనదిలోని ఒక ఉపనదే) మధ్యన ఉన్న ద్వీపాన్ని "అంతిమ రంగం" అనీ చెప్పబడుతూంది. బ్రహ్మాండ పురాణంలో శ్రీరంగ పట్టణాన్ని "పశ్చిమ రంగం" అనీ, శ్రీరంగాన్ని పూర్వరంగం అనీ, తిరువనంతపురాన్ని "దక్షిణ రంగం" అనీ చెప్పబడుతూంది.

శ్రీరంగంలో సవిలాసంగా శేషశయనుడై ఉన్న శ్రీ రంగనాథస్వామి కావేరీదేవి భక్తికి మెచ్చి ఆ తల్లికి నదీతీరాన్న దర్శనం ఇచ్చాడనీ, ఆ నదీ కోరికపై అక్కడనే శయనించి భక్తులకు దర్శనం ఇస్తున్నాడనీ అక్కడ వాడుకలో ఉన్న ప్రజాభిప్రాయం.

శ్రీ గౌతమ మహర్షి గోదావరీ తీరాన్నుండి వచ్చి ఈ శ్రీరంగ పట్నంలో తపస్సు చేసి రంగ నాథుని అనుగ్రహం పొందారట. కావేరీనది రెండుగా విడుతూన్న ప్రదేశమే శ్రీ గౌతమ మహర్షి తపస్సు చేసిన స్థలం.

రంగనాథుల చరిత్రలలో కూడా శ్రీరంగ పట్నం ప్రసిద్ధి కెక్కినదిగా చెప్పబడుతోంది.

శ్రీరంగ పట్నానికి ముందు కావేరీనది చీలికలై మళ్ళీ ఈ పట్నానికి అవతల ఒకటిగా కల్సిపోతున్నట్టుగానే స్మార్త, వైష్ణవ విభిన్నమైన భేదాభిప్రాయాలతో ప్రజలు ఇక్కడికి వచ్చినా స్వామి దర్శనానంతరం అందరికీ "మనం అందరం భగవంతుని బిడ్డలమే" అన్న సద్భావం కల్గే తీరుతుంది.

బెంగుళూర్ గేటులోనుండి స్వామి దర్శనం కోసం ఊరిలోనికి వెళ్తూండే ప్రతీవారికి, శ్రీరంగ దీవిలో తూర్పు దిక్కున ఉన్న పెద్ద మసీదు కన్పిస్తుంది. అందులోని పరితాప కరమైన టిప్పుసుల్తాన్ కుటుంబ క్షీణ దశను సూచించే ఛాయా చిత్రాలను చూసి కంటతడి పెట్టనివారు ఉండరు.

శిధిలావస్థలో ఉన్న కోట గోడలూ, పాడుపడ్డ అగడ్తలూ పాతాళ సెల నూతులూ జీమూతాలు వంటి వృక్షాల మధ్య మరుగు పడిపోయున్న అంతఃపురాలూ !

అయిదు తలల శేషునిపై శయనించి ఉన్న శ్రీరంగనాథస్వామికి వక్షస్థలంలో లక్ష్మి, పాదాల వద్ద కావేరీమాత, కొంచెం అవతల గౌతమ మహర్షి ఉన్నారు.

ప్రాకారంలో ఆళ్వార్ల విగ్రహాలూ, నాదముని, లోకేశ్వర్ విగ్రహాలు ఉన్నాయి.

ప్రతిష్ఠింపబడ్డ శ్రీరామచంద్రుల విగ్రహం బహు సుందరంగా ఉంది. పాదాల వద్ద నున్న అంజనేయులవారు ఒక చేత్తో రామాయణ గ్రంథాన్ని, మరొక చేత్తో రామపాదాన్నీ ధరించి ఉండటం అర్థభావంతో బాగుంది.

ఆ సమీపంలోనే శ్రీరంగనాయకి దేవాలయం ఉంది. ఆవిడ ముక్కున ఉన్న మంచి ముత్యం అలమేలమ్మ అనే మహారాణీ సమర్పించినదనీ, అది అప్పట్లో చాలా పెద్దదిగా ఉండేదనీ అంటారు.

ఈ ముత్యాన్ని గురించి ఒక గాథ ఉంది. అప్పటి మైసూరు రెండవ రాజైన రంగరాయలు భార్య ఈ అలమేలమ్మ ఆవిడ పరమభక్తురాలు. అమూల్యమైన తన ఆభరణాలన్నింట్లతోనూ శ్రీరంగనాయకిదేవిని అలంకరించమని అది చూసి ఆనందిస్తూ భక్తితో ఆ దేవికి పూజలు చేస్తూండేదట రాణీ అలమేలమ్మ. ఈ దంపతులు తమ పాలనలోనున్న శ్రీరంగపట్నం లోనే తరచూ నివసించేవారట.

తరువాత కొంత కాలానికి రంగరాయలు మరణించారట మైసూరుమహరాజు అలమేలమ్మ ఆభరణాలన్నింటినీ ఆమెను నిర్బంధ పరచి తన వద్దకు రాబట్టుకున్నాడట.

శ్రీరంగ నాయకీ దేవికి మాత్రం అలంక రించబడుతూండె తన ఆభరణాలను బలాత్కా రంగా రాజు అపహరించడం సహించలేని ఆ రాణీ అలమేలమ్మ తన వద్దనున్న అతి విలువగల ఆ ఒక్క మంచి ముత్యాన్ని, రంగనాయకీ దేవికి సమర్పించి ప్రాణత్యాగం చేసుకున్నదట. తను కావేరిలో దుమికే ముందు తనకు ద్రోహం చేసిన ఆ నలకాడు ప్రజలు ఆ ఊర్యూ, రూపు లేకుండాపోవాలనీ, తనను వంచించినందుకు ఫలితంగా మైసూరు రాజు వంశం నశించిపోవాలనీ శపించి కావేరిలో కల్సిపోయిందట. ఆ సాధ్వీమ తల్లి మనసు గాఢంగా నొచ్చుకుంటూ. శపించిన శాపాలు రెండూ వృథాకాలేదు. అదీ ఆ మంచి ముత్యం వెనక దాగిఉన్న గాథ.

ఈ దేవాలయ మండపంలోనే, అయిదు శిరస్సులూ, పది చేతులూ గల గాయత్రీ దేవి హంస వాహనురాలై ఉంది. ఈ గాయత్రీ పీఠానికి ముందు తమ నల్గురు శిష్యులతో కూడి ఉన్న ఆదిశంకరుల విగ్రహాలు అమర్చబడిఉన్నాయి. ప్రత్యేకంగా ఒక బాలసుబ్రహ్మణ్యం విగ్రహం కూడ ఉంది.



శ్రీరంగనాథ దేవాలయం

అక్కడికి కొంచెం దూరంలో శ్రీయోగ నరసింహమూర్తి ఆలయం ఉంది. అది చాలా మహిమగలది. శ్రీరామానుజలవారు తొండ ఖూరులో మహత్తరమైన పుణ్యసేవ చేయగలిగి నది ఈ నరసింహస్వామి ఉపాసన ఫలం వల్లనే. ఈ భక్తుడు ఆదిశేషుని మరో అవతారం అంటారు. శ్రీ శంకరాచార్యుల వారు స్మార్త గురువులయితే శ్రీరామానుజుల వారు వైష్ణవ గురువులు. ఈ మహనీయులు దేశ క్షేమం, ప్రజాక్షేమం కోరి అనేక శ్రమలకు ఓర్చి వృద్ధాప్యం వరకు నడిపించిన మహత్తర సంఘట నలు అనేకం ఉన్నాయి.

— గుళ్ళపల్లి సుందరమ్మ ★

సీరియల్

## వక్కలంక పద్మావతి

(గత సంచిక తరువాయి)

అందరూ తిరిగివచ్చేసరికి తెలతెలవారుతోంది.

గాయత్రిని ఇంటిదగ్గర డ్రాప్ చేసి మంజుల, సురేంద్రలను ఇంటిదాకా పంపి... వినోద్ వెళ్ళిపోయాడు.

మంజుల, సురేంద్ర లోపలికి అడుగు పెట్టగానే విశ్వనాథంగారు ఎదురై... రఘుపతి గారు వచ్చినట్టు చెప్పారు.

తండ్రిని చూడాలనే ఆరాటంతో సురేంద్ర "అంకుల్ ! నాన్నగారు ఎప్పుడొచ్చారు అంకుల్, ఎక్కడున్నారు ?" అన్నాడు.

"రాత్రి వచ్చాడయ్యా! పైన గదిలో పడుకున్నాడు" అన్నారాయన. మంజుల వచ్చి తండ్రి పక్కన సోఫాలో కూలబడింది నీరసంగా.

"అయితే నేను పైకి వెళ్తాను అంకుల్" అంటూ మెట్లెక్కబోతున్న సురేంద్ర ఆయన పిలుపుకు ఆగి... "ఏమిటి అంకుల్" అన్నాడు. ఆయన మొహంలో ఎందుకో సంతోషం తాండవిస్తోంది. ఏదో చెప్పాలని ఉబలాట పడుతున్నారాయన. సురేంద్ర కేమీ అర్థంకాలేదు.

"నీకూ, మంజూకి ఒక గుడ్ న్యూస్ చెప్పనా" —

"వాట్ డాడీ !" అంటూ ఉత్సాహంగా ఆయన దగ్గరగా జరిగింది మంజుల. కాస్త సంశయంతో... "మీ నాన్నగారే చెప్తార్లే — నువ్వెళ్ళు సురేంద్ర" అన్నారాయన నవ్వుతూ.

వేగంగా మెట్లెక్కాడు సురేంద్ర. తండ్రిని చూడాలనే ఆతృత తప్ప మరే శుభవార్త మీదా ఆసక్తి లేదతనికి.

మంజుల కూడా అతని వెనుకే పైకి వచ్చింది.

అప్పటికే నిద్రలేచి కూర్చునివున్న రఘుపతి రావుగారు వాళ్ళిద్దర్నీ ఆప్యాయంగా పలుకరించారు.

"వాట్ మామయ్యా! లెటర్ కూడా రాయకుండా వచ్చేశారు. మీరొస్తారని తెలిస్తే పిక్నిక్ కాన్సిల్ చేసుకునేవాళ్ళం కదా" అంది మంజుల.

"ఫరవాలేదులేమ్మా ! ఇప్పుడేమయింది విశ్వనాథం వున్నాడుగా. వాడితో ఎన్ని గంటలైనా నిముషాల్లా కాలక్షేపం అయిపోతుంది."

మంజుల ఓ ఐదు నిమిషాలు కూర్చుని వెళ్ళిపోయింది. సురేంద్ర తండ్రి యోగక్షేమాలు విచారించాడు దగ్గరగా కూర్చుని. తర్వాత బిజినెస్ విషయాలమీదికి మళ్ళింది సంభాషణ.

"ఈ సంవత్సరంతో నీ ఉద్యోగం మానేసి బెజవాడ వచ్చేసి ఆ బిజినెస్ వ్యవహారాలన్నీ నువ్వే చూసుకో సురేంద్రా. నా ఆరోగ్యం కూడా అంత బావుండటం లేదు. మంజుల మంచిపిల్ల. మీ ఇద్దరి జంటా అందంగా, చూడముచ్చటగా... విశ్వనాథం యీ విషయం చెప్పినదగ్గర్నుంచి నా మనసు మనసులో లేదు. నా కోరిక ఇంత త్వరగా తీరుతున్నందుకు; సంతోషంగా వుంది. ముహూర్తాలు ఎప్పుడు పెట్టించమంటావో చెప్పు."

ఆయన ధోరణిలో ఆయన ఉత్సాహంగా చెప్పుకుపోతున్నారు. సురేంద్రకు ఏమీ అర్థం కావటం లేదు. మంజులకీ తనకీ పెళ్ళా ! అలా అని అంకుల్ చెప్పారా ! అయితే ఆయన అన్న 'గుడ్ న్యూస్' ఇదేనన్నమాట. ఆ రోజు మంజుల చెప్పిన విషయం నిజమే అయింది. ఇప్పుడీ సమస్యను ఎదుర్కోవటం ఎలా ? తన పెళ్ళి గురించి నాన్న ఎంత సంతోషంగా ఫీలవుతున్నారో! తన విషయంచెపితే ఆయన చాలా బాధపడతారు.

తను పెళ్ళి చేసుకుంటానని, అందాల బొమ్మ, సుగుణాల రాశి గాయత్రిని చూపించి యీమే మీ కోడలని, ఆయన అంగీకరించేలా చేయాలి. మంజులకి, వినోద్‌కి పెళ్ళి జరిగేలా చూడాలి. ఎప్పుడు ? ఇవన్నీ పరిష్కారం ఎలా అవుతాయి ?

"ఏమిటి బాబూ ఆలోచిస్తున్నావు ? మేం అన్ని విషయాలు సంప్రదించుకున్నాం. మాకున్న ఆస్తి చాలూ, కట్నాలు కానుకలు ఏమీవద్దు, వీళ్ళిద్దరికి మూడు ముళ్ళూ పడితే చాలు, నాకదే మనశ్శాంతి — అని చెప్పానుకూడా !"

అంటూ బ్రీఫ్‌లోంచి పేస్ట్ బ్రెష్ తీసుకుని బాత్‌రూమ్‌కి వెళ్ళిపోయారాయన.

సురేంద్ర ఆలోచనలో పడ్డాడు. ముందు అంకుల్‌తో చెప్పి యీ సమస్యను పరిష్కరించి తర్వాత తండ్రితో తన విషయం చెప్పొచ్చని తేలికపడ్డాడు.

ఇంతలో మంజుల హడావిడిగా గదిలోకి వచ్చింది. ఆమె మొహం చూడగానే సురేంద్రకు విషయం అర్థమయిపోయింది.

"సురేన్ ! డాడి చెప్పిన గుడ్ న్యూస్ విన్నావా ! ఇంత త్వరగా వీళ్ళిలా డిసైడ్ చేస్తారనుకోలేదు. యీ పెళ్ళి మనిద్దరికి ఇష్టమేననే దృష్టితో మన అభిప్రాయం ఏమిటని కూడా అడగటంలేదు. సురేన్... నాకు భయం వేస్తోంది ?!!"—

ఆమె బేలతనం చూసి సురేంద్ర నవ్వాడు.

"అంత పిరికిదానివి ఎందుకు ప్రేమలో పడాలట ? పిచ్చి మంజూ ! నువ్వు ధైర్యంగా వుండు. యీరోజే నేను అంకుల్‌తో మాట్లాడుతాను. నువ్వు వెళ్ళు" ఆమెకు ధైర్యం చెప్పి పంపేశాడు.

**జరిగిన కథ — 4 :** సురేంద్ర ఉద్యోగ నిమిత్తమై తన తండ్రికి మిత్రుడైన విశ్వనాథంగారింటికి వస్తాడు. మంజుల విశ్వనాథంగారి కుమార్తె. విశ్వనాథంగారి కుటుంబంతో కచేరికి వెళ్ళగా అక్కడ గాయత్రి పరిచయం అవుతుంది. మంజులతో గాయత్రి ఇంటికి బయల్దేరుతాడు సురేంద్ర. అతనికి గాయత్రి గురించి చెపుతుంది మంజుల. గాయత్రి అందం చూసి ముగ్ధుడవుతాడు సురేంద్ర. ఆమెను ప్రేమిస్తాడు. మంజుల వినోద్‌ను తను ప్రేమిస్తున్నట్టు, పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నట్లు సురేంద్రతో చెపుతుంది. వినోద్‌ను సురేంద్రకు పరిచయం చేస్తుంది. సురేంద్ర తను గాయత్రిని ప్రేమిస్తున్నట్లు మంజులతో చెపుతాడు. గాయత్రి మాటలకు సురేంద్ర మనసు దెబ్బతింటుంది. తను గాయత్రిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నట్లు ఆమెకు చెపుతాడు. గాయత్రి కూడ సురేంద్రను ప్రేమిస్తుంది కాని తండ్రికి భయపడి తన ప్రేమను బయటకు వ్యక్తం చేయలేకపోతుంది. గాయత్రి మనస్సు విప్పి తన ప్రేమను సురేంద్రతో చెపుతుంది. మంజుల, వినోద్, సురేంద్ర, గాయత్రీలు మహాబలిపురం పిక్నిక్ వెళ్ళి అక్కడ సరదాగా కాలక్షేపం చేస్తారు.

''అంకుల్ ఏం చేస్తున్నారు'' లోపలికి తొంగిచూస్తూ అన్నాడు సురేంద్ర.

''నీ కోసమే ఎదురు చూస్తున్నాను. రా సురేంద్రా !'' అన్నారాయన సురేంద్ర. చనువుగా వచ్చి ఆయన ఇజీఛైర్ ఎదురుగా మరో కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

''ఊఁ! ఏమిటి ! మీ నాన్న నే చెప్పిన గుడ్‌న్యూస్ చెప్పే వుంటాడు.''

''విన్నాను. కానీ అంకుల్ ... అది మాకు గుడ్‌న్యూస్ అని మీరెలా అనుకున్నారో నాకు అర్థం కాలేదు.''

ఆయన విస్తుపోయి చూశారు. ''ఏమిటి నువ్వనేది ! ఇా పెళ్లి మీకు ఇష్టంలేదూ !''

''అంకుల్ ! నేనంటే మీకెందుకింత అభిమానం.''

''సురేంద్రా ! నాకు మగపిల్లలంటే ఎంతో ఇష్టం. మంజుల తర్వాత పిల్లలు కలగలేదు. మగపిల్లాడికోసం ఆరాటపడ్డ మాకు ఆ ఆశ తీరలేదు. నిన్నూ ... నీ అణకువతనాన్ని చూసిన తర్వాత, నిన్ను నా అల్లుడిగా చేసుకుని నీలో ఆ కొడుకుని, అల్లుడిని కూడా చూసుకోవాలని ఆశపడ్డాను ... నీకీ పెళ్లంటే ఎందుకు ఇష్టంలేదు.''

ఆయన ఆప్యాయతకు ఆతని కళ్లల్లో నీళ్ల తిరిగాయి.

''అంకుల్ ! మీకు కృతజ్ఞత ఎలా చెప్పుకోవాలో తెలీటంలేదు. నన్నెంతగానో అభిమానిస్తున్నారు. నేను చెప్పేది విన్న తర్వాత అభిమానిస్తారో ... అయిష్టపడతారో ... మీ ఇష్టం'' అంటూ ఒక నిముషం ఆగి మళ్లీ అన్నాడు.

''అంకుల్ ! మీరనుకుంటున్న విధంగా కాక మా ఇద్దరి మనసులు వేరే వ్యక్తుల్ని కోరుకుంటున్నాయి. మంజుల, వినోద్‌లు మీ అంగీకారం కోసం ఎదుర్చూస్తున్నారు.''

తెల్లబోయి చూశారాయన. ''ఇతనికి మతిగానీ పోలేదుకదా ...'' అనుకుంటూ ''ఏమిటి వాళ్లిద్దరికీ పెళ్లా ! వినోద్ త్వరలో మలేషియా వెళ్లిపోతున్నాడు కదా''

''అవును. వినోద్ మంజుల్ని మారేజ్ చేసుకుని తన వెంట తీసుకువెళ్ళాలని ఆరాటపడుతున్నాడు. అప్పుడే అతను ఇద్దరికీ పాస్‌పోర్టు, వీసాలక్కూడా ట్రై చేస్తున్నాడు. అంకుల్ ! వినోద్ కుటుంబాన్నిగురించి, నాకంటే మీకే ఎక్కువ తెలుసు. అతనికి అందం, తెలివి, హోదా అన్నీ వున్నాయి. వారిద్దరి ఇష్టాన్ని మీరు కాదనకండి !

పెద్దవాళ్ళ ప్రయత్నాల్ని, పిల్లలం భగ్నం చేస్తున్నామని భావించి మమ్మల్ని నిందించకండి. మాకు చదువుతోపాటు వివేకంకూడా వుందనే విశ్వాసం మాకుంది. మీకు తలవంపులు తెచ్చే వాళ్ళని మా జీవిత భాగస్వాములుగా ఎన్నిక చేసుకోలేదని గుర్తించి మీ పెద్దరికాన్ని నిలుపుకుని మంజులకి,వినోద్‌కి పెళ్ళి జరిపించండి అంకుల్.''

విశ్వనాథంగారు ఆలోచనలో పడిపోయారు. మంజులను సురేంద్రకిచ్చి చేయాలని మనసులో చాలా ఆశపడ్డారాయన. ఇంతకాలం మంజుల, వినోద్‌లు కేవలం స్నేహితులుగా అనుకుంటున్నారుగానీ వాళ్ళ మనసుల్ని గ్రహించలేకపోయారు. ఇప్పుడా విషయం తెలిసి ఆయనకు చాలా నిరుత్సాహం కలిగింది.

''అంకుల్ ! నన్ను క్షమించండి మీ మనసు నొప్పించాను. నా మాట కాదనకండి !'' ప్రాధేయపడుతూ అన్నాడు సురేంద్ర.

అతని చేతిని ఆప్యాయంగా నొక్కారు.

''వినోద్ అంటే నా కెలాంటి అయిష్టమూ లేదు. నేనెప్పుడూ అతన్ని అల్లుడి దృష్టిలో చూడలేదు. ఆ ఆలోచనే నాకు రాలేదసలు.



మంజుల మాకు ఒక్కగానొక్క కూతురు. ఆమె ఇష్టాన్నికాదని ఎలా అనగలం. కానీ... మంజూ వినోద్‌ని చేసుకుని అంతదూరం వెళ్ళిపోతే... మేం ఉండలేం సురేన్. అదే నాకు బాధగా వుంది'' దిగులుగా అన్నారాయన.

''బాధపడకండి అంకుల్. మంజులా వాళ్ళు రెండేళ్ళు మాత్రమే అక్కడుండేది. ఆ తర్వాత తిరిగి వచ్చేసి ఇక్కడే ప్రాక్టీసు పెడతాడట వినోద్. యీ మధ్యలో మంజుల ఎప్పుడు కావాలంటే అప్పుడు వచ్చి మిమ్మల్ని చూసి వెళ్ళొచ్చు. మీరు మరేం ఆలోచించకూడా ముహూర్తం పెట్టి వాళ్ళని విమానం ఎక్కించండి'' నవ్వుతూ సర్దిచెప్పాడు.

''అలాగేలే ! మంజుల సంతోషంకన్నా నాకు కావల్సింది లేదు. ఇవాళే ప్రభాకరరావు గారింటికి వెళ్తాను... అవునూ ... మరి నీ పెళ్ళెప్పుడు... ఎవరా అమ్మాయి...'' కుతూహలంగా అడిగారాయన.

''ముందు మంజుల పెళ్ళి కానీయండి. నా విషయం తర్వాత చెప్తాను. మా నాన్నగార్కి కూడా యీ సంగతి చెప్పనేలేదు.''

అంటూ సురేంద్ర లేవబోతుండగా రఘుపతి రావుగారే లోపలికి వస్తూ అన్నారు,

''అంత శ్రమపడవలసిన అవసరం లేదు సురేంద్రా ! నేనంతా విన్నాను గానీ... ఏది మా మంజుల తల్లి'' అంటూ చుట్టూ చూశారాయన.

సురేంద్ర గతుక్కుమన్నాడు. ఆయన పక్క కుర్చీలో కూర్చుంటూ

''అదేవిట్రా విశ్వం ! మన పిల్లలకి మంచి సంబంధాలు చూసి పెళ్ళిళ్ళు చేయాలని ఉబలాటపడుతుంటే... మన ఆశలు తీర్చాలనే ఆలోచన వాళ్ళకు లేదు. మరి అదెలా తీరుతుందంటావు. లోక కళ్యాణానికి పూనుకుందామంటావా !'' — హాస్యంగా అన్నారాయన.

విశ్వనాథంగారు గట్టిగా నవ్వేశారు. సురేంద్ర తలొంచుకుని మౌనంగా కూర్చున్నాడు.

''ఏమిటండోయ్ ! అంత పెద్దగా నవ్వుతున్నారు. విషయం ఏమిటో మాకూ కాస్త చెబుదురూ !'' అప్పుడే షాపింగ్ నుంచి తిరిగొచ్చిన పార్వతిగారూ, మంజులకి ఆ నవ్వు వినిపించి అడిగారు.

''నీ ముద్దుల కూతురి పెళ్ళి ఇంకా ... పదిరోజుల్లో చేసేయాలని... లేకపోతే వూరుకోనంటున్నాడు మీ అన్నగారు.''

మంజుల గాభరాగా సురేంద్రకేసి చూసింది. అతను తలొంచుక్కూర్చోవటం చూసి మంజుల ఒళ్ళు మండిపోయింది. అతనెందుకలా వున్నాడో అర్థం కావటం లేదు ! డాడీ అతని మాటని కాదని అవమానించారేమో !

''ఉహు! అలాజరిగివుండదు. డాడీసురేంద్ర మాటను కాదనరు. మరెందుకలా కూర్చున్నాడు.'' కోపంతో పెదవి కొరుక్కుంటూ అతన్ని చూస్తూ నిలబడింది మంజుల.

## ఇది మేఘ సందేశమూ...

ఆమె ముఖ కవళికలు గమనిస్తున్న రఘుపతి, విశ్వనాథంగార్లు ఒక్కసారిగా గట్టిగా నవ్వేశారు. సురేంద్ర కూడా వాళ్ళ నవ్వులో శ్రుతి కలిపాడు. మంజులకి వాళ్ళెందుకు నవ్వుతున్నారో అర్థం కాలేదు.

సురేంద్ర లేచి మంజుల చేయి పుచ్చుకుని బయటకు తీసుకెళ్ళాడు వేగంగా.

పార్వతిగారు అసహనంగా అడిగింది సోఫాలో కూర్చుంటూ —

''ఏమిటండి ! అసలు విషయమేమిటో చెప్పకుండా అలా నవ్వుతున్నారేం ?''

విశ్వనాథంగారు — మంజుల గురించిన విషయమంతా నెమ్మదిగా చెపుతూంటే ఆశ్చర్యంగా వింటూండిపోయిందావిడ.

* * *

మంజుల వివాహం వినోద్‌తో వైభవంగా జరిగిపోయింది. పెళ్ళి బాధ్యత అంతా సురేంద్ర తనమీదే వేసుకున్నాడు.

### చిరునవ్వు చాలు !

**గుం**డె దోసిట ప్రణయ పుష్పాలు నింపి
నీ పాదాల మ్రోల నిలిచినాను;
కనుల దోనెల మరులు మధువు నింపి
నీ అధరాల ముందుంచినాను;
నవ్వుల నవ మౌక్తికాలు
నీ ముంగిట రాసి పోసినాను;
అన్నుల మిన్నా,
అన్నిటికన్న మిన్న
నా కన్నీట నీ పాదాల కడిగినాను;
బదులుగా సఖీ, చిటికెడు చిరునవ్వు చాలు.

— చక్కిలం విజయలక్ష్మి

మంజుల, వినోద్ వెళ్ళిపోయేరోజు దగ్గరవుతున్నకొద్దీ అందరి మనసుల్లోనూ దిగులు అధికమైంది. మంజులకి తల్లిదండ్రులను వదిలి వెళ్ళటానికి ఎంతో బాధగా వుంది.

సురేంద్ర ఆమెను అనునయించాడు వున్న నాలుగురోజులూ ఆమె నవ్వుతూ తిరగాలని అతని కోరిక. అందుకే తిరుమల హిల్స్‌కి ప్రోగ్రాం ఏర్పాటు చేశాడు. మంజుల బలవంతం మీద గాయత్రికి వాళ్ళతో వెళ్ళటం తప్పలేదు.

తిరుపతి కొండలు చూడటంతోనే గాయత్రిలో ఆనందం పొంగుకొచ్చింది. కారులో వెళ్తూ చుట్టూ చూస్తుంటే ... కొండలు, కొండలమీద గుబురుగా పెరిగిన చెట్లు, పాదులు పచ్చగా మెరిసిపోతున్నాయి. ఎన్నోసార్లు చూసినవే అయినా ... ఎప్పుడూ కొత్తగానే కనిపిస్తుంది అక్కడ ప్రకృతి. ఆ కొండల్లో ఎన్ని ఒంపులో. ఒక్కో ఒంపులో ఒక్కో అందం కనిపిస్తుంది. పాప పంకిలమైన యీ మానవ జగత్తుకు అందనంత ఎత్తులో వుండాలనో ఏమో ... స్వామి ఆ కొండమీద కొలువైవున్నాడు. కానీ పిచ్చిదేవుడు. యీ మానవులు తనను అందుకోవటానికి చేస్తున్న ప్రయత్నాలను భగ్నం చేయలేక పోయాడు. అందుకే తనూ యీ రోజు ఇలా వెళ్ళగలుగుతుంది.

''భగవాన్ ! నువ్వు వున్నావో లేదో నాకు తెలీదు. ఎప్పుడో ... ఏ నిశీథిలోనో...ఒక్కక్షణం నా కళ్ళను మిరుమిట్లు గొలిపే వెలుగు కనిపిస్తుంది. ఆ వెలుగురేఖ నీవేనని నమ్ముతున్నాను. ఆ వెలుగు ఆధారంగా నేను జీవితాన్ని గడుపుతాను. నా జీవితం చిక్కుల్లో పడి కొట్టుకోకుండా రక్షించు స్వామీ !''

గాయత్రి భక్తితో మనసులోనే ప్రార్థించింది ఆ భగవంతుణ్ణి.

టి. బి. లో కాటేజ్ తీసుకుని బ్రీఫ్‌కేసులు, బాస్కెట్‌లు అందులో పడేసి స్నానాలు పూర్తిచేసి ఫ్రెష్‌గా బయల్దేరారు అందరూ స్వామి దర్శనానికి.

సురేంద్ర మాత్రం వాళ్ళని వెళ్ళిరమ్మని, వాళ్ళు వచ్చేవరకూ తను రూంలో కూర్చుని వుంటానన్నాడు.

గాయత్రి ఆశ్చర్యపోయి చూసిందతన్ని. సృష్టిపట్ల అతనికున్న భావుకత్వం, ఆనందం, వాటిని సృష్టించిన భగవంతుడిమీద భక్తి ఎందుకు కలిగించటంలేదో అర్థం కావటంలేదు. బలవంతాన అతని దృష్టి దేనిమీదికి మరల్చలేమని తెలిసి మౌనంగా వినోద్ వాళ్ళతో నడిచింది ఆలయానికి.

దర్శనం అయింతర్వాత సురేంద్రతోపాటు అందరూ భోజనాలు చేసి కాసేపు రెస్టు తీసుకున్నారు.

మధ్యాహ్నం మూడు గంటలైంది. గార్డెన్‌లో తిరిగొద్దామని నలుగురూ బయల్దేరారు. మంజులకి పువ్వులంటే మహా ఇష్టం. పెద్ద పెద్ద గులాబీలు, సంపెంగలు, మందారాలు, రకరకాల పూలమొక్కలు చూస్తూ వాటి విరబూసిన పువ్వులు చూసి ముగ్ధురాలవుతూ... ఎలా అయినా ఒక్క పువ్వు కోయాలని విశ్వప్రయత్నం చేస్తోంది. గాయత్రి మందలిస్తుంటే... తోటమాలి కోసం దొంగ చూపులు మానేసి బుద్ధిమంతురాలిలా నడక సాగించింది.

రెండు గంటలసేపు అలా తిరిగి విశాలంగా; జనం అంతగా లేనిచోటు చూసి పచ్చటి గడ్డిలో చతికిలపడ్డారు. వాతావరణం ఆహ్లాదంగా వుంది.

ఇంతలో కాస్త దూరంలోకి ఎవరెవరో రావటంతో కాస్త అలజడి ప్రారంభమయింది.

''చూడండి డైరక్టరుగారూ ! హీరో, హీరోయిన్ను ఇక్కడ లాన్‌లో కూర్చుని మాట్లాడుకోవటం, ఆ తర్వాత గార్డెన్‌లో ఒక







డ్యూయెట్ పిక్చరైజేషన్... ఇక్కడే చేద్దాం. ఎలా వుంటుందో, కెమెరామన్‌గారితో కూడా డిస్కస్ చేసి చెప్పండి.'' చుట్టూ కలయజూస్తూ అంటున్నాడొక ముప్ఫయ్యేళ్ళ యువకుడు అందంగా హుందాగా, దర్పంగా కనిపిస్తున్న అతను వాళ్ళిద్దరిలోనూ ఏవో మాట్లాడుతూ... దూరంగా చూస్తూ, చేతులు వూపుతూ ఏదో చెప్పతూంటే... వాళ్ళు నమ్రతగా వింటున్నారు.

ఆ యువకుడు బైనాక్యులర్స్ తీసుకుని చుట్టూ పరిసరాలు పరికించసాగాడు.

అలా చూస్తున్న అతనికి కాస్త దూరంలో పచ్చగడ్డిలో కూర్చుని ఏదో మాట్లాడకుంటూ నవ్వుకుంటున్న మంజుల, గాయత్రి వాళ్ళు కనిపించారు.

అంతే! అతని చూపు మరోవైపు ప్రసరించ లేదు!

అతని దృష్టి గాయత్రి మీద పడింది. గాయత్రి సౌందర్యం మీద విశ్రలమయింది. ఆమె సుకుమార శరీరం మీద ఆగిపోయింది. అప్పటి వరకూ సినిమా ఫీల్డులో ఎన్నెన్నో అందాలను చూడగలిగాడు గానీ వాళ్ళెవరిలోనూ లేని అద్భుత సౌందర్యం, గ్లామరు ఆమెలో కనిపించింది అతనికి.

అతని మనసు సంతోషంతో ఉరకలువేసింది. ఏదో ఆలోచన అతని అంతరంగంలో తళుక్కున మెరిసింది. అలా బైనాక్యులర్స్‌లో చూస్తూనే మెల్లగా ముందుకి అడుగులు వేయసాగాడు. అతని అనుచరులు వెనగ్గా నడుస్తున్నారు.

గాయత్రీ వాళ్ళున్న చోటికి కాస్త దూరంగా నిలబడిపోయి డైరెక్టరుకి... కెమెరా మన్‌కి ఏవేవో సూచనలివ్వసాగాడు.

వాళ్ళను... కాస్త కాస్త వినిపిస్తున్న సంభాషణను బట్టి "ఏళ్ళెవరో సినిమా వాళ్ళలాగున్నారు. ఏ పిక్చరు షూటింగో ... ఏక్టర్సు ఎవరెవరో—అడుగుదామా గాయత్రి'' ఉత్సాహంగా అడిగింది మంజుల.

"ఛ! ఊర్కోవే! ఏదయితే మనకెందుకు. వాళ్ళని అడిగేదేమిటి అసహ్యంగా!'' అని విసుక్కుంది గాయత్రి.

మంజుల మాట్లాడకుండా వూరుకుండిపోయింది. వాళ్ళకేసి చూస్తూ.

ఆ యువకుడు మిగతా వాళ్ళకిస్తున్న సూచనలను వింటూ వాళ్ళు అటూ ఇటూ తిరుగుతూ ... పరిశీలిస్తూ చూసిన చోటే చూస్తూ కాస్త దూరం వెళ్ళారు.

అతను తన సెక్రటరీని దగ్గరికి పిల్చాడు.

''వాట్ సర్!'' నవ్వుతూ అడిగాడతను.

''అదిగో అటు చూడు! అక్కడ కూర్చున ఆ ఇద్దరి అమ్మాయిల్లో ఎడంపక్క నామెకి కొత్తగా పెళ్ళయి నట్టుంది. మెళ్ళో పసుపు తాడు, నల్లపూసలు కనిపిస్తూనే వున్నాయి ... ఆమె పక్కన కూర్చుమంది చూడు ... ఆ అమ్మాయి ఎలా వుంది?''—

కళ్ళు పెద్దవి చేసి చూశాడు అతను.

''అద్భుతం సార్! పెళ్ళయినట్టు లేదు. చాలా అణకువగా, అందంగా కూడా వున్నారు సార్ ఆ మ్మా యి గా రు. మీకు యీడూ జోడూ వండర్‌ఫుల్ గా వుంటుందిసార్!'' అన్నాడతను మరికాస్త ఉత్సాహంతో!

వాళ్ళిద్దరూ మెల్లగా మాట్లాడుకుంటూ వెళ్ళిపోయారు.

వాళ్ళిలా చూడటం, మాట్లాడుకోవటం చూసి గాయత్రికి చిరాకేసింది.

"మంజూ! వాళ్ళేమిటి మనవైపే చూస్తూ గొణుక్కుంటున్నారురా! మనం అవతలికి పోదాం — వెధవలు!'' అంటూ మంజుల చెయ్యి పుచ్చుకుని కాస్త గుబురుగావున్న చెట్లచాటుకి తీసికెళ్ళి కూర్చోబెట్టింది.

సురేంద్ర, వినోద్‌లు మాటల్లోపడి వీళ్ళని పట్టించుకోనేలేదు. వాళ్ళని వెతుక్కుంటూ వెళ్ళారు. గుబుర్ల చాటున మాటలు చెప్పుకుంటున్న ఇద్దర్ని చూసి ''ఇదేమిటి! ఇక్కడ దాక్కున్నారు. ఇలా వెళ్ళిరండి'' అన్నాడు వినోద్.

''యీ పొదలే యీ గాయత్రికి బురఖాలు. వాళ్ళు చూస్తున్నారూ, వీళ్ళు చూస్తున్నారూ అంటూ నన్నిక్కడికి లాక్కొచ్చి పడేసింది. కళ్ళున్న తర్వాత చూడరా ఏమిటి వినోద్'' అంటూ గాయత్రిని వెక్కిరించింది మంజుల.

''వాళ్ళిద్దరూ ఇక్కడే కూర్చుని కబుర్లాడు కుంటారుగానీ, మనం అలా వెళ్దాంరా మంజూ'' అంటూ మంజుల చేయందుకుని కొండ అంచుల్లోని ఫెన్సింగ్ వైపు తీసుకెళ్ళాడు వినోద్.

సురేంద్ర గాయత్రి పక్కన కూర్చున్నాడు నవ్వుతూ!

చుట్టూ రకరకాల పూల మొక్కలు... వింత సౌరభాన్ని వెదజల్లుతున్నాయి. సాయం సంధ్య; తరంగాల్లా సాగుతున్న పిల్లతెమ్మెర; గాయత్రికేసి కళార్పకుండా చూస్తున్న సురేంద్రలో ఏదో కొత్త కోర్కెను రగిలించింది. ఆ కోర్కెల అలజడికి తట్టుకోలేక కళ్ళు మూసుకున్న అతనికి సృష్టి సౌందర్యానికే ప్రతిబింబంగా నిలిచిన గాయత్రి అందమే మెదులుతోంది కళ్ళల్లో.

అతని మనసంతా మత్తుగా తూలుతోంది. చుట్టూ వాతావరణం... గుండెల్లో గూడు కట్టుకున్న కోరికల గుసగుసలు, అతనినిమరిపించే ఉద్రిక్తత. కృష్ణునికోసం వేచివున్న రాధికలా కనిపించింది గాయత్రి అతని కళ్ళకు. చేతులుసాచి ఆమెను తన హృదయానికి హత్తుకోవాలనే ఆరాటం కలిగింది.

ఆలోచనల్లోంచి తేరుకుని అతన్ని చూసింది గాయత్రి.

అతని చూపులు ఆమెకు వింతగా హాయిగా అనిపించాయి. అతను అప్రయత్నంగా ఆమె భుజంచుట్టూ చేయివేసి తనవైపుకు తీసుకున్నాడు. ఆ స్పర్శ ఆమెలో స్త్రీత్వాన్ని మేలుకొలిపింది. ఆమె పెదవులపై మెల్లగా ముద్దు పెట్టుకున్నాడు. రివ్వున వీస్తున్న గాలికి ఆమె పైట జారింది. ఆమె తనువు ఏదో కోరికతో తపిస్తోంది. తనకు తెలీకుండానే అతని మెడ చుట్టూ చేతులువేసి అతని గుండెల్లో తలదాచుకుంది.

# ఇంట్లో అమ్మ చేసిన కాఫీకి యోగ్యమైన బిరుదు.



ఇంట్లో వాళ్ళందరికీ ఏది మంచిది అన్నది అమ్మ కన్న మించి ఇంకెవరికి తెలుస్తుంది!

ఇక కాఫీ రుచి విషయం ఎత్తామంటే అమ్మదే తుది నిర్ణయం. ఆ నిర్ణయం పైనే అందరికీ గౌరవం.

అందుకు కారణం కాఫీ చేయడంలో అమ్మ అనుభవసారమే. అనుదినం అమ్మ చేతి కాఫీ తెచ్చే ఆ తొలి వెలుగుల తాజాదనం తిరుగులేనిది. దాన్ని తయారుచేసి అందించే అమ్మ చేయి అంతకన్న తిరుగులేనిది.

అది అమ్మ హస్తవాసి అందమా, లేక ఆమె రహస్యమందమా! చక్కని రుచీ,సువాసనా ఇచ్చే ఆ ఖచ్చితమైన రంగుకు కాఫీ విత్తుల్ని వేయించడం, ఆ పొడి కొట్టడం, వడకట్టడం...



ఇక చుక్క చుక్కగా కిందికిదిగే ఆ డికాక్షన్ చిక్కగా ముదురు రంగుతో నోరూరించే దాని సువాసన, నురుగు తేలుతూ, పొగలు కక్కుతూ అది అందించే ఆహ్వానం. అబ్బ! ఆ తాజాదనపు సువాసనకు జోహార్లు చెప్పాలి. నురగల బుడగలలో దోబూచులాడుతూ వచ్చే ఆ రుచికి జేజేలు పలకాలి.

ఆ మేళవింపులో పరిపూర్ణత సాధించడానికి ఎన్నేళ్ళ తపస్సు అవసరమైందో!

## సన్‌రైజ్. శ్రేష్ఠతకొక బిరుదు.

ఇంట్లో అమ్మ చేసే కాఫీ గురించి మాకు అన్నిటికన్న ఎక్కువగా నచ్చిన విషయం అదిచ్చే ఆ "తొలి వెలుగుల తాజాదనపు" అనుభూతి.

అందుకే మా మిశ్రమానికి "సన్ రైజ్" అన్న పేరు పెట్టాం. అదెంత మంచిదంటే, అత్యుత్తమమైన కాఫీకి అదొక యోగ్యమైన బిరుదు అని మా విశ్వాసం.

## అమ్మ పద్ధతే అచ్చంగా మా పద్ధతీనూ

అమ్మలాగే, కాఫీ గొప్ప అంతా 'సరైన' కాఫీ



విత్తుల ఎంపికలోనే ఉందన్న సంగతి మేమూ గుర్తించాం, అందుకే, చిక్కదనం, సువాసనా సరైన పాళ్లలో ఇచ్చే కాఫీ విత్తుల ఎంపికలో మా నిపుణులు శిక్షణ పొందారు.

అమ్మ చేసినట్టుగానే మేమూ కాఫీ విత్తుల్ని సరిగ్గా తగినంత మేరకు వేయిస్తాం. అలా ఆ చిక్కదనం, సువాసన, రంగు పరిపూర్ణ స్థాయిలో వచ్చేలా చేస్తాం.

సరిగ్గా అలాటి సమయంలో ఆ విత్తుల్ని అతి వేగంగా చల్లారుస్తాం. దానితో వాటి మంచితనం. సువాసన, రుచి, చిక్కదనం, రంగు అన్నీ అలా అందులో నిలిచిపోతాయి.

ఆ విత్తుల్ని నాజూగ్గా పొడికొట్టి, బ్రహ్మాండమైన పర్కొలేటర్లలో పడపోస్తాం. దీనితో ముదురు రంగుతోటి, ముగ్ధుల్ని చేసే సువాసన తోటి అతి చిక్కని డికాక్షన్ తయారవుతుంది.

అనుదినం ఉదయం పూట అమ్మ కాఫీ రుచికి నోచుకున్న వారందరికీ ఇది సుపరిచితమైందే.

## చిక్కని డికాక్షన్ నుంచి మళ్ళీ పొడి.

ఈ దశలో డికాక్షన్‌ను సుతారంగా ఆరబెట్టడం ద్వారా దాన్ని పొడి రూపంలోకి మార్చడం జరుగుతుంది. ఈ పద్ధతి వెనక 40 ఏళ్ళ పరిశోధన, అనుభవాల పరిపూర్ణత ఉంది.

ఇక బంగారు గోధుమ రంగులో ఉన్న ఆ పొడిలో తాజాదనం, సువాసన సమృద్ధిగా ఉంటాయి.

## ఆ తాజాదనాన్ని అలా నిలిపి ఉంచడం కోసం

ఆ పొడిని జాడీలలోకి, సంచీలలోకి నింపి, దాని సువాసన, రుచి, చిక్కదనం అన్నీ అందులోనే దాగి ఉండేలా సీలుచేయడం జరుగుతుంది. ఆ గుణాలన్నీ కలసి ఏ వేళలోనైనా, ఏ జాములోనైనా

## ఆ సన్‌రైజ్ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి మీకు నిస్సందేహంగా అందుతుంది.



ఇక సన్‌రైజ్ అచ్చంగా ఇంట్లో అమ్మ పద్ధతి లోనే తయారవడం వల్ల, ఆ శ్రేష్ఠతకు ఇదొక యోగ్యమైన బిరుదే అనవచ్చు కదా మరి!




## ఇంట్లో అమ్మ చేసిన కాఫీ అందించే ఆ తొలివెలుగుల తాజాదనపు అనుభూతి కోసం.

ఎంపిక చేసిన పట్టణాలలో మాత్రమే లభించును.




### ఆర్. – బెంగుళూరు

మాకు వరుసగా ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. మేము బాబు కోసం వెయిట్ చెయ్యాలనుకొంటున్నాము. 5 సం॥ల కాలం పిల్లలు పుట్టకుండా కంట్రోల్ చేస్తే వీర్యకణాలలో మార్పు వచ్చి మగపిల్లలు కలిగే అవకాశం ఉందని విన్నాను. ఇప్పుడు క్రొత్తగా ఇంజక్షన్ వచ్చింది, అది చేయించుకొంటే 1 సం॥ వరకు పిల్లలు పుట్టరని విన్నాను.

★ ఇటువంటి వదంతులన్నీ శాస్త్రీయంగా నిరూపింపబడనివి. ఈ ఇంజెక్షన్లన్నీ ప్రస్తుతం పరీక్షార్థం వాడబడుతున్నవి. ప్రజలు వాడే విధంగా రూపొందింపబడలేదు. వీటి విలువలు నిర్ధారణగా నిర్ణయింపబడలేదు.

### వై. వై. – వెంకటాపురం

"ట్యూబెక్టమీ" ఆపరేషన్ చేయించుకున్నాక ఎన్ని నెలలకు దాంపత్య జీవితము గడపవచ్చును ? ఆపరేషన్ చేయించుకున్నవారు తీసుకోవలసిన జాగ్రత్తలు, తీసుకోవలసిన ఆహారము తెలుప ప్రార్థన. బరువులు ఎన్ని రోజులవరకూ ఎత్తకూడదు ?

★ ఆపరేషన్ చేయించుకొన్న 45 రోజు నుంచీ దాంపత్య జీవితం మామూలుగా గడపవచ్చును. ఇంకా ముందుగానే దాంపత్య జీవితం గడపవచ్చని కొందరి అంచనా.

ప్రస్తుతం చేయబడుతున్న లేపరోస్కోపిక్ స్టెరిలైజేషన్ తర్వాత కొన్నిగంటల వ్యవధిలో మామూలు కార్యక్రమాలు కొనసాగించవచ్చును. మామూలుగా బరువులు ఆపరేషన్ అయిన ఒక నెలదాకా ఎత్తడం మంచిది కాదు. తీసుకోతగిన ఆహారంలో ఏ మార్పులూ అవసరం లేదు.

### ఎమ్. ఎన్. – తణుకు

నా వయస్సు 50 సంవత్సరములు. ఒకప్పుడు నేను డిఫెన్సులో పనిచేసి కాస్త విచ్చలవిడిగా ప్రవర్తించిన మాట వాస్తవం. కాని ఎప్పుడూ ఎటువంటి వ్యాధులు ఎరుగను. గత 10 సంవత్సరములుగా నాకు గజ్జలలో రెండు వైపులా దురదగా వుంటుంది. చర్మం నలుపుగా మారినది. గోకినపుడు చెమటకాయలు రాలినట్లు పొట్టులా రాలిపోయి చిన్న మచ్చలుగా కన్పిస్తున్నవి. బీజముల క్రింద భాగములో గూడా అదే మాదిరిగా దురద వుంటుంది. కాని నిత్యకృత్యాలకు అంతరాయం వుండదు. రశి ఏమీ కారట్లేదు.

★ మీరు ఆ లింఫ్ గ్లాండ్స్‌ని బయాప్సీ చేయించుకొని ఫలితాన్ననుసరించి వాటిని తీసివేయటమో, మందులు వాడటమో చేయవలసి ఉంటుంది. ★

## ఇది మేఘ సందేశమూ ..

క్షణాలు గడిచాయి. తను చేస్తున్న పనికి ఆమెలో దుఃఖం పెల్లుబికింది. తనమీద తనకే చిరాకు, కోపం కలిగాయి. తనను పెనవేసుకుంటున్న సురేంద్రను బలవంతంగా దూరంగా నెట్టివేసింది.

అతనిలో సంస్కారం మేల్కొంది. అతని ఆవేశం చల్లారి ఉలికిపాటుతో గాయత్రిని చూశాడు.

ఆమె కనురెప్పలు బలవంతంగా పైకెత్తి అతని కళ్ళల్లోకి చూసింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు అతన్ని కలచివేశాయి.

"గాయత్రీ !" ఆమె చేతిని తన రెండు చేతుల్లోకి తీసుకున్నాడు. అతని భుజంమీద తలవాల్చి "సురేన్ ! పెళ్ళికాకముందు ప్రేమలు దైహిక సంబంధాలకు అతీతంగా వుండాలి. కాలగతి మనల్ని ఒకటి చేయకపోతే నీపట్ల నా ప్రేమ, ఆరాధనలే అద్భుతంగా, బతుకంతా అలా భావించటంలో ఆనందం వుండాలి. నువ్వెదూరమైనా నీ జ్ఞాపకాల నీడల్లో నా జీవితమంతా గడిపేస్తాను" అంది ఒక్కోమాటే ఒత్తి పలుకుతూ !

ఆమె ఆత్మార్పణకు అతను చలించిపోయాడు. ఆమె చేతిని మృదువుగా సవరిస్తూ "గాయత్రీ ! నిన్ను బాధపెట్టాను. క్షమించు. నువ్వు నాకు దూరమౌతావనే ఆలోచన నా మనసులో ఎక్కడాలేదు. జన్మ జన్మలకీ విడిపోకూడదనిపించే యీ బంధం... శాశ్వతం చేయాలని నేను ఆశపడుతుంటే, నువ్విలా 'ఒకటి కాలేమేమో'నని వెనుకాడుతున్నావేం గాయత్రీ !" అన్నాడు.

గాయత్రి అతని మాటలకు నొచ్చుకుంది.

"లేదు సురేన్ ! నీనుంచి నేనెప్పుడూ దూరంకాను. వెన్నెల చంద్రుణ్ణీ; కెరటాలు కడలిని విడిచి ఎక్కడికైనా పోగలవా ? మన భంధం ఏ జన్మకూ శాశ్వితంగా వుంటుంది. నా వుద్దేశం అదికాదు. మిమ్మల్ని విడిచి నేను ఎక్కడకీ వెళ్ళను." –

"థాంక్యూ గాయత్రి; థాంక్యూ" అతని కళ్లల్లో కాంతి పుస్ఫుటించింది.

* * *

ఆ రోజే మంజుల, వినోద్‌లు విదేశానికి వెళ్ళిపోతున్నారు ఆమె భర్తతో కలిసి అలా అందరికీ దూరమయిపోతూందని ఇంటిల్లిపాదికీ దిగులుగా వుంది. ఆమెలో వున్న ఆకర్షణ ఒక్కటే. ఎప్పుడూ ఉత్సాహంగా వుంటుంది. తను నవ్వుతుంది, అందర్నీ నవ్విస్తుంది. అందరికీ ఆనందాన్ని పంచటం ఆమె తత్త్వం. ఇప్పుడు తను వెళ్ళిపోతూ ... పోతూ ఆ ఇంటి కళను, ఆ మనుషుల్లోని ఉత్సాహాన్ని కూడా తన వెంట తీసుకెళ్తున్నట్టు బాధపడిపోతున్నారు.

సురేంద్ర, గాయత్రి మంజుల వెళ్ళిపోతుందన్న బాధకు తట్టుకోలేకపోతున్నారు.

మంజులక్కూడా మాటిమాటికీ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. ఏనాడూ తల్లిదండ్రుల్ని వదిలి రెండురోజులు దూరంగా లేదు. ఇప్పుడు రెండు సంవత్సరాలు వాళ్ళని చూడకుండా ఎలా వుండాలి ? అదెలా సాధ్యమో అర్థం కావటం లేదామెకి.

సురేంద్రని ఓదార్చుతూ ఎప్పటికప్పుడు అన్ని విశేషాలతో తనకి ఉత్తరాలు రాయమనీ, గాయత్రిని వివాహం చేసుకోవటంలో మాత్రం జాప్యం చేయవద్దని, వాళ్ళ తండ్రిని ఎలా అయినా ఒప్పించి ఆమెని చేపట్టమని ... ఇలా చెప్పిన విషయాలే పదేపదే చెప్పింది.

వినోద్‌ని తీసుకుని గాయత్రి ఇంటికి వెళ్ళింది. గాయత్రికి స్నేహితురాలు దూరమవుతోందన్న దుఃఖంతో నోటిమాట పెగలటంలేదు.

మంజుల కాళ్ళకు పసుపు రాసి, నుదుట కుంకుమబొట్టు పెట్టింది. తను కొన్న చీర ఆమెను కట్టుకోమంది. మంజుల ఆ బట్టలతో పరమేశంగారికి నమస్కరించింది. ఆయన ఆ దంపతుల్ని దీవించారు.

( ఇంకా వుంది )

# పాలు కావాలనుకున్నప్పుడు- కామధేనువు

# విజయ పాలపొడి

మిల్క్‌షేక్ ?

ఎంతో సులభం

పసందైన ఏదైన కోరుకోండి

గులాబ్‌జామ్ ?

ఓ తప్పకుండా

ఐస్‌క్రీం ?

అద్భుతం

VIJAYA
SPRAY DRIED
MILK POWDER

విజయ పాలపొడి సిసలైన తాజా పాలకు ప్రతిరూపమే. స్ప్రే డ్రయింగ్ ద్వారా పాలను పొడిగా మార్చారు. ఇందులో పాలలో ఉండే పోషక పదార్థాలన్నీ ఉన్నాయి. మీరు కోరుకున్న క్షణంలో నీళ్ళు కలిపి స్వచ్ఛమైన పాలు తయారు చేసుకోవచ్చు.

మీ గృహంలో విజయ పాలపొడి డబ్బావుందంటే అది మీ పాలిట కామధేనువు. మీరు పాలు కావాలనుకున్నప్పుడు సర్వసిద్ధం-పాలతో తయారు చేసే పదార్థాలు మీకెంతో మక్కువ. పెరుగు, పాయసం, గులాబ్‌జామ్, మిల్క్‌షేక్ తాజా ఐస్‌క్రీం ఏదైనా నోరూరించేవి చేసి చూడండి.

## విజయ పాలపొడి




ఉత్పత్తి చేయువారు ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య లిమిటెడ్

FDS APDDCFL 3083 Tel



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "గాంధీ" చిత్రం గురించి శివాజీగణేశన్

''గాంధీ — చిత్రాన్ని వీడియోలో చూసి భోరున విలపించేశాను. మరోసారి థియేటర్‌లో కూడా చూడాలని ఉంది. ఈ చిత్రాన్ని కొందరు ఎన్నో విధాల విమర్శించారు. మరికొందరు ప్రశంసించారు. నేను మాత్రం ఆ చిత్రంలో ఐక్యమైపోయాను; తాదాత్మ్యం చెందాను. మీరూ, నేమా, మన చుట్టూ ఉన్న భారతీయులెవరూ చేయని ఓ మంచి కార్యాన్ని రిచర్డ్ ఆటెన్‌బరో చేశారు. మనమంతా ఆయన్ని మనసారా అభినందించాలి. ఇలాంటి చిత్రమొకటి తయారవకపోతే భావి పౌరులకు ఆ మహాత్ముని గురించి గుర్తుండేది కాదు. 'కట్టబ్రహ్మన' చిత్రం చూశాకే అలాంటి వీరుడొకడుండేవాడని చాలామందికి తెలిసింది; గర్వించారు కూడానూ. ఇలాగే రాజాజీ, కామరాజ్ గార్ల మీద కూడా చిత్రాలు తయారవ్వాలి. ఇలాంటి చిత్రాలలో అంబేద్కర్‌ను చూపించలేదు, వీరిని చూపించలేదు, వారిని చూపించలేదు అని లోపాలు చెప్పడం శుద్ధ తప్పు,'' అన్నారు శివాజీగణేశన్.

''మీ అబ్బాయి ప్రభు అత్యల్పకాలంలో చాలా పాపులర్ అయిపోయాడే!'' అంటే, శివాజీగణేశన్ ''బాగా ఆక్ట్ చేస్తున్నాడంటారా? ఇంకా వృద్ధిలోకి వస్తాడా? ఇటీవల నేను ఢిల్లీలో ఇందిరమ్మగారిని కలిసినప్పుడు ఏదో మాటల సందర్భంలో మా ప్రభు గురించి చెప్పాను. 'అరే! మీ ఇంట్లో కూడా మీకు ఒక పోటీయా?' అంటూ ఆమె నవ్వారు,'' అన్నారు.

## పాకిస్థాన్‌లో రాజ్‌కపూర్ చిత్రం

రాజ్‌కపూర్ సంకల్పించిన ''హీనా'' చిత్రం ఒక ముస్లిమ్ జిప్సీ వనితకు సంబంధించిన కథ. ఇటీవల పాకిస్థాన్ అధ్యక్షుడు జియా వుల్ హక్ ఢిల్లీ వచ్చినప్పుడు ఆయన్ని రాజ్‌కపూర్ కలుసుకుని, కథకు అనుగుణంగా పాకిస్థాన్‌లో ''హీనా'' చిత్రీకరణకు అనుమతి కోరాడు. జియా సంతసించి, ఈ విషయమై చర్చించడానికి పాకిస్థాన్‌కు రమ్మని రాజ్‌కపూర్‌ను ఆహ్వానించాడు.



''మన ఆర్ట్ డైరెక్టరుకు పెళ్లి కాలేదట-అందుచేత శోభనం గది సెట్ ఎట్లా వెయ్యాలో తెలీదంటున్నాడు!''

"రంగుల పులి"లో గొల్లపూడి, మోహన్‌బాబు



'సాగర సంగమం'లో కమల్‌హాసన్, జయప్రద

కృష్ణ, జయసుధ 'శక్తి'

## 'సంతోషిమాత వ్రతమహాత్మ్యం'లో సంతోష ధనం

శ్రీ సంతోషిమాత ఆలయ నిధి కోసం సంతోష్‌కుమార్ ( చంద్రమోహన్ ), రాగిణి (రాధాప్రసాదరావు) జోలి పట్టుకుని, మహారాజా (శ్రీధర్) వద్దకు వచ్చారు. "మ హా రా జా ! సంతోషిమాత ఆలయ నిర్మాణానికి ప్రజలందరి నుండి నిధిని సేకరించటానికి మీ అనుజ్ఞ కోరి వచ్చాం !" అని సంతోష్‌కుమార్ విన్నవించుకున్నాడు.

"మహాత్మా ! మీరు పూనుకున్న ఈ పుణ్యప్రదమైన కార్యానికి జోలిపట్టి ప్రతి మనిషినీ అడగటం దేనికీ ? ఎంత ధనమైనా నేనొక్కడినే ఇవ్వగలను," అన్నాడు మహారాజు.

"మీరెంతైనా ఇవ్వగలరు, మహారాజా ! కాని, కలిగిన కష్టసుఖాలన్నీ దైవ నిర్ణయంగా తల వంచి అనుభవిస్తూ, ఉన్న దానితో తృప్తి చెందుతూ, ఏ కలతా లేని మనస్సుతో ఇచ్చే కానుక ఎంత చిన్నదైనా — అదే విలువైన సంతోషధనం. అటువంటి ధనంతోనే సంతోషి మాత ఆలయం రూపుకోవాలని నా ఆశయం. నిధి ఇచ్చేటప్పుడే ఆ తల్లి గుడి గుండెల్లో రూపు దిద్దుకోవాలని నా ప్రయత్నం."

"మహాత్మా ! నేను ఎంత ధనమైనా ఇవ్వగలనని పొరపాటు పడ్డాను. కానీ, మీరడిగే ఆ సంతోషధనం లేని నిరుపేదవాడిని; నిత్య దుఃఖితుడ్ని."

మహారాణి ( అనిత ) పక్కనున్న తన కుమారుడ్ని చూపిస్తూ, "ఒక్కగానొక్క బిడ్డ — అటు చూడండి — కాళ్ళూ చేతులూ కదల్చలేని ఆ పరిస్థితి పరిశీలించండి. రాజ వైద్యులెన్ని మందులిచ్చినా ఫలితం లేకపోయింది," అంది గద్గత స్వరంతో.

రాగిణి హృదయం ద్రవించింది. "గురుదేవా! దేవి ప్రసన్నులైన మీకు అసాధ్యమైనదేదీ లేదు. రాజకుమారుడు స్వస్థత పొందేలా అనుగ్రహించండి," అని వేడుకోగా సంతోష్‌కుమార్ "ఆ పసివాడి చేతులతోనే కానుక ఇప్పించండి, మహారాజా ! ఆ పరమేశ్వరి సంతోషి మాత త్వరలోనే అనుగ్రహిస్తుంది," అన్నాడు.

మహారాణి తమ కుమారుని చేతులలో కానుకలుంచి, "స్వీకరించండి." అంది.

"సంతోషిమాత కటాక్ష సిద్ధిరస్తు !" అంటూ సంతోష్‌కుమార్ ఆశీర్వదించి, రాగిణితో బయలుదేరాడు.

"మహారాజా, మహారాణి తమ పుత్రుని వంక ఆశతో చూశారు.

కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో రూపొందిన జయలక్ష్మి ఆర్ట్ ఇంటర్నేషనల్ వారి "సంతోషి మాత వ్రత మహాత్మ్యం" చిత్రానికి కె. రాజయ్య నిర్మాత.



'దుర్గాదేవి' జయసుధతో శారద

# సినిమా

## రాజమండ్రిలో "భార్యా భర్తల సవాల్"

"మే 7 నుంచి 23 వరకు ఊటీలో రెండవ షెడ్యూల్ ముగించాం. జూన్ మొదటి వారం నుంచి రాజమండ్రిలో పదిరోజులపాటు జరిగే మూడవ షెడ్యూల్ తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ఎస్. వి. సుబ్బరాజు. ఈయన సమకూర్చిన కథతో పద్మజా కళా మందిర్ నిర్మించే "భార్యా భర్తల సవాల్"లో ఫారెస్ట్ ఆఫీసర్‌గా మోహన్‌బాబు, పోలీస్ ఆఫీసర్‌గా సుమలత నటిస్తున్నారు. ఇంకా రాజేష్, అరుణ, రావు గోపాలరావు, గొల్లపూడి మారుతీరావు, నూతన్ ప్రసాద్, త్యాగరాజు, భీమరాజు, సి. హెచ్. కృష్ణమూర్తి, రామరాజు వెంకట్రాయుడు, ఏచూరి, శ్రీరాత్, ఆశాలత, జ్యోతిలక్ష్మి పాత్రధారులు. మోదుకూరి జాన్సన్, రాజ—కోటి, వేటూరి, పి. నారాయణరెడ్డి, కె. ఎస్. మణి, బి. చలం, నాయని మహేశ్వర రావు, రఘురామ్, ధ్రువకుమార్, కె. వెంకట్రామరాజు తెరవెనుక కృషి చేస్తున్నారు. పి. చంద్రశేఖరరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారైన ఈ చిత్రం జూలై విడుదల.

## "పువ్వు – కాగితం పువ్వు"

"పరిస్థితుల, ప్రదేశాల మార్పుల వల్ల మహిళ జీవితంలో వచ్చే పరిణామమే ప్రధానాంశం. అనూహ్యమైన మలుపులతో అన్ని తరగతుల ప్రేక్షకులనూ ఆకట్టుకునే చిత్రం," అన్నారు ఎస్. కృష్ణంరాజు. ఆగస్టులో సెట్స్‌కు వెళ్లే నవత ఆర్ట్స్ "పువ్వు — కాగితం పువ్వు" చిత్రానికి పర్వతనేని సాంబశివరావు డైరెక్టరు.

## "ఆకలీ నీకు జోహార్లు"లో అహోబలరావు అన్యాయాలు

పార్కు... చైతన్య (సుమన్) చుట్టూ పెద్ద గుంపు ప్రోగయింది. ఓ వైపు పత్రిక విలేఖరులున్నారు.

సుమన్ గంభీరంగా "ఆకలి ప్రాజెక్టు ద్వారా రైతుల, నిరుద్యోగుల, బిచ్చగాళ్ళ జీవన విధానం బాగు చేసేందుకు ప్రభుత్వం కొన్ని కోట్ల రూపాయల నిధులను సమకూర్చింది కాని, ప్రాజెక్ట్ ఛైర్మన్ అహోబలరావూ, దాని కమిటీ సభ్యులూ ఆ నిధులను తమ స్వార్థ ప్రయోజనాలకు వాడుకుంటూ — ప్రజల్ని ప్రభుత్వాన్ని మోసం చేస్తున్నారు. వాళ్ళు చేస్తున్న అన్యాయాన్ని ఎదిరించాలని నేను చేసిన ప్రయత్నాలన్నిటినీ కొట్టిపారేశారు. ఇదంతా మీ ద్వారా ప్రజలకు తెలియజేయడానికే ఈ సమావేశం ఏర్పాటు చేశాను. వీళ్ళ అనుభవాలు కూడా వింటే, మీకు మరింత సమాచారం లభిస్తుంది," అన్నాడు.

కుంటి బిచ్చగాడు అప్పారావు ఇలా అన్నాడు "నాకు సైకిలబండి కొనిత్తామని ఐదొందల రూపాయలకి యేలిముద్దర్లు యేయించుకున్నారు వాళ్ళడిగిన డబ్బిస్తే లోను శాంఖనవుద్దని, లేదంటే కుదరదని మొండిసెయ్యి సూపిత్తున్నారు."

నిరుద్యోగి శ్రీనివాసరావు : "పౌల్ట్రీ ఫామ్ పెట్టుకోడానికి సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ స్కీమ్ కింద పదిహేను వేలు ఇస్తున్నట్లు సంతకం చేయించుకొని, పదివేలే ఇస్తామంటున్నారు. అదేమని అడిగితే, అసలు లోన్ ఇవ్వమని బెదిరిస్తున్నారు."

రైతు శివరామయ్య: "వర్షాలులేక పొలాలు మాడిపోయాయి. నీళ్ళపంపు యేసుకోడానికీ, తిండిగింజలకూ డబ్బులిత్తామని చెప్పి — సగం డబ్బు లంచంకింద అడిగారయ్యా. ఇవ్వనన్నాను. లోనులేదు పొమ్మని తరిమికొట్టారయ్యా."

చైతన్య ఆవేశంతో "ఈ నిజాలు మీ ద్వారా ప్రజల్లోకి వెళ్లాలని ఈ సమావేశం ఏర్పాటు చేశాను," అన్నాడు.

ఓ విలేఖరి "మీరు చెప్పిన వార్తలు న్యూస్ పేపర్లో ప్రకటించినంత మాత్రాన సమస్యలు తీరుతాయా ?" అన్నాడు.

"సమస్యలు తీరవు. కాని, తమకు జరుగుతున్న మోసాన్ని తెలుసుకుని ప్రజలు చైతన్యవంతులు కావడానికి ఇదొక మార్గం," అన్నాడు చైతన్య.

విడుదలకు సిద్ధంగాఉన్న బిందూ ఎంటర్ ప్రైసెస్‌వారి "ఆకలీ నీకు జోహార్లు" చిత్రాన్ని ఎస్. రామచంద్రరావు దర్శకత్వంలో యు. త్రినాధకుమారి, యు. జయశ్రీ నిర్మించారు.

# ఆప్కోవారి వేసవి ప్రత్యేక ప్రదర్శన మరియు అమ్మకం

ఈ వేసవికి ఆప్కోవారి చేనేత
ప్రదర్శన మరియు అమ్మకంలో
కొనుగోలు చేసి **20%** మరియు
అంతకు పైగా తగ్గింపు పొందండి.
ఈ సదుపాయం ఆప్కో వారి
అన్ని షోరూముల్లో, జిల్లా కేంద్రాల్లో
**16** మే నుండి **18** జూన్ వరకు
వినియోగించుకోండి.




చేనేతలు

16 మే నుండి
18 జూన్ '83 వరకు
20% మరియు
అంతకుపైగా
తగ్గింపు




ఆప్కో
చేనేతలు కొనండి

kiron/apco/83

## గురజాడ కళామందిర్ చిత్రం

"ఒక కొత్త నటిని పరిచయం చేస్తున్నాం," అన్నారు విజయవాడ వాస్తవ్యులైన శంకరరెడ్డి. ఈయన పై పతాకంలో నిర్మించే చిత్రంలో "మరో మలుపు, ఈ చరిత్ర ఏ సిరాతో, ఇది కాదు ముగింపు" చిత్రాలలో ప్రతిభావంతంగా నటించి ప్రశంసలందుకున్న శివకృష్ణ హీరో. గీత, నూతన్‌ప్రసాద్, సుధాకర్ ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. జె. వి. రాఘవులు సంగీతం, మధు అంబట్ ఛాయ, రవి కూర్పు, మూర్తి నిర్మాణ సారధ్యంతో ఈ చిత్రానికి దర్శకత్వం నెఱపే పి. ఉమామహేశ్వరరావు "జూన్ 7 నుంచి జూలై 7 వరకు శ్రీకాకుళం జిల్లా పరిసరాలలో ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగిస్తాం," అన్నారు. ఈ యువ దర్శకుడు లోగడ "పూలపల్లకి"ని అందించారు.

## కొన్ని దాసరి కొత్త చిత్రాలు

★ బోయపాటి సీతారామయ్య నిర్మించే లక్ష్మీ చిత్రాలయ వారి తొలి చిత్రంలోనూ, చలసాని రామకృష్ణప్రసాద్ నిర్మించే విజయదుర్గా మూవీ క్రియేషన్స్ చిత్రంలోనూ ఎ. ఎన్. ఆర్. హీరో.

★ వజ్జ సుబ్బారావు, విజయశంకర్ నిర్మించే లలితాలయ మూవీస్ "జగన్" చిత్రంలో శోభన్‌బాబు హీరో. చక్రవర్తి సంగీత దర్శకుడు, కె. ఎస్. హరి ఛాయాగ్రాహకుడు.

★ ఆకుల బుల్లి అబ్బాయి నిర్మించే ఎ. బి. ఇంటర్నేషనల్ వారి చిత్రంలో నవనటీనటులు పాల్గొంటారు. తారకప్రభు సినీ పిక్చర్సు పతాకంలో కరాటం కృష్ణమూర్తి ఓ చిత్రాన్ని నిర్మిస్తారు.



'తోడూ—నీడ'లో రాధిక, శోభన్‌బాబు

# సినిమా

## పి. సాంబశివరావు దర్శకత్వంలో హిందీ చిత్రం

"శ్రీదేవి హీరోయిన్. మనోజ్‌కుమార్ కొడుకు కునాల్ గోస్వామి హీరో," అన్నారు. పర్వతనేని సాంబశివరావు. ఈయన దర్శకత్వంలో ఆనందలక్ష్మి వారి హిందీ చిత్రం మే 25న మొదలైంది. ఇందర్ రాజ్ ఆనంద్ సంభాషణలు, కల్యాణ్ జీ—ఆనంద్ జీ సంగీతంతో పింజల సుబ్బారావు నిర్మించే ఈచిత్రానికి "పయణంగళ్ ముడివదిల్లై" అనే తమిళ హిట్ చిత్రం ఆధారం.

## రవి కళామందిర్ చిత్రం

"సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్‌లలో ప్రతి నెలా 21 నుంచి 30 వరకు షూటింగ్ మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు విజయనిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో హీరో కృష్ణ సమర్పించే పై సంస్థ చిత్రంలో రాధ, జయంతి, సత్యనారాయణ,గొల్లపూడి,గిరిబాబు,వీరభద్రరావు ఇతర ముఖ్య భూమికలను ధరిస్తారు. సత్యానంద్, చక్రవర్తి, వి. ఎస్. ఆర్. స్వామి, ఆదుర్తి హరినాథ్ ప్రభృత సాంకేతిక వర్గంతో ఎం.ఎస్ ప్రసాద్, ఆదుర్తి భాస్కర్ నిర్మాతలు.

## క్రయిమ్‌చిత్రం ప్రేరణతో హత్యలు

పునేలో సంచలనం కలిగించిన అభయంకర్ హత్య కేసులో నిందితుడైన మున్వార్ షా "మాకు మరణశిక్ష విధించిన జడ్జిగారే ఫిలిమ్‌ఫేర్ బహుమతి ప్రదానోత్సవంలో 'డాన్' చిత్రంలో ఉత్తమ నటుడిగా అమితాబ్ బచ్చన్‌కు అవార్డు ఇచ్చారు. అవలా చిత్రమే మేం హత్యలు చేయడానికి ఇన్‌స్పిరేషన్ ఇచ్చింది. అందుకు ఆ చిత్రానికి బహుమతి, మాకీ శిక్ష," అంటూ వాపోయాడట.

## శోభన్‌బాబు చిత్రానికి జంధ్యాల దర్శకత్వం

ఎ. వి. ఎమ్., సారధి కంబైన్స్ పతాకంలో ప్రముఖ చలనచిత్ర నిర్మాణ సంస్థలు కలిసి నిర్మించే చిత్రంలో శోభన్‌బాబు సరసన రాధిక నాయిక. కె. భాగ్యరాజా కథకుడు. "రాజమండ్రి ప్రాంతాలలో జూన్, జూలై నెలల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు ఈ చిత్ర దర్శకుడు జంధ్యాల.

సుమన్, విజయశాంతి 'పండంటి కాపురానికి పన్నెండు సూత్రాలు'



## కృష్ణంరాజు "కోటికొక్కడు"

''దానవులలో పెరిగినా మానవునిలోని మానవత్వం అంతరించిపోదు. దుష్టశిక్షణ. శిష్ట రక్షణకు పూనుకున్న మానవుడు మాధవుడనిపించుకుంటాడు. మహత్తరమైన త్యాగం చేసే వ్యక్తి కోటికొక్కడే ఉంటాడు, అతను మా కథానాయకుడు'' అన్నాడు రాధాకృష్ణా మూవీస్ అధినేత జి. సత్యనారాయణరాజు. ఈయన నిర్మించిన ''కోటికొక్కడు'' చిత్రంలో కృష్ణంరాజు, మురళీమోహన్, జయసుధ. సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, పూర్ణిమ, జమున ముఖ్య భూమికలు నిర్వహించారు. కాశీవిశ్వనాథ్ సంభాషణలు, రాజన్—నాగేంద్ర సంగీతం, పి. దేవరాజ్ ఛాయతో కొమ్మినేని శేషగిరిరావు దర్శకుడు. జూన్ విడుదల.



'శివుడు—శివుడు—శివుడు'లో ఒక దృశ్యం

## ఏటా అయిదు తారకప్రభు ఫిలిమ్స్ చిత్రాలు

తొమ్మిది రాష్ట్ర ప్రభుత్వ అవార్డులు, నాలుగు జాతీయ అవార్డులు పొందిన ''మేఘసందేశం'' చిత్ర సృష్టికర్త దాసరి నారాయణరావు జన్మదినోత్సవం మే 4న కోడంబాక్కంలో కొత్తగా నిర్మించబడిన ''తారకప్రభు కాంప్లెక్స్''లో వైభవోపేతంగా జరిగింది. ఈ కాంప్లెక్సులోని స్టోరీ డిస్కషన్ రూమ్, మ్యూజిక్ కంపోజింగ్ రూమ్, ప్రొడక్షన్ రూమ్, థియేటర్ల నిర్మాణంలోనూ దాసరి ప్రత్యేకత కనిపిస్తుంది. అండర్ గ్రౌండ్‌లో డబ్బింగ్ థియేటరొకటి త్వరలో నిర్మించబడుతుంది. ''మా తారకప్రభు ఫిలిమ్స్ బానర్‌లో ఏటా అయిదు చిత్రాలు తయారవుతాయి,'' అన్నారు దాసరి. ఈ చిత్రాలకు దుర్గా నాగేశ్వరరావు, రేలంగి నరసింహారావు, రమణబాబు ప్రభృతులు దర్శకత్వం నెరపుతారు.

# సినిమా

## "అమాయకుడుకాదు అసాధ్యుడు'

శశిరేఖా మూవీస్ వారి చిత్రాని పై పేరు పెట్టినట్లు నిర్మాత పి. బాబ్జి తెలిపారు. కృష్ణ, జయసుధ, శ్యామ గౌరి, సత్యనారాయణ, వీరభద్రరావు, వేలు త్యాగరాజు, అంజలీదేవి, పి.జె.శర్మ, పండరీబాయి



'అమాయకుడు కాదు అసాధ్యుడు' కృష్ణ.

ప్రభృతులు పాల్గొన్నారు. విజయనిర్మల దర్శకత్వంలో డూండీ సమర్పించే ఈ చిత్రం షూటింగ్ పూర్తయింది. అప్పలాచార్య సంభాషణలకర్త. సత్యం సంగీత దర్శకుడు. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు. నిర్వహణ : జయదేవ్.

## "శివ తాండవం"

"ప్రళయరుద్రుడు" అనంతరం విశ్వచిత్ర పిసి ఎంటర్ ప్రైసెస్ అధినేత జి. రామకృష్ణంరాజు నిర్మించే చిత్రం "శివతాండవం." ★


LIFEBUOY
for health
LIFEBUOY SOAP
లైఫ్‌బాయ్
ఎక్కడో
ఆరోగ్యం అక్కడ
లైఫ్‌బాయ్‌తో స్నానం చేస్తే పరిశుభ్రంగా ఉంటారు మీరు... ఆరోగ్యమైన తాజాదనపు అనుభూతి పొందుతారు. లైఫ్‌బాయ్‌తో జీవితం ఆరోగ్యప్రదం. గుర్తుంచుకోండి.
లైఫ్‌బాయ్
మురికిలోని క్రిములను
వదలగొడుతుంది

సీరియల్

# అతడు అడవిని జయించాడు

డా. కేశవరెడ్డి

## 17

(గత సంచిక తరువాయి)

రాత్రి గడిచేకొద్దీ ముసలివాని ఎదలో భారం అధికం కాసాగింది. పరిసరాలన్నీ జుగుప్సాకరంగా ఉన్నట్లు అతనికి అనిపించసాగింది. అక్కడ మూడు నక్కలు చచ్చిపడి ఉన్నాయి. ఒకదాని పొట్ట చీల్చబడి ప్రేవులు బయటపడి ఉన్నాయి. మరొకదాని గొంతు తెగి పీక కనిపిస్తున్నది. ఇంకొకదాని తలలో ఈటె గుచ్చుకుని ఉంది. వీటన్నిటికీ కొంతదూరంగా తోటి గువ్వ పెడరెక్కలు వేసుకుని బోర్లపడి ఉంది.

మూర్తీభవించిన దుష్టత్వం వలె ఉన్న నక్కల కళేబరాలను అతడు కసితో చూడసాగాడు. కాని తోటి గువ్వను చూస్తుండగా అతనికి అనుకంప కలిగింది. 'ఈ నక్కలకున్న లోభత్వంలో లవలేశం కూడా తోటివానికి లేదు. వాడు అరవడంలో దురుద్దేశం లేదు. ద్రోహ తలంపు లేదు. వానిలో అమాయకత్వం తప్ప మరేమీలేదు. పోతే ఒక్కొక్కసారి దుర్మార్గుని కన్నా అమాయకుని వల్ల ఎక్కువ కీడు జరగడం కద్దు.' అనుకున్నాడు ముసలివాడు.

'ఎది ఏమైనప్పటికీ నామన్ననకు పాత్రుడైన తోటివాడిని నేను చంపడం తగని పనే.' అని అతడు తనను తాను గర్హించుకున్నాడు.

'తోటివాడు తన అమాయకత్వం వల్లను, సుక్కపంది తన మూర్ఖత్వం వల్లను నా కర్తవ్య నిర్వహణలో అడ్డువస్తున్నారు. ఇది చాల చిత్రమైన పరిస్థితి. ఏ సుక్కపంది కోసమైతే నేను ఇన్ని వెతలు పడుతున్నానో, ఆ సుక్కపంది కించిత్తు అవకాశం దొరికితే నన్ను నుగ్గునూచాడి చేయడానికి సిద్ధంగా ఉంది. ఇందులోని వైరుధ్యాన్ని గురించి తలపగిలేట్టుగా ఆలోచించుకోవచ్చు.' అనుకున్నాడు ముసలివాడు.

'జీవితం నానా విధాలైన వైరుధ్యాలతో నిండి ఉంది' అని అతడు మళ్ళీ ఒకసారి అనుకున్నాడు.

అతడనుభవిస్తున్న వేదన కన్న ఎక్కువ వేదనను ఎదలో ఉంచుకుని సుక్కపంది పడుకుని ఉంది. వీపుమీదున్న గాయం మీద ఈగలు వాలుతుండగా అది తన తోకతో తోలుకుంటూ ఉంది. 'ఈ దిక్కుమాలిన ఈగలు దాని గాయంమీద వాలి దానిని చికాకు పరచకుండు గాక. ఈ అడవి ఈగలు చండాలమైనవి. అవి ఎడ్ల పుండ్లమీద వాలి వాటికి గంగవెర్రులెత్తించి అడవంతా పరుగెత్తించడం కద్దు.' అనుకున్నాడతడు.

పంది ముట్టెమీదున్న నెత్తురు ఆరిపోయి ఉంది. వీపుమీది గాయం నుండి మాత్రం నెత్తురు వెన్నెలలో నిగనిగ మెరుస్తూ కారుతున్నది. 'గాయం చీము పడుతుందేమో. గాయాన్ని వెంటనే ఉప్పు నీటితో కడిగి వెంపలాకు పత్తిని వేసి కట్టుకట్టితే కన్నం కూడా కనపడకుండ మానుతుంది. కాని నేనిపుడు చెట్టు నుండి దిగలేని దౌర్భాగ్యపు స్థితిలో ఉన్నాను.' అనుకున్నాడతడు కొమ్మమీద అసహనంగా కదులుతూ.

'రేపు ఉదయం ఇంటికి వెళ్ళగానే చేయవలసిన పని ఇదే. వెంపలాకును తేవడానికై పిల్లవాడిని పంపాలి. దాని గాయానికి కట్టుకట్టిన పిదపగాని మరొక పని తలపెట్టకూడదు'' అని అతడు నిశ్చయించుకున్నాడు.

'దాని శరీరానికి తగిలిన గాయాన్ని గురించి మాత్రమే ఆలోచిస్తున్నాను. దాని మనసుకు తగిలిన గాయం మాటేమిటి ? తొలి ఈతలో పుట్టిన రెండు సలుగులను పోగొట్టుకోవడం సాధారణ విషయం కాదు. ఇపుడు దాని మనసు పచ్చిపుండువలె ఉంటుంది. దాని చెంత కూర్చుని వీపు నిమురుతూ అనునయ వాక్యాలు చెబితే బాగుండును. ఏమని చెప్పాలి. అసలు నా మనసు స్థిమితంగా ఉంటే గదా నేను దానిని ఊరడించగలిగేది'' అనుకున్నాడతడు.

అణగి ఉండిన గాలి మందంగా వీచడం ప్రారంభించింది. చెట్ల ఆకులు నిశ్శబ్దంగా మెల్లగా ఆడసాగాయి.

'ఈ పూట చనిపోయిన సలుగులు రెండూ అల్పాయువు కోరుకుని పుట్టాయేమో, అసలవి రెండూ పుట్టనేలేదనుకుంటే సరి. ఏనిమిది మాత్రమే పుట్టాయనుకుంటే సరి. ఎనిమిది మాత్రమే పుట్టాయని రేపు ఊర్లో చెబుతాను. గ్రామస్థులంతా నమ్ముతారు. పిల్లవాడు నమ్ముతాడు.' అనుకున్నాడతడు.

మందమారుతంలో తేలివస్తున్న బిలబిత్రి పూలవాసన మత్తుగా తాకుతున్నది.

'నేను ప్రపంచాన్నంతటినీ నమ్మించవచ్చు. కాని వాస్తవం సుక్కపందికి తెలుసు. ఈటెకు తెలుసు. నా అంతరాత్మకు తెలుసు' అనుకున్నాడతడు.

మందమారుతం వేడిమిని సంతరించుకున్నట్టుగాను, పూలవాసన వెగటుగ మారినట్టుగాను అతనికి అనిపించింది.

'కనుక ఈ పూట సంభవించిన దురదృష్టాన్ని నేనుగాని, సుక్కపందిగాని ఇప్పుడిప్పుడే మరచిపోవడం జరగదు. కాని కాలం అన్ని దురదృష్టాలను మరపిస్తుంది. ఏండుటేసుకలోని కాలిబాటను ప్రవాహం రూపుమాపినంత సునాయాసంగా, కలాపినీళ్ళ తేమను ఉదయపు సూర్యుడు హరించినంత సునాయాసంగా కాలం దురదృష్టాలను మరపిస్తుంది' అనుకున్నాడతడు.

చంద్రుడు పడమరకు వాలడంతో తీంట్ర

**జరిగిన కథ — 5:** ముసలివాడు ఆజానుబాహుడు. అతని ఆస్తి పందులు. అతని మనుమడు మేతకై పందుల్ని తోలుకొనిపోయి తిరిగి రానందుకు ఆందోళన చెందాడు. వెతుక్కుంటూ బయలుదేరిన అతనికి పిల్లవాడు, పందులు రావడం కనుపించింది.. కాని వాటిలో ఈనడానికి సిద్ధంగా ఉన్న సుక్కపంది కనుపించలేదు. దాన్ని వెతుక్కుంటూ అడవివైపు నడవసాగాడు. గత కాలంలో జరిగిన కొన్ని అనుభవాలను మననం చేసుకుంటూ సుక్కపందికై అడవంతా గాలించసాగాడు. కుందేలు మాంసంతో కడుపు నింపుకుని ఆ రాత్రంతా వెతకను నిశ్చయించుకున్నాడు ముసలివాడు. చివరకు తీంట్రపొదలో సుక్కపంది ఈనినట్లు తెలుసుకున్నాడు. సుక్కపంది మనిషి అలికిడి పసిగట్టి ముసలివాడిపైకి విజృంభించింది. ఎలాగో దాని బారినుండి తప్పించుకొని చెట్టెక్కి కూర్చున్నాడు ముసలివాడు. చెట్టుమీద ముసలివాడు సుక్కపందిని, సలుగులను పదే పదే తలచుకుంటూ పారవశ్యం చెందుతూ ఉంటాడు. ఆ రాత్రికి సలుగులు నక్కలపాలు కాకుండా కాపాడాలని నిశ్చయించుకుంటాడు. ఓ గుంటనక్క సలుగులను పొట్టపెట్టుకోనురాగా సుక్కపంది దానిని చంపేస్తుంది. మరొక నాలుగు గుంట నక్కలు రాగా ఒకటి ముసలివాడిచేచే, రెండవది చుక్కపందిచే చంపబడ్డాయి. కాని మిగిలిన రెండు నక్కలు రెండు సలుగులనీ నోట కరిపించుకొని పారిపోయాయి. తోటి గువ్వపై కోపంతో ముసలివాడు దానిని తన కత్తికి బలిచేస్తాడు.

ఆకుల నీడ సుక్కపందిమీద పడుతున్నది. దాని వీపుమీదున్న గాయంనుండి రక్తం ఇంకా స్రవిస్తున్నదో ఆగిపోయిందో తెలియడంలేదు. పంది దేహం సగం నీడలోను, సగం వెన్నెలలోనూ ఉన్నది. కొన్ని సలుగులు పాలు తాగుతున్నాయి. మరికొన్ని గుడ్డివాళ్ళవలె తల్లికి సమీపాన తారాడుతున్నాయి.

"సుక్కపంది దేనిని గురించి ఆలోచిస్తూ ఉంది ? తను పోగొట్టుకున్న రెండు సలుగులను గురించి వెతజెందుతున్నదేమో: మిగిలి ఉన్న ఎనిమిది సలుగుల్ని కాపాడమని భగవంతుడ్ని వేడుకుంటూఉందేమో! అది తన వెతలను నాకు చెప్పి, నా వెతలను వింటే ఎంత బాగుండును." అనుకున్నాడతడు.

బాపన చీమలు కనబడడంలేదు. 'ఒక్కటి కనిపించడంలేదు. ఏమైపోయినట్టు ? భుక్తి కోసం వెళ్ళిఉంటాయి. నేను కుందేలును చంపి తిన్నట్టుగా,నక్కలు సలుగుల్ని చంపి తినినట్టుగా ఈ చీమలుగూడా దేన్నో చంపి తినడానికి వెళ్ళి ఉంటాయి. చచ్చిపడిఉన్న నక్కల కనుగుడ్లను కొరికి తినడానికి వెళ్ళాయేమో! చివరకు బాపన చీమలవంటి సాధుజీవులుగూడా హింసనంటిపెట్టుకునే జీవిస్తున్నాయి.' అనుకున్నాడతడు.

పరిసరాలపైన అసహ్యాభావం అతనిలో ఉవ్వెత్తున లేచింది. నక్కల కళేబరాలవైపు తిరిగి కాంక్రించి ఉమిశాడు. పాలవెల్లువ వంటి వెన్నెల అతనికి చల్లదనాన్ని ప్రసాదించడంలేదు. వివిధ సౌరభాలను మోసుకుని తిరుగుతున్న గాలి అతనికి హాయిని కలిగించడంలేదు. ఈ వాతావరణంలో అంతర్లీనమై ఉన్న హింసాప్రవృత్తి, దోపిడితనము అతని పంచేంద్రియాలను తాకుతూ అతనిలోఅసహ్యాన్ని రేకెత్తిస్తున్నాయి. 'కోరలు, గోళ్ళు కలిగిన క్రూరమృగాలు మాత్రమే ఈ అడవిలో మనగలవు' అనుకున్నాడతడు. అతడు మళ్ళీకాంక్రించి నక్కల శవాలవైపు ఉమ్మబోయి ఆగిపోయాడు. 'ఇప్పుడిక్కడ హింసను నెరపనిదెవరు ? కడుపులో ఒకింత ఆకలి తోచగనే నేను కుందేలును చంపి తినలేదా ?' అనుకున్నాడతడు. అతడు తలవంచుకుని కొమ్మకిందకు ఉమిసి, 'ఈ ప్రకృతిలో నేనూ ఒక భాగమే' అనుకున్నాడు.

అతని మనసులో అసహనత పేరుకుంటున్నది. 'త్వరగా తెల్లవారితే బాగుండును' అనుకుంటూ అతడు ఆశతో తూర్పు దిక్కుగా చూశాడు. తూర్పు ఆకాశం తెంద్రగించలేదు. కురం సోకిన ఆవువలె, రెక్కలు తడిసిన పిట్టవలె ముడుచుకుని ఉన్నది.

"తెల్లవారాక సుక్కపంది తెలివి తెచ్చుకుని నా స్వాధీనంలోకి వస్తుంది. నేను వెదురు బద్దలతోను, తీంట్ర తీగలతోను గంపను అల్లి సలుగులను అందులో వేసుకుని పందిని వెంటపెట్టుకుని అడవి వదిలి వెళ్ళిపోతాను. ఈలోగా మరే ఉపద్రవం సంభవించకుండుగాక' అనుకున్నాడతడు.

'నేను ఇక్కడనుండి వెళ్ళిపోయాక చాలా కాలందాక ఈ తీంట్ర పొదను, ఈ సుంక్రేసు చెట్టును జ్ఞాపకముంచుకుంటాను. ఈ స్వల్ప వ్యవధిలోనే నాకు వీటితో అవినాభావ సంబంధం ఏర్పడింది. స్నేహకాలంకన్న, స్నేహంలోని తీవ్రతయే ప్రధానం' అనుకున్నాడు ముసలివాడు.

'కొంతకాలం పిదప నేనీ అడవికి వచ్చి ఈ ప్రదేశాన్ని సందర్శించడం జరగవచ్చు. అప్పటికి ఈ రక్తపు మడుగులు మాయమైపోయి వుంటాయి. తీంట్రపొద కూలిపోయి ఉంటుంది. సుంక్రేసు కొమ్మలు డుల్లిపోయి వుంటాయి. నక్కల పుర్రెలు, ఎముకలు పచ్చికలో కూరుకునిపోతూ కనిపిస్తూ ఉంటాయి' అనుకున్నాడతడు.

నక్కల శవాలకు పట్టబోయే దుర్గతిని గురించి అతడు కసిగా ఆలోచించసాగాడు. 'రేపు పొద్దు రెండు బారలెక్కేసరికి ఈ ప్రదేశం రాబందులతో నిండి ఉంటుంది. రాబందులు తిని వదలిన కండరాలను క్రమంగా చెద తినివేస్తుంది. వాటి పుర్రెలలో తేళ్ళు, పాములు చోటు చేసుకుంటాయి' అనుకున్నాడతడు.

నీచత్వాన్ని మూటలుగా కట్టి పడవేసినట్లు ఆ మూడు నక్కలు పడి ఉన్నాయి. తీంట్ర పొదకు పడమరగా పడి ఉన్న దాని తలలో గుచ్చుకునివున్న ఈటె నిటారుగ నిలుచుని ఉంది. గించుకుని ఉన్న దాని కోరలు, తెరుచుకుని ఉన్న దాని కళ్ళు వెన్నెలలో మెరుస్తున్నాయి. ఏక్షణానైనా అది లేచి ఉరకవచ్చుననే భ్రమ కలుగజేస్తున్నది.

'ఇంకెక్కడ లేస్తుంది ఈటె దాని కళ్ళ మధ్యదూరి ముచ్చిలిగుంటలో బయటకొచ్చేసింది' అనుకున్నాడతడు.

'ఈ మూడింటి పుర్రెలను తీసుకెళ్ళి గుడిసెలో పెట్టుకుంటే అవి నేనీ రాత్రి పొందిన అనుభవాలకు జ్ఞాపకార్థంగా ఉంటాయి. సుక్కపందియొక్క రౌద్రానికి, నాభుజబలానికి గుర్తుగా



ఉంటాయి. కాని ఇది చాల దారుణమైన రాత్రి. పీడకలలతో నిండిన నిద్రలాంటిది. రెండు పలుగులను పోగొట్టుకొన్న ఈ రాత్రిని నేను జ్ఞాపకముంచుకోదలచుకోలేదు. భూత కాలంలో జరిగిన దురదృష్టాలను మళ్ళీ మళ్ళీ గుర్తుకు తెచ్చుకోవడం మంచిది కాదు. వీలయినంత త్వరగా మరచిపోవాలి, మరచిపోవడం కన్న ముఖ్యం గుణపాఠం నేర్చుకోవడం. ఐతే ఇప్పుడు సంభవించిన దురదృష్టం ద్వారా ఏమి గుణపాఠం బోధపడింది?' అని అతడు తనను తాను ప్రశ్నించుకున్నాడు.

'నా పొరబాటు బాహాటంగానే తెలుస్తూంది. నేడో రేపో పలుగులను ఈనడానికి సిద్ధంగా ఉన్న సుక్కపందిని బయటకు వదలడమే నేను చేసిన పొరబాటు. దానిని దొడ్డిలోనే ఉంచి తిండీ నీళ్ళూ పెట్టవలసింది.' అనుకున్నాడతడు.

సూర్యుని సూటి కిరణాలు పొడిచినట్టుగా అతడు చేసిన పొరబాటు అతనిని బాధించసాగింది.

'ఉదయం నాకు వొంట్లో నలతగా ఉండింది. పిల్లవాడు దొడ్డితడక తీయడం, పందులను బయటకు వదలడం గుడిసెలో పడుకుని వినగలిగానే గాని లేచి బయటకు వచ్చి వానికి తగిన సూచనలిచ్చే ఓపిక లేకపోయింది' అనుకున్నాడు ముసలివాడు.

'ఈ ఆలోచనలకిక స్వస్తి చెబుతాను,' అనుకుంటూ అతడు దీర్ఘంగా నిట్టూర్చి రెండు చేతులతో బుర్ర గీరుకున్నాడు.

గులకరాయిని కుంటలోనికి విసరగా విచ్చిపోయిన పాచి మళ్ళీ కలుసుకున్నట్టుగా ఆలోచనలు అతనిని మళ్ళీ ముసురుకున్నాయి.

'ఈ ఆలోచనలకు నేను స్వస్తి చెప్పలేను. ఈ పూట నేను చేసిన పొరబాట్లు ఒకటి కాదు. రెండు కాదు. అవి అనేకంగా కనబడుతున్నాయి. బయలుదేరి వచ్చేటప్పుడు కనీసం పంగల కర్రనైనా చేతబట్టుకుని రావలసింది. ఈటె ఎంత శక్తివంతమైనదైనప్పటికీ దానిని ఒకేసారి ప్రయోగించగలను. బోలెడు గులకరాళ్లను పక్కన పెట్టుకొని పంగల కర్రను చేతబట్టుకుని ఉంటే వచ్చే నక్కలన్నింటినీ కనుగుడ్లు పగలగొట్టి ఉండేవాడిని. ఒక్క పలుగు గూడా మొక్కబోయి ఉండేది కాదు.

అతడు పంగల కర్రను ఉపయోగించి చాల కాలమయింది. చిన్ననాడతడు ఎంత చిటారు కొమ్మ మీదున్న ఉడతనైనాసరే, ఎంత వేగంగా ఎగురుతున్న పిట్టనైనాసరే చుక్కపెట్టినట్టు కొట్టి కింద పడవేసేవాడు.

అతనికి పిల్లవాడు జ్ఞాపకమొచ్చాడు. 'వాడు పంగల కర్రను ప్రయోగించడంలో అఖండుడు. వానికి గురి నేర్పింది నేనే.' అనుకున్నాడతడు గర్వంగా. 'ఇంకాస్త కండ పెట్టాక వానికి ఈటె నేర్పాలి. భుజాల మీద, దండలమీద పటిష్టమైన కండ ఉంటేగాని



ఈటె విసరడం కుదరదు.' అనుకున్నాడతడు.

రాత్రి గడుస్తున్నది. చంద్రుడు నడి ఆకాశం నుండి దిగడం ప్రారంభించి చాల సేపయింది. మేఘాలు అప్పుడొకటి అప్పుడొకటి చంద్రుని కడ్డంగా వస్తుండగా నాటి నీడలు అడవి మీద నిశ్శబ్దంగా ప్రాకుతున్నాయి.

## 18

రాత్రిగడిచేకొద్దీ ముసలివానిలో నిరుత్సాహం అలుముకొనసాగింది. 'ఇది శుభసూచకంకాదు. నిరుత్సాహం కార్యశూరునికి లక్షణంకాదు.' అనుకున్నాడతడు. 'నా చుట్టూ ఉన్న వాతావరణం చాల చెడ్డది. కళ్ళుతెరిస్తే మృత్యువుపాలైన ప్రాణులు, హింసపాలైన ప్రాణులు కనిపిస్తున్నాయి. ఈ అడవిలోని ప్రతి పొదలోను, గుహలోను బీభత్సము, నీచత్వము దాగి ఉన్నాయి. ఈ గాలిలో మృత్యువు తాండవిస్తున్నది.' అనుకున్నాడతడు.

సన్నగిల్లుతున్న ఆత్మస్థైర్యాన్ని పెంచుకోవటానికై అతడు తన ఆలోచనలను ప్రస్తుతాంశాలనుండి వెనకకు మరల్చాడు.

అతడు ఎట్టి పరిస్థితిలోగాని, ఎవరికిగాని తలవంచి ఎరుగడు. అతడు నూనూగు ప్రాయంలో ఉండగా ఒకసారి అతని గ్రామానికి పెద్ద ఉపద్రవం సంభవించింది. గ్రామానికి సమీపాన రోడ్డుకవతల మిలటరీ దండు విడిసింది. వాళ్ళు అక్కడ డేరాలు వేసుకుని నివసిస్తూ ఎందుకున్నారో గ్రామస్థులెవరికీ తెలిసేదికాదు. ఎక్కడో ప్రపంచ యుద్ధం జరుగుతూందని, అందులో పాల్గొనడానికి ఈ సిపాయిలందరూ తరలి వెళ్ళుతున్నారని జనం చెప్పుకునేవారు. ఆ సిపాయిలు కారునలుపుగా, హలఎత్తుగా ఉండేవారు. వాళ్ళ పెదవులు కందిరీగలు కుట్టినట్టు ఉబ్బిఉండేవి. నెత్తిమీద వెంట్రుకలు పొట్టిగా ఉంగలు చుట్టుకుని ఉండేవి.

వాళ్ళ రాకతో గ్రామంలో చాల సంచలనం కలిగింది. ఆ సిపాయిలు బరువైన బూట్లు తొడుగుకుని, దళసరియైన బట్టలు వేసుకుని, ఉక్కు టోపీలు నెత్తిన ఉంచుకుని, భుజాలపైన తుపాకులు ఉంచుకుని తిరుగుతుండేవారు. వాళ్ళకు భయపడి గ్రామస్థులు రోడ్డుదాటి వెళ్ళేవారు కారు. చీకటిపడ్డాక వీధుల్లోకి వచ్చేవారుకారు.

కాని క్రమంగా ఆ సిపాయిలు గ్రామస్థులను అరడిపెట్టడం ప్రారంభించారు. వాళ్ళు పట్టపగలే గ్రామంలోకి జొరబడి ధాన్యాన్ని, కోళ్ళను, మేకలను ఎత్తుకునిపోయేవారు. అడ్డుపడిన గ్రామస్థులను చితక తన్నేవారు.

ఊరి చివరన ముసలివాని [అప్పుడు యువకుడు] గుడిసె ఉండేది. ఒకనాటి ఉదయం ఇద్దరు సిపాయిలు అతని గుడిసెకొచ్చి రెండు గున్నలనివ్వమని ఆర్భాటం చేశారు. అతడప్పుడే చద్ది తాగి పందులను మేతకు తోలుకుని పోవడానికి సిద్ధంగా ఉన్నాడు. గున్నలను ససేమిరా ఇవ్వనన్నాడు. వాళ్ళు హుంకరిస్తూ తమ భుజాల మీదున్న తుపాకులను తీసి చప్పుడు చేసుకుంటూ మీటలను సవరించారు. అతడొకసారి ఎదనిండ గాలి పీల్చుకున్నాడు. రోమమయమైన తన ఎదమీద మెరుస్తున్న పులిగోరును ఒకసారి చూసుకున్నాడు. కండలు తిరిగి ఉన్న తాయెత్తును చూసుకున్నాడు. తరవాత ఆ సిపాయిల వంక చూసి, 'కూలికి యుద్ధం చేసే ఈ నాచు వెధవలకు లొంగిపోవడమా?' అనుకున్నాడు. తను నిలుచుని ఉన్న చోటునుండి కుప్పించి ఎగిసి, వాళ్ళనిద్దర్నీ ఒక్కసారిగ ఢీమని తన్నాడు. తుపాకులను జారవిడిచి వాళ్ళిద్దరు వెల్లకిల పడ్డారు. అతడా తుపాకులను తీసి నాలుగు నిలువుల ఎత్తున్నగోడ కవతల గిరవాటుపెట్టాడు. ఇంతలో వాళ్ళిద్దరు లేచి అతని మీద విరచుకు పడ్డారు. అతడు వారితో ఘోరమైన యుద్ధం జరిపాడు. ఆ ముగ్గురి ముష్టిఘాతాలతో, మోకాటి పోట్లతో, మూలుగులతో, హాహాకారాలతో ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించింది. యుద్ధం ముగిసేటప్పటికి వాళ్ళిద్దరిలో ఒకడికి తుంటి బెణికింది. మరొకడికి మోకాలు బెణికింది. వాళ్ళిద్దరు బెణికిన కీళ్ళను నెట్టుకుంటూ రోడ్డు దాటుకుని తమ డేరాలవైపు సాగిపోయారు.

ఆ యిద్దరినీ కూలదోయడంలో తానుపయోగించిన పద్ధతులను వివరంగా మననం చేసుకుంటూ ముసలివాడు సుంకేసు చెట్టుమీద కూర్చున్నాడు. క్రమంగా అతని మనసు ఉల్లాసాన్ని సంతరించుకున్నది. కడుపునిండ పాలు కుడిచిన పసిపాపవలె కేరింతలు కొట్టసాగింది. 'నేను ఉత్సాహాన్ని, మనోధైర్యాన్ని కలిగి ఉండడం చాల అవసరం. అర్ధరాత్రి దాటి చాలసేపయింది. ఇది మొదలు వేగుచుక్క పొడిచేదాక క్రూరమృగాల బెడద ఎక్కువగా ఉంటుంది' అనుకున్నాడతడు.

'తోటివాడిని చంపి పడవేసినంత మాత్రాన శత్రువు అందరినీ నిర్మూలించేసినట్టుకాదు. భీకరమైన పోరాటానికి నేను సన్నద్ధుడనై ఉండాలి.' అనుకుంటూ అతడు తన రెక్కలను పైకెత్తి మెడను వెనకకు విసిరి వొళ్ళు విరుచుకున్నాడు. రణోత్సాహం అతనిలో ఉబుకుతున్నది. అతని కుడిచేతి పిడికిలి ముడుచుకుంటూ, తెరుచుకుంటూ ఉన్నది. ఆ వ్రేళ్ళు దేనికోసమో వెదకుతున్నట్లు అతనికి అనిపించింది. అప్పుడతనికి ఈటె జ్ఞాపకమొచ్చింది.

తింట్రపొద వద్ద పడి ఉన్న నక్క తలలో ఈటె గుచ్చుకుని ఉన్నది. 'నేను నిరాయుధుడనై ఒక క్షణమైనా ఇక ఉండడానికి వీలుపడదు' అనుకుంటూ ముసలివాడు కొమ్మమీద నుండి బోదె వైపుకు కూర్చునే జరగసాగాడు. బోదె నుండి కొమ్మ ప్రారంభమవుతున్న చోట అతడు కూర్చున్నాడు. అతనికి సుక్కపంది కోరలు జ్ఞాపక

మొచ్చాయి. తన తొడల వైపు చూసుకున్నాడు. 'ఈటెను తీసుకుని పంది కోరల నుండి తప్పించుకుని రావడంలోనే ఉంది నా చాకచక్యం' అనుకుంటూ అతడు తీంట్రపొదలోకి చూశాడు.

సుక్కపంది ముట్టెని నేలమీద వేసుకుని మౌనంగా, నిశ్చలనంగా పడుకుని ఉన్నది. దాని వీపుమీది గాయం నుండి రక్తస్రావం ఆగిపోయి ఉంది. గాలి తీంట్రపొద వైపు నుండి మందంగా వీస్తున్నది.

ముసలివాడు కొమ్మ మొదటన కూర్చుని, 'గాలి ఆగగానే కిందకు దిగుతాను. మళ్ళీ గాలి ప్రారంభంకాక ముందే ఈటెను దొరక బుచ్చుకుని చెట్టెక్కుతాను' అనుకున్నాడు.

చెట్లకొమ్మలు మెల్లగ కదులుతున్నాయి. బూరుగ దూది బంతులు బంతులుగా గాలిలో తేలియాడుతున్నది. ముసలివాడు చెట్లకొమ్మలను, బూరుగదూదిని గమనిస్తూ కూర్చున్నాడు.

కొంత సేపటికి గాలిగప్పున అణగారి పోయింది. చెట్ల కొమ్మలు నిశ్చలమయ్యాయి. బూరుగదూది మెల్లగ కిందకు దిగసాగింది. ముసలివాడు లాఘవంగా, చప్పుడు కాకుండా కొమ్మమీద నుండి కిందకు దూకాడు. క్షణ మాలస్యం చెయ్యకుండా ఉరికి నక్కతలలో ఉన్న ఈటెను లాగి చేతబట్టుకుని మెరుపువలె వెనుదిరిగి చెట్టెక్కి కూర్చున్నాడు.

'గాలి దేవుడు నన్ను దయ చూశాడు. ఈసంటే నేను చెట్టు దిగడానికి సాహసించి ఉండేవాడిని కాను. ఒక వేళ దిగి ఉన్నా పంది చేత కాట్లు తినకుండా ఉండేవాడిని కాను'' అనుకున్నాడతడు.

బూరుగదూది బంతులు ఒక్కటొక్కటిగ భూమి మీదకు వాలుతున్నాయి.

ఈటె చేతిలోకి రావడంతో తన యుద్ధ సన్నాహాలన్నీ పరిపూర్ణమైనట్లు ముసలివానికి అనిపించింది. ఆ ఈటె దాదాపు ముప్పైఏండ్ల క్రితం అతనికి స్వంతమయింది. అప్పట్లో దాని పొడవు ఇప్పటికన్నా జానెడు ఎక్కువ ఉండేది. అవిరామంగా ఉపయోగిస్తుండడం వల్లను, సాన బెడుతుండడం వల్లను అది జానెడు కుంగిపోయింది. ఈటె చేతిలో లేకుండా అతడెప్పుడూ గుడిసెను వదిలేవాడు కాడు. దాని నతడు తన అంగాంగాలలో ఒకటిగ భావించేవాడు.

ముసలివాడు ఈటెను తన వొడిలో అడ్డంగా ఉంచుకుని కూర్చున్నాడు. 'ఈ సన్నాహాలన్నీ అనవసరమేమో. ఇక క్రూర మృగాలేవీ తీంట్రపొదపైన దాడి జరపకపోవచ్చు. శేషరాత్రి ప్రశాంతంగా గడచిపోవచ్చు.' అనుకున్నాడతడు. 'అది అసంభవం. ఏ ప్రాణి జీవితంగాని శత్రుభీతి లేకుండా గడపడం ఏ యుగంలోనూ జరగలేదు.' అని అతడు తనను తాను ఖండించుకున్నాడు.

## 19

సుంక్రేసు చెట్టు వెనకనున్న పొదలోనుండి జెముడుకాకి ''గూ గూ – గూ గూ'' అని అరుస్తూంది, అది మిడతలను తిని అజీర్తితో మూలుగుతూంది.

ఉన్నట్టుండి పిశాచాల ఆగమనాన్ని సూచిస్తున్నట్టు గాలి ఉద్రుతంగా వీచసాగింది. బూరుగ దూది బంతుల్లు గాలిలో తేలుతూ పరిగిడుతున్నాయి. చెట్ల కొమ్మలు ఒకదాని కొకటి రాచుకుని కీచుకీచుమని సందడి చేస్తున్నాయి. ఈ సందడిలో సుదూరంలో ఎక్కడో కొన్ని నక్కలు ఊళ వేయడం ముసలివానికి వినిపించింది.

అతని వొళ్ళు ఝల్లుమన్నది. వీపుమీద కొరడా తాకినట్టు అతడు వెనుదిరిగి చూశాడు. కనుచూపు మేరలో అసంఖ్యాకంగా నల్లని పొదలు గుహలు పాపాలు రాసిపోసి ఉన్నట్టుగా అతనికి కనిపించాయి. నక్కలు మాత్రం కనిపించలేదు.

క్రమక్రమంగా నక్కల ఊళలు అధికం కాసాగాయి. ఒకదానినొకటి తరుముకుని వచ్చే సముద్ర కెరటాలవలె ఆ ఊళలు ఒకదానివెంబడి మరొకటి వినబడుతున్నాయి. అలా కొంతసేపు అవి వంతుల ప్రకారం అరచి పిదప ఒక్కుమ్మడిగా ఏక కంఠంతో అరవడం ప్రారంభించాయి. వాటి మనసులలోని విషం ధ్వని తరంగాలుగా మారి అడవినంతటిని మాడబెడుతున్నట్లు ముసలివానికి అనిపించింది.

అతని అరికాళ్ళలో చెమటలు పోస్తున్నాయి. నోరు ఎండిపోతున్నది. 'ఒకటే, రెండూ కాదు. పదులు, ఇరవైలుగా వస్తున్నాయి. బహుశా యాభై ఉంటాయేమో' అనుకున్నాడు అతడు.

క్రమక్రమంగా ఊళలు దగ్గరయ్యాయి. అతడు జంకుతూ ఊళలు వినవస్తున్న దిశగా చూశాడు. గుంటనక్కలు లోయనంతటినీ పరచుకుని ఉన్నాయి. అవి నిర్భీతిగా, నిష్పంకోచంగా లోయనెక్కి, తీంట్ర పొదవైపు సాగి వస్తున్నాయి.

''యాభైకిపైగా ఉంటాయి'' అనుకున్నాడు ముసలివాడు. వాటిని లెక్కపెడుతూ సమయాన్ని వృథాచేయడం అతనికి ఇష్టంలేదు. అతని కుడిచేతి వేళ్ళు ఈటెచుట్టూ బిగుసుకున్నాయి.

కొండవంటి మేఘం ఒకటి చంద్రుని కడ్డంగా వచ్చి నిల్చుంది. ఆ మేఘాన్ని తరిమి వెయ్యడానికి ప్రయత్నిస్తున్నట్లు గాలి ఉధృతంగా వీస్తున్నది. చంద్రుడు మేఘాచ్ఛాదితుడు కావడంతో ఏర్పడిన మసకను పారద్రోలడానికి చుక్కలు ప్రయత్నిస్తూ వెలుగుతున్నాయి.

నక్కలు వలయాకారంగా తీంట్రపొద చుట్టూ నిలుచున్నాయి. క్రమక్రమంగా ఆ వలయం చిన్నది కాసాగింది.

''నాకు వోటమి తప్పేట్లులేదు'' అనుకున్నాడు ముసలివాడు. 'ఇన్ని నక్కలను నా చేతిలోని ఒకే ఒక ఈటెతో నేను చంపగలగడం అసంభవం. ఈటెకు బదులు నా చేతలో పంగల కర్ర ఉండిఉంటే బాగుండును,'' అనుకున్నాడతడు. 'అసంబద్ధమైన ఆలోచనలను తలలోనికి రానీయకు. నీ చేతిలో లేని పంగలకర్రను గురించి ఆలోచించకు. నీ చెంతలేని పిల్లవానిని గురించి ఆలోచించకు.' అనుకున్నాడతడు.

నక్కలు తీంట్ర పొదకు బాగా సమీపానికి వచ్చాయి. వాటి వాసనను గ్రహించి. వాటి అలికిడి విని సుక్కపంది పొదలో లేచి నిలుచుంది. ఉన్నపాటున శత్రువులమీద విరుచుకపడి చీల్చి






# ఇవేమన పద్యాలు




**లోభివాని జంప లోకంబు లోపల**
**మందు వలదు వేఱె మతము గలదు**
**పైకమడిగినంత భగ్గున బడిచచ్చు**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

చెండాడాలనే ప్రతీకారంతోను, సలుగులను వదలి పెట్టలేని మమకారంతోను అది ఉక్కిరిబిక్కిరి అవుతూ పొదలో ఇదుగులాడసాగింది.

అప్పుడు దిగంతాలవద్ద మెరిసినట్టుగ, ముసలివాని మనసులో ఒక ఆలోచన పొడ సూపింది. ఫెళఫెళార్భాటాలు చేసే ఉరుమును వెంటవేసుకుని ఆకాశాన్ని పాయలుపాయలుగా చీల్చే మెరుపువలె ఆ యోచన అతని `మనసు

## అతడు అడవిని జయించాడు

నంతటిని ఆవరించింది. విషపు ముండ్లు దిగినట్లు అతడు నిలువెల్ల కంపించాడు. కణతలవెంబడి చెమట జారసాగింది.

అతడు కుడిచేత్తో ఈటెను పైకెత్తాడు. కుడిభుజం వణికింది. ఎడమచేత్తో కుడిభుజాన్ని చరిచాడు. 'ఇప్పుడు నాముందు ఒక ఘోరాతిఘోరమైన సంఘటన జరగబోతున్నది. కురుక్షేత్రంలో ఇలావంతుడు వలె నేను ప్రేక్షక మాత్రుడుగా ఉండలేను. నా ఆచరణలో కించిత్తు లోపంగాని, ఆలస్యంగాని జరగడానికి వీలులేదు. ఈ క్షణాన నా జీవితం మహోన్నతమైన వేగాన్ని పుంజుకున్నది' అనుకున్నాడతడు. అతడు మరొకసారి ఎడమచేత్తో కుడిభుజాన్ని చరిచాడు. పండ్లు కరచుకుని పుష్టికొద్దికి ఈటెను సుక్కపంది మీదకు విసిరాడు.

ఈటె రివ్వుమని గాలిని కోసుకుంటూ వెళ్ళి పంది ఎడమ డొక్కలో దూరి కుడి డొక్కలో బయటకొచ్చింది. అది అడవి దద్దరిల్లేలాగ అరుస్తూ పొదలోనుండి బయటకు దూకి పచ్చగడ్డిమీద దొర్లసాగింది.

ఈటె పంది దేహంలోకి దిగడము, ముసలి వాడు చెట్టునుండి కిందకు దూకడము ఏక లిప్తలో జరిగాయి. కిందకు దూకిన అతడు నక్కలవైపు తిరిగి భయం గొలిపేలాగ అరచి, వంగి రెండు చేతుల్లోకి రెండు రాళ్లను తీసుకుని నడుమెత్తాడు. నక్కలన్నీ దిక్కుకొక్కటిగా పలాయన మవుతుండడం అతనికి కనిపించింది. తోకలను తొడల సందున ఉంచుకుని అవి పరిగిడుతుండగా వాటి వెనక దుమ్ము మేఘంవలె లేస్తున్నది. వాటి కాళ్ళకు తగిలి గులకరాళ్ళు ఒకదానిమీదొకటి పడి నిప్పు రవ్వలు పుట్టుతున్నవి. పిరికితనంతో, ప్రాణ భయంతో పరిగిడుతున్న వాటికేసి అతడు అసహ్యం, జుగుప్స నిండిన కళ్ళతో చూస్తూ నిలుచున్నాడు. అవి కనుమరుగయ్యాక అతని చేతిలోని రాళ్ళు కింద పడ్డాయి.

అతడు నడుము, మోకాళ్ళు వంగుతుండగా నడిచి సుక్కపందిని సమీపించాడు. అది నల్ల గుండువలె నిశ్చలనంగా పడి ఉంది. దాని రొమ్ము కడ్డంగా ఈటె గుచ్చుకుని అలాగే ఉన్నది. దాని పక్కలు, జబ్బలు రక్తంతో తడిసి ఉన్నాయి.

ముసలివాడు తన రెండు చేతులను ఈటె చుట్టూవేసి ఎడమ పాదాన్ని దాని ముట్టెమీద వేసి ఒకసారి పెద్దగా ముక్కి ఈటెను ఊడ లాగాడు. గడ్డకట్టిన నెత్తురు ఈటె మొన వెంబడి జారుతుండగా దానినతడు చంద్రుని కడ్డంగా పైకెత్తి పట్టుకుని, రుద్ధమైపోతున్న కంఠంతో గట్టిగా, "సుక్కపందిని సంపుకుంటే, చేజేతులా సంపుకుంటే." అనరచాడు. తరువాత అతడు ఈటెను భూమిలోకి కస్సుమని దిగవేసి, దానిపైన చేతులు వేసుకుని తగ్గుస్వరంతో, "వేరే దోవ లేకపోయె సలుగుల్ని కాపాడుకునే దానికి వేరే దోవ లేకపోయె" అన్నాడు.

చంద్రుడు మబ్బు చాటు నుండి బయటికొచ్చాడు. గాలి యధాప్రకారం పిశాచాల నాట్యానికి వంత పాడుతున్నట్లు సందడి చేస్తూ వీస్తున్నది.

**(ఇంకా వుంది)**

# అసలైన, సిసలైన

# గ్లూకోన్-డి®

# ఒక్కటే. దానిని తయారు చేయువారు గ్లాక్సో.

మీకు పరిచయమైన ఆకుపచ్చ ప్యాకెట్ పై తెలుపు అక్షరాల్లో వున్న **గ్లూకోన్-డి**® కోసం చూడండి.




చౌకబారు నకిలీ సరుకుల్ని కొని మోసపోకండి. అది మీ కుటుంబ ఆరోగ్యానికే హానికరం, అందుకే గ్లాక్సో వారి అసలైన గ్లూకోన్-డినే కొనండి. గ్లాక్సో వారి గ్లూకోన్-డి, శుద్ధమైన గ్లూకోజ్ పౌడర్‌తో పాటు విటమిన్ డి-2, భాస్వరం మరియు కాల్షియంలతో బలపరచబడిన నమ్మకమైన ఉత్పాదన,

కోట్లాది ప్రజలు వాడతారు దీన్ని—అవసరమైనప్పుడల్లా శక్తి కోసం.

గ్లూకోన్-డి రకరకాల ఆహార పదార్థాలకు, ప్రాణ రక్షణకు వాడే ఔషధాలకు, మందులకు పేరెన్నికగన్న గ్లాక్సో కంపెనీచే తయారుచేయబడుతోంది.

మీరు కొనే గ్లూకోన్-డి ప్యాకెట్ అసలైనదే అని నిర్ధారణ చేసుకోండి.

## గ్లూకోన్-డి® తిరిగి శక్తి నిచ్చేందుకు నమ్మకమైనది.

® ట్రేడ్ మార్క్

HTB-GLL-7027-TC




## లాభసాటి వేషం!

ఏప్రియల్ 11వ తేదీన మధ్యాహ్నం భోజన సమయంలో గోపాల్‌గంజ్ కలెక్టరేటులోని మెజిస్ట్రేటు హాలులో గద్దె దిగుతున్న మెజిస్ట్రేటు యం. పి. యన్. శర్మ భుజానికో వస్తువు తగిలి ధామ్మని పేలి, ఆయన వుత్తరక్షణంలో రక్తపు మడుగులో విలవిల్లాడి చనిపోయారట. అది విసిరిన పరమహంస్‌యాదవ్ అనే వ్యక్తిని చూపరులు, ఆ శర్మగారి తమ్ముడు పట్టుకున్నారట. తాను సంత్‌జ్ఞానేశ్వర్ ఆజ్ఞపై శర్మను చంపినట్టు యాదవ్ వొప్పుకుని, ఆనక కోర్టులో రివాజుగా లేదని బుకాయించాడట.

న్యాయవృత్తిలో కాశి విశ్వవిద్యాలయంలో 1973లో పట్టం పుచ్చుకున్న జ్ఞానేశ్వర్ ఆ వృత్తిలో రాణించక, స్వామీజి వృత్తి చేపట్టి, రాజకీయ, ధనిక అండదండలు సంపాదించి గోపాల్‌గంజ్‌లో ప్రభుత్వ స్థలాన్ని ఆక్రమించి "ఆహ" అనే పద్ధతిలో అధునాతన ఆశ్రమం నిర్మించుకున్నాడట. ఈయనమీద గతంలో వో హత్యానేరం కూడా వున్నదట. జడ్జి శర్మగారు తన పరివారంతో యీ ఆశ్రమంమీద దండెత్తి కొన్ని నాటుబాంబులను, మారణాయుధాలను, నగ్న సుందరుల ఫొటోలను, కామక్రీడల ఫొటోలను, వో 26 మంది సుందరీమణులను పట్టుకుని, ఆ సంత్ జ్ఞానేశ్వర్‌కు జైలుశిక్ష యిచ్చారట.

ఈ పగతో జ్ఞానేశ్వర్ యీ పని చేయించి వుండివుంటారని పోలీసు కథనం. హత్య జరిగిన నాటి వుదయం పరమహంస్ యాదవ్ జైలులో వున్న సంత్ జ్ఞానేశ్వర్ని కలిశాడట — టూ ప్లస్ టూ! ఫోరే కదా! అంతే! లోగొట్టు... లాగితే రట్టు.

## అలప్యంగా పెళ్ళైతే అతి చురుకైన పిల్లలు!

అతి చురుకైన పిల్లలు పుట్టాలంటే ఆ తండ్రిగారికి మూడు పదులు నిండి తీరాలనీ, ముప్ఫయి దాటేకనే తెలివి తేటలకు సంబంధించిన కణాలు మనిషిలో అధిక వుత్పత్తిని పొందుతాయని రష్యను శాస్త్రజ్ఞులు ప్రకటించారట. ఐన్‌స్టీన్ వంటి మేధావి తన తండ్రికి 32 వ ఏట పుట్టాడట.

## ఉమ్మడి పంపు తగాదాలో ఒక వ్యక్తి బలి!

ఢిల్లీలో వో యింటిలోని వుమ్మడి పంపు వద్ద నీళ్ళు పట్టుకోడంలో ఆడవారికి తగాదా వచ్చి, అది స్థాయి, తాళం మారిందట. దాంతో హెచ్చుస్థాయిలో ఆ ఆడవారికి చెందిన మగవారాట ఆరంభించి, చేతులు కలిపారట. ఆ ఆటలో 19 ఏళ్ళ రాజకుమార్ అనే అతను చనిపోయాట్ట.

## హత్యకి దారితీసిన అవమానం!

తంజావూరుకు చెందిన 20 ఏళ్ళ కళైవణ్ణన్ పని కావాలని వెళ్తె ఆవూరు కళనివాసల్ మిరస్తాదారు 35 ఏళ్ళ బాలేంద్రన్ లేదుపో అన్నాడట. అతని భార్య చంద్ర మొగుడికి వంతపాడి, కళైవణ్ణన్ను అవమానించిందట. దాంతో వొళ్ళుమండిన ఆ కళైవణ్ణన్ తోటలో నిద్రపోతున్న బాలేంద్రనను, అతని భానమరది దొరైరాజును కత్తితో పొడిచి చంపేశాడట. ఆనక తానుగా వెళ్ళి పోలీసులకు లొంగిపోయాడట.

## రికార్డు సృష్టించిన ఉద్యోగి!

బ్రదర్ పీటర్ అనే వొహతను 1913 సెప్టెంబరు 12వ తేదీన కొడ్డికెనాల్‌లో నెలకు పది రూపాయల జీతంమీద పోస్టలు డిపార్టు—మెంటులో చేరి, మొన్న 1982 ఆగస్టు 28వ తేదీన దిండిగల్లులో యధేచ్ఛగా రిటయిరయ్యారట. ఈయన పోస్టల్ డిపార్టుమెంటులో 68 సంవత్సరాలు సర్వీసుచేసి ప్రపంచ చరిత్రనే సృష్టించారట. రిటైరయ్యేనాటికీయన జీతం 210 రూపాయలట— అయ్యో! అందులోనూ ప్రపంచ చరిత్రా ఏవిటి!

## ప్రేమికుల ప్రాణత్యాగం!

వాళప్పాడికి చెందిన 23 ఏళ్ల రాజేంద్రన్ అనే వో యువకుడు అదే వూరుకు చెందిన 17 ఏళ్ళ మాదేశ్వరి అనే అమ్మాయిని ప్రేమించి, ప్రేమింప చేసుకున్నాడట. వారి ప్రేమ ఆయిన వారికెవరికి తెలియకుండా రెండేళ్ళు కొనసాగిందట. ఇది వివాహ రూపం దాల్చడానికి వారిరువురి తలిదండ్రులూ వొప్పుకోలేదట. ఛస్తామని బెదిరిస్తే చచ్చినా చెయము, వొప్పము, ముడియాదు అన్నారట. దాంతో విషంకొని, యిద్దరూ కూడ బలుక్కుని, తమ తమ యిళ్ళకు వెళ్ళి, వుత్తరాలురాసి, ఒకే టయిముకు విషం త్రాగి చనిపోయారట. ★






# రైతుల పాలిటి కల్పతరువు
# రామగుండం యూరియా




ఆంధ్రప్రదేశ్ లో తయారు చేయబడుతున్న
యూరియా. రామగుండం యూరియా.
అన్ని పంటలకు. అన్ని కాలములకు అనువైన ఎరువు.

వాడండి
రామగుండం యూరియా.

## స్వస్తిక్ బ్రాండ్
## యూరియా




**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్**
**ఆఫ్ ఇండియా లిమిటెడ్**

అమ్మకపు విభాగము
6-2-30/C, లకిడి కా పూల్.
హైదరాబాదు-500 004.

Sobhagya

# జీవన్మృతులు




ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్

## ( డాక్టర్ సెవార్డు డైరీ )

వాన్‌హెల్సింగ్ టెలిగ్రాం చదివిన తర్వాత జోనాధన్ అన్నాడు "దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి, అతను వస్తున్నాడు ..."

వెంటనే వాన్‌హెల్సింగ్ అతని వంక తిరిగి అన్నాడు "ఏది ఎప్పుడు చెయ్యాలో దేవుడికి తెలుసు. మనకి భయంలేదు. అట్లా అని మనం అప్పుడే సంతోషపడటానికి లేదు. మనం ఏ క్షణం కోసం ఎదురు చూస్తున్నామో అది జరక్కపోవచ్చు."

"ఏమయినా ఫర్వాలేదు. ఆ రాక్షసుడు ఇక్కడికి రాగానే మట్టుపెట్టేస్తాను, నా ప్రాణం పోయినా సరే" అన్నాడు జోనాధన్ చాలా తీవ్రంగా.

"ష్ష్! అరవకు నాయనా! దేవుడి దయ వుంటే అన్నీ సవ్యంగా జరుగుతాయి. మేడమ్ మినామీద మీకున్న ప్రేమ నాకు తెలుసు. ఇప్పుడు

## ( గత సంచిక తరువాయి )

మీ ప్రాణత్యాగం గురించిన మాటలు ఆమె విన్నదంటే, ఎంత బాధపడుతుందో వూహించారా? మా గురించి సందేహాలు పెట్టుకోవద్దు. మేం అంతా ఈ పనిమీదే వున్నాం. ఆ రాక్షసుడికి ఇప్పుడు శక్తులు లేవు. మామూలు మనిషిలా ప్రవర్తిస్తాడు. సూర్యాస్తమయం లోపు అతని రూపం కూడా మార్పు చెందకపోవచ్చు. అతను ఇక్కడికి రావటానికి కాస్త టైం పడుతుంది. ఇప్పుడు టైం ఒకటీఇరవై అయింది. ఆర్థర్, క్విన్సీమోరిస్‌లు, డ్రాకులా కన్నా ముందు వస్తే బాగుండు" అన్నాడు వాన్‌హెల్సింగ్.

మినా టెలిగ్రాం వచ్చిన అరగంట తర్వాత, తలుపు తట్టిన చప్పుడయింది. ఆ తలుపు చప్పుడు చాలా మామూలుగా వుంది. ఎక్కువ మంది అట్లాగే కొడతారు. ఒక్కక్షణం ప్రొఫెసర్ గుండె, నా గుండె గట్టిగా కొట్టుకోసాగాయి. ఒకరి మొహాలు ఒకరు చూసుకుని, హాలు మధ్యలోకి వెళ్ళాం. ఇద్దరం అన్నీ సిద్ధం చేసుకున్నాం. చేతుల్లో శిలువ, దేవుని బొట్టు వున్నాయి. వాన్‌హెల్సింగ్ ముందుకు అడుగువేసి తలుపు గడియతీసి, తలుపును కొద్దిగా తీసిపట్టుకున్నాడు, ఎదుర్కోడానికి సిద్ధంగా. వాళ్ళిద్దర్నీ చూడగానే, ఒక్కసారి మా గుండెలు తేలికపడ్డాయి. ఆర్థర్, క్విన్సీమోరిస్ లోపలికి వచ్చారు గబగబా. వెంటనే తలుపు వేసేసారు.

మాతోపాటు హాలులోకి వస్తూ ఆర్థర్ అన్నాడు "అంతా బాగానే జరిగింది. రెండు ప్రదేశాలకూ వెళ్ళాం. ఒక్కోచోట ఆరు పెట్టెలున్నాయి. అన్నిటినీ చెడగొట్టేశాం."

"ఏమిటీ, చెడగొట్టేశారా?" అడిగాడు వాన్‌హెల్సింగ్.

"అంటే, అతని దృష్టిలో" అన్నాడు ఆర్థర్.

ఒక నిముషం తర్వాత క్విన్సీ అన్నాడు "ఇప్పుడు మనం చెయ్యగలిగింది ఏమీలేదు, అతని కోసం ఎదురు చూడటం తప్ప. అయిదు గంటల లోపు అతను ఇక్కడికి రానట్టయితే, మనం బయలుదేరి వెళ్ళాలి. ఎందుకంటే; చీకటిపడ్డ తర్వాత మిసెస్ మినాను ఒంటరిగా వదిలేయటం మంచిదికాదు."

వాన్‌హెల్సింగ్ తనదగ్గరవున్న చిన్న నోటు బుక్ తీసి చదువుకుని అన్నాడు —

"ఇక కాసేపట్లో రావచ్చు. మేడమ్ మినా టెలిగ్రాం ప్రకారం డ్రాకులా కార్‌ఫాక్స్‌నుంచి దక్షిణంవేపు దారిపట్టాడు. అంటే నది దాటాలి. ఒంటిగంటలోపు అతను ఆ పని చెయ్యలేదు. అతను దక్షిణంవేపు వెళ్ళాడంటే మరో అర్థం వుంది. అతనికి కాస్త అనుమానం వచ్చి వుంటుంది. అందువల్ల, తన వునికి తెలియని చోటు వెళదామని అనుకుని వుంటాడు. అతను ఇక్కడికి ఇంకా రాలేదంటే, అదే అర్థం. అతను మైలెండు ప్రాంతం వెళ్ళివుంటాడు. అందు

**జరిగిన కథ — 32 :** వాన్‌హెల్సింగ్, మోరిస్, జోనాధన్ డ్రాకులా ఇంటి తాళం తీసారు. ఆ ఇల్లు సకల రోగాలతో ఉన్నట్లు, రక్తపు వాసనలతో పరమ రోతగా ఉంది. అక్కడ యాభయికి ఇరవై తొమ్మిది పెట్టెలు మాత్రమే ఉన్నాయి. అక్కడ ఉన్న వేనకువేల ఎలుకలను కుక్కల సహాయంతో తోలేసారు. డ్రాకులా ఇంటిలో ఏం జరిగిందో మినా తెలుసుకోవాలనుకుంటుంది. జోనాధన్ శామ్ బ్లోగ్జామ్ ద్వారా మాయమయిన తొమ్మిది పెట్టెల ఆచూకీ తెలుసుకుంటాడు. డ్రాకులానే అక్కడక్కడ పెట్టెలు సర్ది పెట్టేస్తున్నాడని తెలుసుకుంటాడు. రెన్‌ఫీల్డ్‌కు ఆత్మలంటె భయమని డ్రాకులాను అతను కలిసేఉంటాడని, ఏదో కొత్త పథకం ఉందని అనుకుంటాడు డాక్టరు సెవార్డ్. డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన్‌హెల్సింగ్, ఆర్థర్, క్విన్సీమోరీస్‌లకు మిస్టర్ రెన్‌ఫీల్డు తన కల గురించి చెపుతాడు. డాక్టర్ సెవార్డ్, డాక్టర్ వాన్‌హెల్సింగ్, ఆర్థర్, క్విన్సీమోరిస్ మినా గదిలో జోనాధన్ క్రిందపడి ఉండటం చూస్తారు. మినా చేత తన రక్తాన్ని త్రాగిస్తున్న డ్రాకులాను చూసి వీరందరు భయభ్రాంతులవుతారు. వాన్‌హెల్సింగ్ మినాను అసలు ఏం జరిగిందో అడుగుతాడు. ఆమె తనకు జరిగిన భయంకరమైన అనుభవాన్ని చెపుతుంది. రెన్‌ఫీల్డ్ నేలమీద కుప్పలాపడి ఉంటాడు. అతడు మంచంమీద నుంచి క్రిందపడి చనిపోయినట్లు సర్టిఫికేట్ ఇవ్వటానికి నిశ్చయించుకుంటాడు డాక్టరు సెవార్డు. అందరు కలసి పికడిల్లీలోని డ్రాకులా ఇంటిని వెదకాలని నిర్ణయించుకుంటారు. అందరూ కలసి డ్రాకులా ఇంటిలో ప్రవేశిస్తారు. వాన్‌హెల్సింగ్ జోనాధన్‌కు డ్రాకులా శక్తి, అతను చేసే ప్రమాదాల గురించి చెప్పసాగాడు. డ్రాకులా వీరి కోసం వెతుకుతున్నట్లు మినా టెలిగ్రాం పంపిస్తుంది.

వల్ల ఆలస్యం జరిగివుంటుంది. కాబట్టి ఇక మనం ఎక్కువసేపు వేచివుండే అవసరంలేదు, మనం సిద్ధంగా వుండాలి అతనితో తలపడ్డానికి. అతన్ని వదలకూడదు, ష్ ష్! ఇక టైంలేదు. మీ ఆయుధాలతో సిద్ధంగా వుండండి.''

వాన్‌హెల్సింగ్ చెయ్యెత్తాడు హెచ్చరికగా. బయట తలుపు తాళంతీసిన చప్పుడవుతోంది.

దాడిచేసే విషయాల్లో క్విన్సీ మోరిస్ ఎప్పుడూ ముందు వుంటాడు. అతను చక్కగా ప్లాన్ వెయ్యగలడు. ఆ విషయంలో అతన్ని చూస్తే నాకు గొప్ప ఆరాధనాభావం కలుగుతుంది. ఆర్థర్, నేనూ అతను చెప్పినట్టే చేయటం మా పని. అతను వెంటనే, ఒక్కొక్కర్ని ఎక్కడ నిలుచోవాలో చెప్పాడు, సైగల ద్వారా. వాన్‌హెల్సింగ్, జోనాథన్, నేనూ తలుపుచాటున వున్నాం, ఎందుకంటే, ఆ డ్రాకులా లోపలికి వచ్చినపుడు, మళ్లా తిరిగి వెళ్లిపోకుండా. ఆర్థర్,



క్విన్సీమోరిస్ వెనకవున్నాడు. ఇద్దరూ కనపడకుండా కిటికీదగ్గర దాక్కున్నారు. క్షణాలు గడుస్తున్నాయి. మాలో ఆత్రుత ఎక్కువయింది. హాలువేపుకు వస్తున్న అడుగుల చప్పుడు వినవచ్చింది. డ్రాకులాకూడా సిద్ధపడే వచ్చి వుంటాడు, అనిపించింది.

హఠాత్తుగా, ఒక్క గెంతులో డ్రాకులా హాల్లోకి వచ్చి గబగబా వెళ్లిపోయాడు ముందుకు, మేం అతన్ని ఆపేలోగా. అతని రాక ఏదో చిరుతపులిలా వుంది. రెప్పపాటులో జరిగింది. ఇట్లా జరిగినందుకు క్షణకాలం అచేతనంగా వుండిపోయాం.

మాలో ముందు కదిలినవాడు జోనాథన్. ఒక్క గెంతులో ఇంటిముందు గదిలోకి వెళ్లాడు. డ్రాకులా మమ్మల్ని చూసాడు. అట్లా చూసినప్పుడు కుక్కలా గుర్రుమన్న శబ్దం వచ్చింది. చిన్నగా నవ్వాడు. నవ్వినపుడు అతని కోరలు కనిపించాయి. నవ్వు వెంటనే మాయమయింది.

మేం అతని ముందుకు రాబోతుండగా, అతని మొహంలో మార్పు వచ్చేస్తోంది. ఆ దాడి సమయంలో మాకు మరింత మంచి ఆలోచన రానందుకు దిగులేసింది. ఏంచెయ్యాలో వెంటనే తోచలేదు. మా వద్ద వున్న మారణాయుధాలు అతనిమీద ఎంతవరకు పని చేస్తాయో నాకు తెలియలేదు; జోనాథన్ తన దగ్గరున్న కత్తితో ప్రయత్నించాడు. దానిని బలంగా అతని మీద




ప్రయోగించాడు. డ్రాకులా మెరుపులా తప్పుకోడం వల్ల కత్తిదెబ్బ తగల్లేదు. కానీ కత్తి కొస అతని గుండెల మీద కోటును పెద్దగా చీరింది. వెంటనే అక్కడ్నించి బాంక్ నోట్లు, బంగారు నాణాలు రాలిపడ్డాయి. అప్పుడు డ్రాకులా మొహం క్రూరంగా మారింది. అతను జోనాథన్ని ఏమైనా చేస్తాడేమోనని భయపడ్డాను. కానీ జోనాథన్ క్షణం ఆగకుండా డ్రాకులా మీదికి మళ్లీ కత్తిని విసిరేసాడు. నేను కూడా శిలువను, దేవుని బొట్టును పట్టుకుని ముందుకు అడుగు వేసాను. నా చేతుల్లో గొప్ప శక్తి వచ్చినట్టు అనుభూతి పొందాను. డ్రాకులా భయంతో వెనక్కి వెనక్కి నక్కి నడవటం మొదలెట్టాడు. అందరూ నాలాగే అతని మీద దాడి చేసారు. అప్పుడు డ్రాకులా మొహం ఎంత క్రూరంగా, కోపంగా, ద్వేషపూరితంగా వుందో చెప్పనలవికాదు.

అతని కళ్లు నిప్పులు కురిపిస్తున్నాయి. ఆ ఎర్రదనానికి అతని మొహం రంగు మారింది. నుదుటనున్న గాటు మళ్లీ పుండులా కనపడింది. అతను మెరుపులా, జోనాథన్ దెబ్బ పడకముందే, క్రిందికి వంగి, గబగబా చేతికందిన డబ్బు తీసుకుని గదిలో అద్దాల కిటికీ దగ్గరకు పరుగెత్తి, అక్కడ్నించి దూకేసాడు. ఆ కిటికీ అద్దాలు పగిలి పెద్ద చప్పుడయ్యాయి. అతను వుండ చుట్టుకుని క్రింద పడిపోయి వుంటాడు. 'టంగ్' మని బంగారు నాణెం ఒకటి బయట నేలమీద పడ్డ చప్పుడు వినిపించింది.

## కార్టూన్లు పంపేవారికి మనవి

కార్టూన్లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ–3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, వేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్లు 'టపా'లో పోయినా, దారి తప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈ కార్టూన్లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.



## జీవన్మృతులు

గబగబా కిటికీదగ్గరకు పరుగెత్తి బయటకు చూసాం. డ్రాకులా దెబ్బల్లేకుండా మెరుపులా లేచి నిలబడ్డాడు. గబగబా గుర్రపుశాల వేపు నడిచాడు. దాని తలుపు తీసి వెనక్కి తిరిగి అన్నాడు—

"మీరంతా నన్ను ఓడించాలనుకుంటున్నారు కదూ ?— వెర్రి మొహాల్లారా ! మీకు ఏడ్పేరాత వుంది. వుండటానికి నాకెక్కడా చోటు లేకుండా చేసామనుకుంటున్నారుకదూ ? నాకు బోళ్ళన్ని చోట్లు వున్నాయి. మీరంటే ఇప్పుడే ద్వేషం మొదలయింది. శతాబ్దాల తరబడి కాలం నా వైపు వుంది. మీ పని తప్పక పడతాను. మీ అందరి ప్రేమకు పాత్రురాలయిన అమ్మాయిలు నావాళ్ళు అయ్యారు. వాళ్ళద్వారా మీరంతా నా మనుషులవుతారు. నా దగ్గర నక్కల్లా పడి వుంటారు, తిండికోసం."

ద్వేషపూరితమైన అతని మొహాన్ని చూసాం. అతను లోపలికెళ్ళి తలుపువేసి గడియ పెట్టిన శబ్దం వచ్చింది. దానికి అవతలవైపు వున్న తలుపు తీసివేసిన చప్పుడుకూడా వినపడింది.

తర్వాత మాలో మొదట మాట్లాడింది ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్. అతన్ని వెంబడించటం కష్టం అని తెలిసి మళ్ళీ హాల్లోకి తిరిగివచ్చాక—

"మనకి కొంత విషయం తెలిసింది. అతను ధైర్యంగా మాట్లాడినా, మనమంటే భయం. టైం అంటే భయం. లేకపోతే, ఎందుకలా కంగారుపడి పారిపోతాడు ? అతని మాట్లాడిన గొంతుతీరు అతన్ని భయాన్ని చెపుతోంది, నా చెవులు నన్ను మోసగిస్తే తప్ప. డబ్బుకూడా ఎందుకు తీసుకువెళతాడు ? మీరు త్వరగా బయలుదేరండి. మీరే మంచి వేటగాళ్ళు. నేను ఇక్కడ వుండి, ఇతనికి పనికివచ్చే వస్తువు ఏదీలేకుండా చేస్తాను, మళ్ళా ఒక వేళ వస్తే" అన్నాడు వాన్‌హెల్సింగ్.

అట్లా అంటూ, క్రిందిపడ్డ డబ్బు జేబులో వేసుకున్నాడు. జోనాథన్ అతను వదిలేసిన దస్తావేజులు తీసుకున్నాడు. మిగిలిన వస్తువులు దగ్గర్లోవున్న చలికాచుకునే పొయ్యిలో వేసి మంట పెట్టాడు.

ఆర్థర్, మోరిస్ ఇద్దరూ బయటకు పరుగెత్తారు. జోనాథన్ కిటికీలోంచి క్రిందికి దూకాడు, డ్రాకులా వెంటపడటానికి. గుర్రపుశాల తలుపుతీసి లోపలికెళ్ళేసరికి, డ్రాకులా జాడ కనిపించలేదు. వాన్‌హెల్సింగ్, నేనూ ఇంటి వెనక్కి వెళ్ళి అక్కడ విచారించాం. అటువేపు ఎవరైనా వెళ్ళారా అని. ఎవరూ అతన్ని చూసినట్ట్లు కనిపించలేదు.

సాయంత్రం కాబోతోంది. కొద్దిసేపట్లో సూర్యాస్తమయం అవుతుంది. అప్పటికి పని ముగించినట్టు ఒక నిర్ణయానికొచ్చినట్టూ ర్చాం.

"ఇక మేడమ్ మినా దగ్గరకు పోదాం పదండి. పాపం మేడమ్ మినా, ఎలావుందో మన ఇక్కడ చెయ్యగలిగింది చేశాం. ఇక అక్కడికి వెళ్ళి మేడమ్ మినాని రక్షించాలి. జరిగిన దానికి నిరాశ చెందక్కర్లేదు. మనకి ఇంకా ఒక్క పెట్టె ఆచూకీ తెలియాలి. అది తెలిస్తే, అన్నీ సవ్యంగా జరిగి పోతాయి" అన్నాడు వాన్‌హెల్సింగ్. అతను అంత ధైర్యంగా జోనాథన్ని ఓదార్చటం కోసం పలికాడనిపించింది. పాపం జోనాథన్ విచారంగానే వున్నాడు. తన మినాను తలుచుకుంటూ, అప్పుడప్పుడూ బాధగా మూల్గుతున్నాడు.

భారమైన హృదయాలతో ఇంటికి తిరిగి వచ్చాం. అక్కడ మిసెస్ మినా మా కోసం ఎదురు చూస్తూ నిలబడి వుంది. మొహంలో ఎంతో సంతోషం కనపడింది. కానీ మా మొహాల్ని చూడగానే, ఆమె మొహం పాలిపోయింది. ఒకటి రెండు క్షణాలు కళ్ళు మూసుకుంది, ఏదో ధ్యానం చేసుకుంటున్నట్టుగా. తర్వాత అంది—

"మీ ఋణాన్ని జన్మలో తీర్చుకోలేను." జోనాథన్ని చూసి అతని తలను రెండు చేతులతో పట్టుకుని ముద్దుపెట్టుకుని "ఓ డార్లింగ్, నీ తలను నా ఎదమీద ఆనించి "విశ్రాంతి తీసుకో. అన్నీ సవ్యంగా జరుగుతాయి. మనల్ని కాపాడ్డానికి దేవుడున్నాడు. ఎప్పుడు ఏం చెయ్యాలో దేవుడికి బాగా తెలుసు" అంది. జోనాథన్ బాధగా మూలిగాడు. డ్రాకులా తప్పించుకు పోయినందుకు అతనికి ఎంతో బాధగా వుంది.

అందరం భోజనాలకు కూర్చున్నాం. ఆ సమయంలో కాస్త సంతోషం కనిపించింది అందరి మొహాల్లో. ప్రొద్దుట్నుంచి ఏం తినలేదు, పైగా ఇప్పుడు మంచి భోజనం. అందుకే ఆ సంతోషం. ఏమైనా అంత పెద్ద సంతోషంగా లేమని చెప్పాలి. రేపు ఎట్లా జరుగుతుందో అన్న దిగులు. జరిగింది జరిగినట్టుగా, మిసెస్ మినాకు చెప్పాం. ఎంతో ధైర్యంగా, కలత చెందకుండా విన్నది. జోనాథన్ డ్రాకులాను వెంబడించిన తీరు వర్ణించి చెపుతుంటే, ఆమె జోనాథన్ చేతిని తన చేతులోకి తీసుకుని గట్టిగా అదిమింది. అంతా విన్న తర్వాత ఆమె లేచి నిలబడింది. భర్త చేతిని మాత్రం వదల్లేదు.

"జోనాథన్ డియర్, మిత్రులారా, ఈ క్లిష్టపరిస్థితిలో మిమ్మల్ని ఒక్క విషయం గుర్తుంచుకోమని చెపుతున్నాను. మీరు పోరాటానికి సిద్ధపడాలి. సిద్ధపడి సర్వనాశనం చెయ్యాల్సి ఎట్లా అయితే, లూసీ దయ్యాన్ని నాశనం చేసి, స్వచ్ఛమైన లూసీ ఆత్మకు విడుదల కలిగించారో అలా. అంటే ఈ పని ద్వేషపూరితమైనది కాదు. నిజానికి ఎక్కువ విచారపడవలసింది ఈ డ్రాకులా ఆత్మ. ఈ డ్రాకులా దయ్యాన్ని నాశనం చేస్తే, అతని ఆత్మ ఎంత సంతోషిస్తుందో తెలుసా ! అతన్ని చూసి మీరంతా జాలిపడాలి. అట్లా అని అతన్ని నాశనం చెయ్యకుండా వుండమని కాదు" అంది. ఆమె మాటలు ఎంతో

ప్రేమ, ఆర్ద్రత మిళితమైన సంగీత ధ్వనులు అనిపించాయి.

ఆ ట్లా ఆమె మాట్లాడుతున్నప్పుడు, జోనాథన్ మొహం వివర్ణమవటం చూసాను. అతను ఆమె చేతిని మరింత బలంగా అదిమి పట్టుకున్నాడు. ఆ పట్టు ఆమెకు బాధ కలిగించాలి. కానీ ఆమె అట్లా కనిపించలేదు. అతని వంక ఎంతో ప్రేమగా చూసింది.

ఆమె మాట్లాడ్డం ఆపేయగానే, ఆమె చేతిలో నుండి తన చేతిని లాక్కొని అన్నాడు —

"ఆ రాక్షసుడ్ని నా చేతులతో చంపుతాను. అందుకు తగిన శక్తి భగవంతుడ్ని ఇమ్మని కోరుతున్నాను. ఆ శక్తితో వాడి ఆత్మను కూడా నరకానికి పంపుతాను."

"ష్ష్ ! తప్పు అలా అనకూడదు జోనాథన్! దైవభక్తి వున్నవాడివి, అట్లా మాట్లాడ కూడదు. అట్లా మాట్లాడితే నాకు చాలా బాధగా వుంటుంది. ఒక్కసారి ఆలోచించు జోనాథన్. నేను కూడా ఇవాళంతా ఆలోచించాను. బహుశా నాకు కూడా అటువంటి గతే పడుతుందని. నేనూ కూడా దయ్యాన్ని అయి, నీలాంటి వాడి కోపానికి గురి అయితే, నా ఆత్మ ఏమవుతుంది ? మరొక సందర్భంలో అయితే, నీ ఆలోచనకు ఇంత బాధ పడేదాన్ని కాను. అయినా దేవుడు అట్లా చెయ్యడని నమ్ముతున్నాను." అంది మినా.

మా అందరి కళ్లల్లో నీళ్ళు నిలిచాయి. వాటిని ఎవ్వరం ఆపలేదు. అవి మా చెంపల మీద నుంచి జారిపోయాయి. మినా కూడా కన్నీళ్ళు పెట్టుకుంది. జోనాథన్ తన మోకాళ్ల మీద కూర్చుండిపోయాడు, మినా ప్రక్కన, ఆమె నడుం చుట్టూ చెయ్యివేసి. అతని తల ఆమె దుస్తుల్లో మునిగిపోయింది. వాన్‌హెల్సింగ్ సైగ చేయగా, మేం అంతా గదిలోంచి బయటకు వచ్చేశాం, వాళ్లిద్దరికి ఏకాంతం కల్గిస్తూ.

విశ్రాంతి తీసుకునే ముందు, ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ మినా గదిలో కొన్ని ఏర్పాట్లు చేసాడు, పిశాచి డ్రాకులా తిరిగి రాకుండా. నిర్భయంగా ఆమెను విశ్రాంతి తీసుకోమన్నాడు. ఆ అభయానికి ఆమె తృప్తి చెందినట్టుగా కన్పించింది. వాళ్లిద్దరి దగ్గరగా, ఒక గంటను ఏర్పాటు చేసాడు, ఒకవేళ ప్రమాద పరిస్థితుల్లో దాన్ని వుపయోగించటానికి వీలుగా. వాళ్లిద్దర్ని విశ్రాంతి తీసుకోమని చెప్పి, ఆర్థర్, క్విన్సీమోరిస్, నేనూ బయటి కొచ్చాం. ఆ రాత్రి వంతులవారి కాపలా వుండటానికి మేం నిశ్చయించుకున్నాం. ముఖ్యంగా భయాందోళనలతో వున్న మిసెస్ మినా క్షేమం కోసం. నా వంతు కాపలా అయిపోయింది. ఆర్థర్ వచ్చాడు తర్వాత. ఇక నేను నిద్రపోవాలి.

## జోనాథన్ డైరీ :

అక్టోబర్, 3-4 (అర్ధరాత్రి) : నిన్నటి రోజంతా చాలా భారంగా గడిచింది. నాకు బాగా నిద్రపోవాలనిపిస్తోంది. మేం విడిపోయేముందు, తర్వాత కార్యక్రమం ఏమిటే అని కొంత చర్చించాంగానీ, ఏమీ నిర్ణయించకుండానే చర్చ ఆగిపోయింది. మాకు తెలిసిందల్లా ఒక్కటే — అదీ, ఇంకా ఒక పెట్టె దొరకాల్సింది వుంది అని. అది కూడా డ్రాకులాకు తప్ప మరొకరి తెలీదని తెలుసు. దాని విషయం తెలుసుకోలేకపోతే, సంవత్సరాల కొద్దీ డ్రాకులా మమ్మల్ని ఏడిపించేస్తాడు. అప్పుడేమవుతుంది ? ఆ ఆలోచన భయంకరమైనది. ఇప్పుడు ఆలోచించకూడదు. మినా గురించి దిగులు. ఆమె విషాదాన్ని చూస్తుంటే డ్రాకులామీద తీవ్రమైన ద్వేషం కలుగుతోంది. దేవుడు ఆమెకు అన్యాయం చెయ్యడని ఆశ. నయం, మినా నిద్రపోతోంది, కలలు లేకుండా. నేను బాగా అలసిపోయినా, నిద్రరావటం లేదు. అయినా నిద్రపోవటానికి ప్రయత్నించాలి. రేపు చెయ్యాల్సిన పనులున్నాయి ...

తర్వాత : నాకు బాగా నిద్రపట్టేసినట్టుంది. మినా వచ్చి నా ప్రక్కన కూర్చుని లేపేదాకా లేవలేదు. ఏదో ఆశ్చర్యంగా నా మొహంలోకి చూసింది. గదిలో వెలుతురు వుంది. ఆమె తన చేతిని నా నోటిమీద వుంచి హెచ్చరికగా సైగచేసింది. మెల్లగా చెవులో అంది :

''హుష్ ! వరండాలో ఎవరో వున్నారు.''

నేను మెల్లగా లేచికూర్చున్నాను. అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి తలుపు తీసాను.

బయట తివాసిమీద కాళ్ళు చాచి పడుకుని వున్నాడు మోరిస్. ఎంతో మెలకువగా వున్నాడు. నన్ను చూసి చెయ్యి పైకెత్తి మెల్లగా అన్నాడు—

''ష్ ! లోపలికి వెళ్ళిపొండి. అంతా బాగానే వుంది. ఇక్కడ ఎవరో ఒకళ్ళం కాపలా వుంటాం. ఏం జరక్కుండా చూస్తాం.''

అతన్ని అర్థం చేసుకుని లోపలికి వచ్చి మినాతో చెప్పాను. ఆమె తేలిగ్గా నిట్టూర్చింది. చిన్నగా నవ్వింది. తన రెండు చేతులు నా చుట్టూ వేసి —

''అబ్బ ! ఎంత ధైర్యమైన వాళ్ళు మనకి అండగా వున్నారు'' అంది.

మళ్ళీ వెనక్కివాలి నిద్రలో మునిగిపోయింది. ఇప్పుడిదంతా రాస్తున్నాను. నిద్రరావటంలేదు. అయినా మళ్ళీ ప్రయత్నించాలి.

అక్టోబర్, 4 (ఉదయం) : మధ్యలో ఒకసారి మినా నన్ను మళ్ళీ లేపింది. కంగారుగా అంది.

''వెళ్ళు — వెళ్ళీ ప్రొఫెసర్ని పిలుచుకురా. వెంటనే ఆయన్ని చూడాలి నేను.''

''ఎందుకు ?'' అడిగాను.

''నాకో ఆలోచన వచ్చింది. నాకు తెలీకుండానే నా బుర్రలోకి ఆ ఆలోచన వచ్చింది. సూర్యోదయంలోపు ఆయన నన్ను హిప్నటైజ్ చెయ్యాలి. అప్పుడు మాట్లాడగలను. వెంటనే వెళ్లి ఆయన్ని తీసుకురా. తొందరగా రావాలి. తెల్లవారబోతోంది'' అంది. నేను తలుపుదగ్గరికి పరుగెత్తాను. బయట డాక్టర్ సెవార్డు తివాసీ మీద కూర్చున్నాడు. నన్ను చూడగానే లేచి నిలబడ్డాడు.

''ఏమయింది ?'' అడిగాడు ఆత్రుతగా.

''ఏం లేదు. మినా డాక్టర్ వాన్‌హెల్సింగ్‌ని వెంటనే చూడాలని కోరుతోంది'' అన్నాను.

''నేను వెళతాను'' అంటూ వాన్‌హెల్సింగ్ గదివైపు పరుగెత్తాడు డాక్టర్ సెవార్డు.

రెండు మూడు నిముషాల తర్వాత వాన్‌హెల్సింగ్ డ్రెస్సింగ్ గౌనుతో వచ్చాడు. డాక్టర్ సెవార్డును, మోరిస్, ఆర్థర్‌లు ఏవో ప్రశ్నలువేస్తూ కనిపించారు.

మినా పెదాలమీద చిరునవ్వు కనిపించగానే ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ మనసు తేలిక పడింది.

''హో ! డియర్ మేడమ్ మినా. మీలో మంచి మార్పు కనిపిస్తోంది. చూసారా జోనాథన్? పూర్వం మేడమ్ మినా ఎల్లా సంతోషంగా కనిపించేదో, ఇప్పుడూ అలాగే వుంది !''అన్నాడు. మళ్ళీ ఆమెవేపు తిరిగి ''ఇప్పుడు నేను ఏం చెయ్యాలి చెప్పండి. ఎంతో పనివుంటేగానీ నన్ను మీరు పిలవరు !'' అన్నాడు.

''మీరు నన్ను హిప్నటైజ్ చెయ్యాలి. అదికూడా, సూర్యోదయంలోపు చెయ్యాలి. అప్పుడు నేను మనసులో వున్నదంతా చెప్పగలను. తొందరగా కానివ్వండి. వేళ మించిపోతోంది'' అంది.

ఒక్కమాటకూడా మాట్లాడకుండా, వాన్‌హెల్సింగ్ ఆమెను మంచం మీద కూర్చోబెట్టాడు.

చూపులు ఆమె మీద కేంద్రీకరించాడు. ఆమె ఎదురుగా నిలబడి తన చేతుల్ని గాల్లో కదుపుతూ ప్రయోగం చేసాడు. మినా ఆయన వంకే చూస్తూ వుండిపోయింది కొన్ని క్షణాల వరకు. ఆ సమయంలో . నాకు గుండె వేగంగ కొట్టుకుంది, ఏదో ప్రమాదం జరగబోతోంది అన్నట్టుగా. క్రమక్రమంగా ఆమె కళ్ళుమూతలు పడ్డాయి. కదలిక లేకుండా కూర్చుని వుంది. ఆమె రొమ్ముల కదలికవల్ల ఆమె ప్రాణంతో వున్నదని, వూపిరి తీస్తున్నదని మాత్రం తెలుస్తోంది. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ మరికొన్ని సార్లు గాల్లో చేతులు వూపి ఆపేశాడు. ఆయన నుదురు చెమట పట్టింది. మినా కళ్ళు తెరిచింది. అప్పుడు ఆమె మినాలాగ అనిపించలేదు. ఆమె శూన్యంలోకి చూస్తోంది. ఆమె స్వరం మగతగా, దిగులుగా వుంది. వాన్‌హెల్సింగ్ తన చేతిని పైకెత్తి నిశ్శబ్దంగా వుండమని సైగచేసి, వాళ్ళిద్దర్ని కూడా లోపలికి తీసుకురమ్మని సూచించాడు. వాళ్ళిద్దరూ, అడుగులో అడుగు వేసుకుంటూ, వచ్చారు తలుపు దగ్గరికి వేసి. మంచానికి దగ్గరగా నిలబడ్డారు. మినా వాళ్లని గమనించినట్టు లేదు. అంత నిశ్శబ్దంలోను వాన్‌హెల్సింగ్ స్వరం మెల్లగా పలికింది.

''ఇప్పుడు నువు ఎక్కడున్నావు ?''

''నాకు తెలీదు. నిద్రావస్థలో వున్న ప్రాణికి చోటేమిటి ?'' అంది. చాలా నిముషాల వరకు మళ్ళీ నిశ్శబ్దం ఆవరించింది. మినా నిశ్చలంగా కూర్చుని వుంది. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఆమె వంక సూటిగా చూస్తున్నారు. మిగిలిన వాళ్లం వూపిరి బిగబట్టి గమనిస్తున్నాం. గదిలోకి కొద్దికొద్దిగా వెలుతురు వస్తోంది. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్, కిటికీ తెరలు తొలగించమని సైగ చేసారు నాకు. అలాగే చేసాను. తెల్లారినట్టు అనిపించింది. అరుణకాంతులు గదిలోకి వచ్చాయి. అదే సమయంలో వాన్‌హెల్సింగ్ మళ్ళీ అడిగారు—

''నువ్వు ఇప్పుడెక్కడున్నావు ?''

మగతగా జవాబు వచ్చింది. ''నాకు తెలీదు. అంతా కొత్తగా వుంది నాకు'' అది, ఆమె మామూలు గొంతులాగే వుంది కాస్త.

''నువ్వు ఏం చూస్తున్నావు ?''

''ఏమీ కనపడటం లేదు. అంతా చీకటిగా వుంది.''

''నువ్వు ఏం వింటున్నావు ?''

''నీళ్ల చప్పుడు ... ఎగసిపడుతున్న అలల








బులుసు వేంకటరమణయ్య

# విద్యా సౌకర్యాలు

ఇతర దేశాల కంటే మన దేశంలోనే నిరక్షరాస్యత ఎక్కువగా ఉన్నదని, విద్య నేర్చిన వారు చాలా తక్కువగా ఉన్నారనీ అందరికీ తెలుసును. ఆ కారణం వల్లనే అన్ని రంగాల్లోనూ మన దేశం చాలా వెనకబడి ఉన్నది.

నిరక్షరాస్యత నిర్మూలం కావడానికి ప్రాథమికావస్థ నుంచీ ప్రయత్నం అవసరం. అందువల్లనే ప్రభుత్వం నిర్బంధ విద్యావిధానాన్ని అమలు పెట్టడానికి అన్ని విధాలా కృషిచేసింది. కాని దానివల్ల సత్ఫలితాలు అనుకున్నంతగా కానరాలేదు. అందువల్ల పిల్లలను, వారిని బడికి పంపే తల్లిదండ్రులను ఆకర్షించడానికి పిల్లలకు బడులలో మధ్యాహ్నం ఉచిత భోజన పద్ధతిని ఏర్పాటు చెయ్యడం కొన్ని రాష్ట్రాలలో జరిగింది. దీనివల్ల కొన్ని కోట్ల ధనం ఖర్చయినా బడికి వెళ్ళే పిల్లల సంఖ్య పెరిగింది. ఇది ప్రాథమిక పాఠశాలలకే పరిమితమైనందున ప్రారంభ విద్యకు తగిన ప్రోత్సాహం లభించింది. అయినా పిల్లలకు, తలిదండ్రులకు మధ్యాహ్న భోజనంపై ఉన్నంత ఆసక్తి చదువుమీద ఉన్నట్లు తోచదు. ఉపాధ్యాయులకు కూడా ఈ భోజనాల ఏర్పాట్లలోనే కాలం చాలా వరకు గడచిపోతోంది.

ఈ పరిస్థితులను గమనించి తమ పిల్లలకు తగినట్లు విద్యను అభిలషించే తల్లిదండ్రులు ప్రభుత్వం అజమాయిషీలో లేని ఇతర పాఠశాలలలో తమ పిల్లలను చేర్చడానికి ఉత్సాహపడుతూ ఉంటారు. ఇది సహజమే! అయితే సక్రమంగా విద్యను బోధించే పాఠశాలల్లో ప్రవేశం లభించడం సులభం కాదు. పూర్వం కాలేజీలలో ప్రవేశం లభించడం ఎంత కష్టంగా ఉండినదో, ఇప్పుడు ప్రాథమిక పాఠశాలల్లో ప్రవేశం లభించడం అంతకష్టం! దానికి వందలకొద్దీ విరాళా లివ్వాలి. నెలనెలా పదుల లెక్కలో జీతం చెల్లిస్తూ ఉండాలి. అదనపు రుసుములు అప్పుడప్పుడు చెల్లిస్తూనే ఉండాలి. ఇలా చెల్లిస్తున్నా, తలిదండ్రులు కూడా ఇంటిలో శ్రద్ధగా బోధిస్తూ, చదివిస్తేగాని పరీక్షల్లో నెగ్గడం కష్టం! ఈ విధంగా పైకం చెల్లించలేనివారు తమ పిల్లలను ఉచిత భోజనం, ఉచిత విద్యాబోధన ఉన్న పాఠశాలలకు తమ పిల్లలను పంపవలసిందే! విద్యా వ్యాప్తి విస్తృతంగా జరగాలనే సంకల్పం నెరవేరడం అసాధ్యమయి పోయింది.

ప్రభుత్వం తన అధికారంలో ఉన్న పాఠశాలలు సక్రమంగా జరిగేటట్టు తగిన శ్రద్ధ తీసుకోవాలి. ఉచిత భోజన సౌకర్యంతో తృప్తిపడరాదు. అలాగే ప్రయివేటుగా నడపబడే పాఠశాలలు ప్రవేశానికి విరాళాలు వసూలు చెయ్యకుండా చూడాలి. అట్టి పాఠశాలలు తమ ఆజ్ఞను ఉల్లంఘిస్తే వాటిని నడపడానికి అనుమతిని ఇవ్వకూడదు. ఇలా జరగనప్పుడు ఎన్ని సౌకర్యాలు కలిగించినా విద్య పెంపొందదు. నిరక్షరాస్యత నిర్మూలం కాదు. ★



చప్పుడు. బయట నుండి వస్తున్నట్టుగావుంది.''

''అయితే నువు ఒక ఓడలో వున్నావా ?'' అడిగాడు వాన్‌హెల్సింగ్. ఆయనకి ప్రశ్నకు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నాం, అర్థం కోసం వెతుక్కుంటూ.

ఆమె జవాబు చెప్పింది ''అవును''

''ఇంకా నీకు ఏం వినపడుతోంది ?''

''పై భాగంలో ఎవరో మనుషులు పరుగెడుతున్న అడుగుల చప్పుడు — పెద్ద గొలుసు లాగిన చప్పుడు.''

''నువ్వు ఏం చేస్తున్నావు ?''

''హా! నేను నిశ్చలంగా వున్నాను, చచ్చినట్టుగా'' ఆమె స్వరం మెల్లగా తగ్గింది. తెరిచిన కళ్లు మూసుకున్నాయి మళ్లీ.

అప్పటికి సూర్యోదయమైంది. పూర్తిగా పగటి వెలుగు వచ్చింది. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ తన రెండు చేతులను మినా భుజాల మీదవేసి మెల్లగా ఆమె తలను దిండు మీద వుంచాడు. కొన్ని క్షణాలు పసిపాపలా పడుకుంది. తర్వాత పెద్ద నిట్టూర్పు విడుస్తూ లేచి, చుట్టూవున్న మనుషుల్ని చూసి ఆశ్చర్యపోయింది. ''నేను నిద్రలో వుండి మాట్లాడుతున్నానా ?'' అంది. ఆమెకు పరిస్థితి అర్థమయినట్టు కనిపించింది. అయినా, తను ఏం చెప్పిందో వాన్‌హెల్సింగ్ చెప్పగా వినాలనుకుంది. జరిగిన సంభాషణను వాన్‌హెల్సింగ్ ఆమెకు వివరించాడు.

## జీవన్మృతులు

''అయితే మీరు క్షణం ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు. ఇంకా కొద్ది అవకాశం వుండి వుంటుంది'' అంది.

మోరిస్, ఆర్థర్‌లు బయటకు వెళ్లటానికి సిద్ధపడ్డారు. కానీ ప్రొఫెసర్ మెల్లగా అన్నాడు—

''ఆగండి! ఈమె చెప్పినప్పుడు ఓడ లంగరు వేస్తున్నారు. ఇక్కడ లండన్ పోర్టులో, ఆ సమయంలో ఎన్నో ఓడలకు లంగరు పడి వుంటుంది. ఏ ఓడ అయివుంటుందని మీ వుద్దేశం? ఇక్కడ మనకొక్క కిటుకు తెలుసు, దానివల్ల వుపయోగం వుందో లేదోగానీ. డ్రాకులా ఆలోచన ఒకటయి వుంటుంది. అతను బంగారం డబ్బు తీసుకుని పారిపోద్దలచాడు. నిజంగా పారిపోటం. మనమందరం అతని వెంటపడుతున్నాం అని తెలిసిపోయింది. లండన్‌లో ఇక అతనికి చోటులేదు. మిగిలిన ఒక్క పెట్టెను ఓడ ఎక్కించి వుంటాడు. లండన్ వదిలేస్తాడు. పారిపోదామనుకుంటున్నాడుగానీ, అలా వీల్లేదు. మనం వెంటబడాలి. కానీ ఇప్పుడు ఆ ఓడ సముద్రంలోనే వుంది. తీరం చేరలేదు. ఇప్పుడే కదా సూర్యోదయమైంది. సాయంత్రంవరకు మనకు సమయం వుంది. అంతవరకు విశ్రాంతి తీసుకోవచ్చు. హాయిగా స్నానంచేసి, బట్టలు మార్చుకుని, భోజనం కానిద్దాం. కడుపునిండా తిందాం, ఎందుకంటే డ్రాకులా ఈ దేశంలో లేడు కాబట్టి.''

''కానీ అతన్ని మళ్లా వెతికి పట్టుకోవటం ఎందుకు ? వెళ్లినవాడు వెళ్లాడు కదా ?'' అంది మినా ఎంతో నెమ్మదిగా.

వాన్‌హెల్సింగ్ ఆమె చెయ్యి నిమురుతూ—

''నన్నేమీ ఇప్పుడు అడగవద్దు. మన కాస్త తిన్నతర్వాత, ప్రశ్నలకు సమాధానం చెపుతాము' అన్నాడు.

భోజనం దగ్గర మళ్ళీ అదే ప్రశ్నవేసింది మినా. ఆమెవంక ఓ నిముషం గంభీరంగ చూసి, తర్వాత ఎంతో విచారంగా అన్నాడు –

''మేడమ్ మినా, ఇంతకన్నా ఎక్కువగ అతన్ని వెతికి పట్టుకుని, నరకానికి పంపించాలి.'

ఆమె మొహం పాలిపోయింది. ''ఎందుకు?'' అడిగింది.

''ఎందుకంటే, అతను శతాబ్దాల తరబడి బతుకుతాడు. మీలాంటివాళ్లను లోబరుచుకుంటాడు, వాళ్ల గొంతుకింద తన కోరలతో గుర్తులుపెట్టి'' అన్నాడు.

అంతే. మినా స్పృహతప్పి పడిపోయింది. సమయానికి ఆమె క్రింద పడిపోకుండా పట్టుకున్నాను.

[ఇంకా వుంది]




## ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం.

**మీ పాపాయి పెరుగుదల కోసం ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్**

ప్రొటీన్ కొరత నుండి పాపాయిని రక్షించడానికి బ్రాండ్ చేయబడిన ఘన ఆహారంలోని ప్రొటీన్ పరిమాణం మరియు ఘన ఆహారం తయారు చేసి ఇచ్చే తీరుకు సంబంధించిన కొన్ని ప్రమాణాలను విశ్వ ఆరోగ్య సంస్థ నిర్ధారించినది. నిర్దేశించిన రీతిలో ఫారెక్స్ ఘన ఆహారం తయారు చేసి ఇస్తే అది మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్‌ను సమృద్ధంగా కల్గి వుంటుంది.

**ఆరోగ్యవంతమైన రక్తం కోసం అదనంగా ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్**

"తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగి పోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి."

—డా. సుభాష్ సి. ఆర్య.

పాపాయి రక్తానికి, రోగ-ప్రతి రోధక శక్తిని ఎక్కువ చేయడానికీ, అతి సామాన్య ఆరోగ్యం మరియు పెరుగుదల కోసం అత్యంత ముఖ్యమైన ఐరన్ అదనంగా కల్గి వున్నది ఫారెక్స్.

**పాపాయి పళ్లు మరియు ఎముకలకు అతి ముఖ్యమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్ సరియైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్**

పళ్లు మరియు ఎముకలు చక్కగా ఏర్పడటానికి మీ పాపాయికి కావాలి కాల్షియం మరియు ఫాస్ఫరస్. కాని, 2:1—ఈ నిష్పత్తిలో ఈ రెండూ కలిసి వుంటేనే పాపాయికి ఎక్కువ లాభం చేకూరుతుంది. ఈ అత్యావశ్యక తత్వములను ఆదర్శ ప్రాయమైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్. అది మీ పాపాయి ఎక్కువ ఆరోగ్యవంతమైన ఎముకలు మరియు ఎక్కువ దృఢమైన పళ్లు నిశ్చయంగా పొందేలా చేస్తుంది.

**ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్**

మీ పాపాయి సున్నితమైన జీర్ణ శక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది ఫారెక్స్.






డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్®**

గ్లాక్సో ఉత్పాదన

CASGLF-40-244 TEL

# అవీ ఇవీ అన్నీ

## శ్రీ వేంకటేశ్వర పూజా విధానమ్

సంకలనకర్త : అన్నంబొట్ల వేంకట సూర్యనారాయణ. సహస్ర నామములు, అష్టోత్తర శతనామావళితో మంత్రపుష్పముతో, సూచనలతో 46 పేజీలలో సంపూర్తిగా పొందుపరచబడిన ఈ పుస్తకం వెల మూడు రూపాయలు. ప్రతులకు సంకలనకర్త పేర, రిటైర్డ్ ప్రిన్సిపాల్, 1-3-176/4/c/18, గాంధీనగర్, హైదరాబాద్, అన్న చిరునామాకు వ్రాయాలి.

## రుక్మిణీ వంటల పుస్తకం

రచన : డి. ఎస్. రుక్మిణి. వంటల రీతులలో ప్రత్యేకత గల ఈ పుస్తకం వెల ఇరవై రూపాయలు. 339 పేజీలు. ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్, విజయవాడ-520002.

## దేవుళ్ళారా! మీరెక్కడ?

రచన : ఆవేదన. వెల: రెండున్నర రూపాయలు. 13 పేజీలు. ప్రతులకు రచయిత పేర, రైల్వే క్వార్టరు నెం. 73/ఎ, మర్రిపాలెం (నార్త్) విశాఖపట్నం-18 (ఎ. పి.) అన్న చిరునామాకు వ్రాయాలి.

## మేఘాలకు రాగాలు

వచన కవితల సంపుటి. రచన: శిరీష. వెల: ఆరు రూపాయలు, 84 పేజీలు, ప్రతులకు : సాంస్కృతి సమాఖ్య, నున్న, విజయవాడ--521212.

## కుసుమ గుచ్ఛము

రచన : శ్రీ మధునాపంతుల వేంకట పరమయ్య. వెల : 3 రూపాయలు. 34 పేజీలు. ప్రతులకు రచయిత పేర, సీనియర్ తెలుగు పండితులు, లూథరన్ హైస్కూలు, పెద్దాపురము, తూ. గో. జల్లా అన్న చిరునామాకు వ్రాయాలి.

## 1999 లో జగత్ప్రళయం!?

రచన : శ్రీ జి. సి. కొండయ్య. వెల : 12 రూపాయలు. 129 పేజీలు. ప్రతులకు : నవభారత్ బుక్‌హౌస్, ఏలూరు రోడ్డు. విజయవాడ-2.

## రామ్స్ ఇన్‌టెరెస్ట్ రెకొనర్

ఫర్ బ్యాంకింగ్ అండ్ ట్రేడ్ (ఇంగ్లీషు)

రచయితలు : శ్రీ దారా రామలింగమ్, డా. ఎన్. వి. కోటేశ్వరరావు. వెల : 5 రూపాయలు. 12 పేజీలు. ప్రతులకు : స్పెక్ట్రమ్ పబ్లికేషన్స్, 6-3-192, జైనగర్ కాలనీ, న్యూబోయిగూడా, సికిందరాబాద్-500003.



# వంటలు

## తిరంగి టిక్కా

కావలసినవి :– బ్రెడ్ – 8 స్లైసులు, పాలు – 1 కప్పు, పాలవిరుగుడు (వెన్న)–200 గ్రా., పంచదార – 250 గ్రా., నెయ్యి - కొద్దిగా, చెర్రీపళ్ళు – 8.

తయారుచేసే విధానం :– ముందుగా పంచదారను లేతపాకం పట్టి ఉంచుకోవాలి.

బ్రెడ్ స్లైసుల చుట్టూ కాలిన భాగాలను తీసేసి గుండ్రంగా కోసుకొని ఉంచుకోవాలి. ఒక పాత్రలో కాచి చల్లార్చిన పాలు తీస్కోవాలి. బాణలిలో నెయ్యి పోసి పొయ్యిమీద పెట్టాలి. బ్రెడ్ ముక్కలను పాలల్లో ముంచి వెంటనే వేయించుకోవాలి. వీటిని పైన తయారుచేసుకున్న పాకంలో ముంచి, తీసేసి ప్రక్కన పెట్టుకోవాలి.

మిగిలిన పాకంలో 2 స్పూన్ల పాలు వేసి మళ్ళీ సన్నటి సెగమీద పెట్టాలి. ఈ మిశ్రమాన్ని వడబోసి మడ్డిలాంటిదేమైన ఉంటే వేరు చేసేయాలి. ఇప్పుడు చెన్నను బాగా మెత్తగా ఉండేటట్టు పిసికి బ్రెడ్‌ముక్క సైజుకు సగం ఉండేటట్టుగా గుండ్రటి బిళ్ళలు 8 చేసుకోవాలి. ఈ చెన్న బిళ్ళలను పైన చెప్పిన పాకంలో వేసి మళ్ళీ పొయ్యిమీద పెట్టాలి. పాకం దగ్గర పడ్డాక దించి చెన్న బిళ్ళలను వెంటనే తీసి బ్రెడ్ ముక్కల మీద అమర్చాలి. చల్లారాక ఇవి అతుక్కుంటాయి. వేడిగా ఉన్నప్పుడే వీటిమీద చెర్రీ పళ్ళు కూడా అమర్చాలి.

– జరీనా

## మైదా ఖజూర

మైదా – 1½ కె. జి., డాల్డా – ½ కె.జి., చక్కెర – 1½ కప్పు, వంటసోడా – చిటికెడు, ఏలక్కాయలు – 4.

చక్కెర మెత్తగా నూరి, మైదాపిండిలో వేసి, సోడా కలిపి, 4 చెంచాల డాల్డా వేడిచేసి ఆ పిండిలో వెయ్యాలి. నీళ్ళు పొయ్యకుండా ఆ పిండిని బాగా కలపాలి. గుప్పెడు మైదాపిండిని తీసుకొని రెండు అరచేతులమధ్య వేసి బాగా రుద్దాలి. అరగంట వరకు మొత్తం పిండినంతా రుద్దాలి. తర్వాత కొద్దిగా నీళ్ళు చిలకరించి పిండిని తడి పొడిగా కలపాలి. ఏలకులు పొడి చేసి ఆ పిండిలో కలపాలి పావుగంట తర్వాత పిండినంతా కలిపి చిన్న చిన్న ఉండలుగా చేసుకోవాలి. ఒక వుండను తీసుకొని నిలువుగా అన్నం పిడచకట్టినట్టుగా నొక్కి మరుగుతున్న డాల్డాలో దోరగా వేయించాలి.

– వి. తులసీదేవి.

## దాల్ మిక్చరు

కావల్సిన వస్తువులు : పెసలు 1 కప్పు, బఠానీలు–1 కప్పు, శెనగలు–1 కప్పు; మినువులు 1 అర కప్పు; అలచందలు – 1 కప్పు; కారం – 2 చెమ్చాలు; కరివేపాకు రెబ్బ, ఉప్పు, నూనె :

తయారుచేయు విధానము : పెసలు, శెనగలు, బఠానీలు, మినువులు, అలచందల (బొబ్బర్లు) వీటిని రాళ్ళు లేకుండా ఏరి, నీళ్ళలో ఒక రోజంతా నానబెట్టాలి.. మర్నాడు నీళ్ళనుంచి తీసి ఒడగట్టి పొడి బట్టలో పోసి మూటకట్టి పెట్టుకోవాలి. ఆ మూటను మూడవ రోజున విప్పితే మొలకలెత్తి వుంటాయి.

బాణలిలో నూనెపోసి బాగా కాగాక దానిలో తగినన్ని చొప్పున మొలకలెత్తిన గింజ ధాన్యాలు పోసి వేయించాలి. వేగి బల్లతేరిన తర్వాత చిల్లుల గిరిటెతో బాగా నూనె ఓడ్చి పొడి గిన్నెలో పోసుకోవాలి. అన్నీ అదే మాదిరి వేయించుకుని, మెత్తని ఉప్పు, కారం, కరివేపాకు వేసి కలిపి గాలి చొరని డబ్బాలో నిల్వ పెట్టుకుని కావల్సినప్పుడు సర్వ్ చెయ్యవచ్చును. సర్వ్ చేసేముందు తగిన ఉల్లి ముక్కలు, కొత్తిమీర, నిమ్మరసం వేసి యివ్వవచ్చును. ఈ "దాల్ మిక్చరు" రకరకాలైన మొలకెత్తిన పప్పుధాన్యాలు కలవటంతో చాలా బలవర్ధకమైనది. రుచిలో అద్భుతంగానే గాక క్రిస్పీగా ఉంటుంది.

– వల్లిశ్రీ నాగరాజ్

## బీట్‌రూట్ హల్వా

కావలసిన వస్తువులు :– బీట్‌రూట్ దుంపలు ఆరు, నెయ్యి రెండు కప్పులు, పంచదార 1/4 కె.జి. జీడిపప్పు పది పలుకులు, ఎండు కొబ్బరి కోరు, 1/2 కప్పు, పాలు ఒక గ్లాసు (చిక్కటివి), పచ్చ కర్పూరం కొంచెం.

తయారు చేయు విధానం :– ముందుగా బీట్‌రూట్ దుంపల్ని నీటిలో కొంచెం సేపు ఉంచాలి; ఇలా ఉంచటంవల్ల దుంపలకున్న మట్టి పూర్తిగా పోతుంది. తరువాత దుంపలు కడిగి వాటిపైన చెక్కు బాగా తీసేసి ఒక పక్కన ఉంచుకోవాలి. తర్వాత కొబ్బరి కోరు, జీడిపప్పు దోరగా నేతిలో వేయించి పెట్టుకోవాలి. కొబ్బరి కోరం శుభ్రంగా తుడిచి బీట్‌రూట్ దుంపల్ని సన్నగా కోరి ఆ కోరును పళ్ళెంలోకి తీసుకోవాలి. బాణలిలో నెయ్యి పోసి స్టవ్‌మీద పెట్టాలి. నెయ్యి కాగిన తరువాత కోరును వేసి వేయించాలి. మాడిపోకుండా జాగ్రత్తగా వేయిస్తుండాలి. కోరు పొడిగా వేగిన తరువాత పాలు పొయ్యాలి. అయిదు నిముషాల తరువాత పంచదారను వేసి కలపాలి. మధ్య, మధ్యలో నెయ్యి కూడా వేసి కలుపుతుండాలి. కోరు బాగా దగ్గరగా అవుతుండగా కొబ్బరి కోరు, జీడిపప్పు వెయ్యాలి. మిశ్రమం ముద్దగా అయి దించేముందు ఏలకుపొడి, పచ్చ కర్పూరం కలిపి పళ్ళెంలోకి తీసి ఆరనివ్వాలి. బీట్‌రూట్ హల్వా చాలా రుచిగా ఉంటుంది.

— పి. భానుమతి శాస్త్రి *



# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## డాక్టర్ నార్ల సూచనలు :

అకాడెమీలన్నిటినీ కలిపి వేయాలని సాంస్కృతిక వ్యవహారాల సలహాదారు డాక్టర్ నార్ల వేంకటేశ్వరరావు ప్రభుత్వానికి సూచించినట్టు తెలుస్తున్నది. అకాడెమీల పని తీరును పరిశీలించి వాటి భవిష్యత్తును సూచించడానికి తెలుగుదేశం ప్రభుత్వం డాక్టర్‌గారిని ఏకసభ్య సంఘంగా నియమించడం అందరికీ తెలిసిందే. అకాడెమీల నన్నిటినీ ఒక్కటిగా చేయడం సాధ్యం కాకపోతే సాహిత్య భాషా అకాడెమీలను ఒక్కటిగాను, ప్రదర్శన కళలకు సంబంధించిన అకాడెమీల నన్నిటినీ ఒక్కటిగాను చేయవచ్చునని కూడ డాక్టర్ నార్ల సూచించారట. సాంస్కృతిక డైరెక్టరేట్ అధికార దుర్వినియోగానికి, లంచగొండి తనానికి, బంధుప్రీతికి ఆలవాలమయింది గనుక దానిని కూడ రద్దు చేయాలనీ ఆయన సూచించారట. ఆయన సూచనలోని మరికొన్ని వివరాలివి : సాంస్కృతిక డైరెక్టరేటు, వివిధ అకాడెమీలు ఆ సాంస్కృతిక కార్యక్రమాలకు ధనాన్ని దుర్వినియోగం చేస్తున్నాయి. ఇవి ఇచ్చే గ్రాంట్లు చాలవరకు నామమాత్రమే. కళాసాహిత్య సంస్థలకు, నామమాత్రపు వ్యక్తులకు అందుతున్నాయి. కేవలం లెటర్‌హెడ్స్ మాత్రమే వున్న పెక్కు సంస్థలు ఏటా పదివేలు మొదలు నలభైవేలవరకు గ్రాంట్లు స్వాహా చేస్తున్నాయి. ఎలాటి నియమ నిబంధనలు లేని సంస్థలు, ముఖ్యంగా కల్చరల్ డైరెక్టరేట్ అనుగ్రహ దృష్టిలో వున్న సంస్థలు సాధ్యమయినంత ఎక్కువ గ్రాంట్లను కబళిస్తున్నాయి. సంఘాలకు గాని, దుర్దశలో వున్న కళాకారులకు గాని గ్రాంట్లు ఇవ్వదలచినప్పుడు, పూర్తిగా పరిశీలన జరపాలి. కల్చరల్ డైరెక్టరేటు ఏర్పడకముందు, ఒక శాఖగావున్న కల్చరల్ శాఖకు సిబ్బంది పరిమితంగా ఉండేది. ప్రస్తుతం పెరిగిపోయి, డైరెక్టరేటుకు కేటాయించిన డబ్బులో సగం సిబ్బంది జీతాలకే అవుతున్నది. ఈ డైరెక్టరేటులోని ఉద్యోగులు కొందరికి ఏదో ఒక సాంస్కృతిక సంఘంతో సంబంధం వుంది. వారు ఆ యా సంఘాలకు తమ పలుకుబడితో డైరెక్టరేటు నుంచి గ్రాంట్లు పొందగలుగుతున్నారు. కొందరు ప్రముఖులు అధికారులు కూడ ఏవో నామమాత్రపు సంస్థలు పెట్టి డైరెక్టరేటు నుంచి డబ్బు లాగుతున్నారని వింటున్నాము. కొందరు డైరెక్టరేట్ అధికారులు సాంస్కృతిక సంబంధాల స్థాపన పేరుతో అన్యరాష్ట్రాలకు, దేశాలకు కూడ విలాస యాత్రలు జరుపుతున్నారు. జంట నగరాలలోని సంస్థలే గ్రాంటులలోని ఎక్కువ భాగాన్ని మింగివేస్తున్నాయి; జిల్లాలకు గ్రాంట్లు అందడంలేదు. కనుక గ్రాంట్ల పంపిణీకి జిల్లా సంఘాలు నియమించాలి. ప్రభుత్వం డాక్టర్ నార్లగారి సలహామేరకు పునర్నిర్మించే శాఖను మళ్లీ పాతపందికొక్కులే హస్తగతం చేసుకో ప్రయత్నిస్తున్నాయని వదంతులు వ్యాపించాయి. రాష్ట్రంలో సమర్థతకు కొరతలేదు. అకాడెమీలకు సంబంధించిన పాతవారినెవరినీ నియమించరాదు. వారిని నియమిస్తే షరామామూలే.

## సైకిల్‌పై దేశ పర్యటన :

భిలాయ్ వాస్తవ్యుడైన శ్రీ దివాకర్‌పాండే అనే 24 సంవత్సరాల యువకుడు భారతదేశ పరిస్థితులను సన్నిహితంగా పరిశీలించి గ్రహించడానికి సైకిల్‌పై భారత పర్యటనచేస్తూ మే 18న హైదరాబాద్ వచ్చాడు. శ్రీ పాండే సోషియాలజీలో ఎం. ఎ. ప్యాసయాడు. ఒక పాఠశాలలో పనిచేస్తూ, భిలాయ్‌లోనే "రాష్ట్రీయ సమాచార్" అనే వార పత్రికను నడుపుతున్నానన్నాడు. ప్రేమ్ శిక్షా మండలి అనే సంస్థ ప్రోత్సాహంతో ఈ సైకిల్ పర్యటన చేస్తున్న పాండే ఇంతవరకు మధ్యప్రదేశ్, మహారాష్ట్రంలో పర్యటించాడు. ఆంధ్రప్రదేశ్ పర్యటనానంతరం తమిళనాడుకు వెళ్లతాడు. ఈయన గడచిన సెప్టెంబర్‌లో పర్యటన ప్రారంభించాడు. సంవత్సరంలోగా దేశంలోని వివిధ ముఖ్య ప్రాంతాలు చూచి, తన అనుభవాలను తన పత్రికలో వరుసగా వ్యాసాలు వ్రాస్తానన్నాడు. ఉత్తర భారతంలో మతోన్మాదం హెచ్చుగా వుందని, ఆంధ్రప్రదేశ్‌లో సహజీవనం చాల చక్కగావుందని పాండే ప్రశంసించాడు. ఆంధ్రుల్లో ప్రేమాదరాలు, మానవత్వం చాలా వుందని అన్నాడు.

## గొడ్డళ్ళ కథ :

ఆరు దశాబ్దాలనాటి ఒక సంస్కృత వాచకంలో ఒక కథ చదివాను. అది గొడ్డళ్ళ కథ. ఒక రైతు పట్నంలో గొడ్డళ్లు చేయించుకొని భుజంపై వేసుకుని పోతున్నాట్ట తన ఊరికి. దారిలో ఒక అడవి వచ్చింది. రైతు భుజం మీద వేలాడుతుండే గొడ్డళ్లదండ చూచి చెట్లు గడగడ వణికిపోయాయట. ఇక మనకు పతనం తప్పదు, నరుకులు తిని కూలిపోవడానికి సిద్ధంగా వుండాలి అని. అప్పుడొక ముసలిచెట్టు చెప్పిందట: వెర్రి వెధవల్లారా భయమెందుకర్రా ! అవి వట్టి గొడ్డళ్లు. మనని ఏమీ చేయలేవు. మనవాడు వాళ్లతో చేరినప్పుడే మనకు ముప్పు. అంతవరకు భయపడకండి— అని. ఇదీకథ. మనవాడంటే, ఈ కథలో గొడ్డళ్లకు కామ. కామ చెట్టుదిగదా! ఏ పక్షానికైనా, ముఖ్యంగా రాజకీయ పక్షాలకు ఈ కథ చాల అవసరం. మనవాడు ఎదిరితో చేరితేనేగాని మన రహస్యాలు బైట పడవు. అప్పుడే మనకు ముప్పు. తెలుగుదేశం పార్టీలో అలాటి మనవాడు చాలమంది ఉన్నారని, వారు నిజమో, కాదో, కొన్ని వందతులు వ్యాపింపజేస్తున్నారని వింటున్నాము. ఇలాటి వదంతులు దంతంతై క్రమంగా పార్టీని తొక్కేస్తాయి. కనుక నాయకులు అప్రమత్తులై వుండాలి. ఇలాటివాటి కంతా విరుగుడు పార్టీలో ప్రజాస్వామ్య విధానం. అదే పార్టీకి శ్రీరామ రక్ష. అలాటి శ్రీరామరక్ష కోరేవారు, తమ పార్టీతో ఎదిరివారు భేదోపాయం చేయకుండా, తమ పార్టీ వారిని ప్రలోభాలతో చీల్చకుండాను జాగ్రత్తపడాలి. ఒకసారి చీలిక ఏర్పడిందా, అది క్రమంగా పెద్దదవుతుందేకాని, చేరిపోదు. ముఖ్యమంత్రికి చాల సన్నిహితులైనవారే ఇతరత్రా నోరు జారుతున్నారని కొందరంటున్నారు; అలాటి వాటికి అవకాశమివ్వరాదు. గొడ్డళ్ల కథను ఏ చాణక్యుడో, ఏ రాక్షస మంత్రో — ఎవరు కనిపెట్టాడోగాని రాజకీయాలకు మూలమంత్రం.

## బి. జె. పి. నిరసన ప్రదర్శన :

భారతీయ జనతా పార్టీ నగరశాఖ అధ్యక్షుడు శ్రీ నరేంద్ర నాయకత్వాన మే 2వ తేదీ మధ్యాహ్నం గొప్ప నిరసన ప్రదర్శనం జరిగింది. రాష్ట్రంలో నానాటికీ పెరుగుతున్న దోపిడీలు, దొంగతనాలు, దౌర్జన్యాల దృష్ట్యా క్షీణిస్తున్న శాంతి భద్రతలకు నిరసనగా ఈ ప్రదర్శనం ఏర్పాటు చేశారు. ప్రదర్శనానంతరం సచివాలయం వద్ద జరిగిన బహిరంగ సభలో పలువురు నాయకులు శాంతి భద్రతలు క్షీణించడాన్ని గురించి ప్రసంగించారు. ప్రదర్శనంలో పార్టీ నాయకులు శ్రీయుతులు బి. బాలిరెడ్డి, టి. రామచంద్రారెడ్డి, కరుణాకర్, మున్నగువారు పాల్గొన్నారు.

# ఆరోగ్యం, మజా, జోరూ తోడు జోడుగా!
# తాగండిక బోర్న్‌విటా.




మీ కుటుంబంలోని వారికి క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా యివ్వండి. దానిలోని రుచి అంటే వాళ్ళందరికీ మహాయిష్టం. బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలు గల కోకో, మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా ఉన్నాయి. బోర్న్‌విటా మీ కుటుంబంలోని వారందరికీ ప్రతిరోజూ యివ్వండి-రోజుకు రెండుసార్లు.

క్యాడ్‌బరిస్
**బోర్న్‌విటా** దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక










# హైదరాబాద్ నోట్‌బుక్

## వి. ఎల్. దేశ్‌ముఖ్ కాలధర్మం :

ప్రముఖ రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ ప్రచారకులు, విఖ్యాత సంఘసేవకులు శ్రీ వి.ఎల్. దేశ్‌ముఖ్ మే 24వ తేదీ ఉదయం కాలధర్మం చెందారు. ఆయన వయస్సు 64 సంవత్సరాలు. శ్రీ దేశ్‌ముఖ్ మహారాష్ట్రలోని యోట్‌మల్ వాస్తవ్యులు. తమ 20వ ఏట హైదరాబాద్‌కు ఆర్.ఎస్.ఎస్. ప్రచారంకోసం వచ్చారు. ఆయన బ్రహ్మచారి. ఆర్. ఎస్. ఎస్. సంస్థలో వివిధ పదవులు నిర్వహించారు. వివిధ రంగాలలో దేశ్‌ముఖ్ సేవను ఆర్.ఎస్.ఎస్. వివిధ సంస్థలు ప్రశంసించాయి. దేశ్‌ముఖ్ ఐదు సంవత్సరాల పాటు రాష్ట్ర భారతీయ జనతాపార్టీ వ్యవస్థాపకులుగా వున్నారు. పిదప భారతీయ వికాస యోజనా సమితిని నెలకొల్పి, తద్వారా బీదలకోసం పెక్కు ఆస్పత్రులు, విద్యాసంస్థలు నిర్వహించారు. రాష్ట్ర భారతీయ జనతాపార్టీ అధ్యక్షుడు శ్రీ పి. వి.చలపతిరావు ముస్నగువారు శ్రీ దేశ్‌ముఖ్ సేవను ప్రశంసించారు.

## సంకరజాతి మామిడిపళ్లు :

సంగారెడ్డిలోవున్న ప్రాంతీయ ఫల పరిశోధన కేంద్రం ప్రసిద్ధమైన 73 మామిడి జాతుల నుంచి 151 సంకర జాతులను సృష్టించింది. వాటిలో రెండు సంకర జాతులు రుమానీ–నీలం, దేశేహరి – మహమూదాలను హైదరాబాద్ మామిడిపళ్ల ప్రదర్శనంలో వ్యవసాయశాఖా మంత్రి శ్రీ జనారెడ్డి విడుదల చేశారు. ఈసారి మామిడిపంట అనుకున్నదానికన్నా తక్కువ. 19 లక్షల టన్నులే పండింది. మామిడిపంటలో ఆంధ్రప్రదేశ్ రెండవ స్థానంలోవుంది. కాని హెక్టారుకు దిగుబడి విషయంలో ప్రథమస్థానం.

## ఉపశ్రుతి :

చూచారా, నిరుద్యోగులైన డాక్టర్లసంఖ్యలో మన రాష్ట్రందే అగ్రస్థానమట అన్నారు నాతో ఒకరు. వైద్యుడయినవాడు ఎక్కడైనా బతగ్గలడు. కాని, మన వైద్యపట్టభద్రులకు ఫలానావూరిలోనే ఉద్యోగాలుకావాలి. వారి తల్లిదండ్రులకు డొనేషన్లు మొదలుకొని హౌస్ సర్జన్సీవరకు ఖర్చుపెట్టిన మొత్తమంతా వెంటనే రావాలి. నిరుద్యోగం వ్యాపించకుంటే ఏమౌతుంది ?– అని ప్రశ్నించారు మరొకరు.

— తిరుమల రామచంద్ర ✱

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
Editor : S Radhakrishna.

# ప్రవేశపెడుతున్నాం
# జై కిసాన్
# సామ్రాట్
# 18:46:0




**మీ పంటలను ఉవ్వెత్తున పెరిగేటట్లు చేసేందుకు అత్యధిక ఫాస్ఫేట్ గలది.**

* 18% నత్రజని, 46% ఫాస్ఫేట్ (డీఏపీ) జోరుగా, తొందరగా పెంచగల బలవర్ధకమైన సంకీర్ణ రసాయనిక ఎరువు.
* వరి, చెరకు, ప్రత్తి, నూనె గింజలు, పప్పు ధాన్యాల్లాంటి పంటలు బాగా ఏపుగా పెరగటంకోసం, అధికంగావున్న ఫాస్ఫేట్ తోడ్పడుతుంది.
* నీటిలో పూర్తిగా కరుగుతుంది—దాని పూర్తి లాభం మీ పంటలకు అందుతుంది.
* అత్యధిక పోషక పదార్థాలు....అతి తక్కువ ఖర్చులో!
* నత్రజని పూర్తిగా అమ్మోనియా రూపంలో ఉండటంవల్ల, నష్టపోవడం అంటూ ఏమీ ఉండదు.




# జై కిసాన్ ఎరువులు

**అత్యధిక దిగుబడుల కోసం అత్యధిక పోషణ.**

**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.**

సికింద్రాబాదు, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగపూర్, పుణె, జువారీనగర్.

LINTAS 2UA 112 2315 TL

# safari

## మీలాగే జీవితంలో ముందుకు వెళ్ళాలనే కోరికగల బ్రీఫ్‌కేస్ ఇదే!

ఎందుకంటే, దీని పేరూ, తిరహాయే వేరు, ఓ ప్రత్యేకతగల బ్రీఫ్‌కేస్. దీని పేరు చెప్పగానే మరి మీరు. దృఢంగా, పనికొచ్చే తీరులో అరలుగా విభజింపబడినది, బయట నుంచి చూడ్డానికి ఎంతో అందంగా, ఆకర్షణీయంగా ఉంటుంది. మీరూ, ప్రయాణం, ప్రయాణం, సఫారీ, ఒకే కథలోని పాత్రలు నిజానికి.



**safari LUGGAGE**

ప్రయాణంలో మీకు తోడునీడగా

ULKA-SL-3-83 TE.